మా ఖాతాదారులకు అభిమానులకు స్వాతంత్ర్యదిన శుభాకాంక్షలు!

420 Estd 1941 Grams UMA

అందానికి, మన్నికకు "ఉమా" గోల్డు కవరింగు ఆభరణములను వాడండి

**UMA REAL GOLD SHEET COVERED JEWELLERY WILL ALWAYS BE ECONOMICAL**






*Yes, it is economical & durable for Several Years*

GENUINE GOLD SHEET COVERED 'UMA' JEWELLERY MFRS. & EXPORTERS




# UMA GOLD COVERING WORKS

H.O. UMA MAHAL :: MASULIPATAM...

SALES DEPOTS:

| 90, CHINA BAZAAR MADRAS-1 | 581, SIVALAYAM St., VIJAYAWADA-1 | 104, AVENUE Rd., BANGALORE-2 |
|---|---|---|

మా ఇతర సేల్సు డిపోలు 534, పైక్రాఫ్ట్సు రోడ్డు, మద్రాసు-5

4-4-8/1 సుల్తాన్ బజార్, హైదరాబాద్-1 (దిల్ షాద్ టాకీస్ వద్ద)

# ఈసంచికలో



ముఖచిత్రం : ముత్యాల జల్లు
రతనాల మెరుపు-
బంగారు తలపు

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00
దీపావళి ప్రత్యేక సంచికతో రు.17-00
యువ వడపళని మద్రాసు - 26.



జూలై 'యువ' సంచిక అత్యంతాకర్ష ణీయంగా వెలువడినదనడంలో సందేహం లేదు. కథలలో "చపలత్వమా! నీపేరే స్త్రీ!" కథ మెచ్చుకోదగినదిగా వుంది. "దేవ దాసు" విషాదంగా ముగిసి, మా మనసుల్ని కలతపరచినా, "సంసార చక్రం" ముగింపు మా కెంతో ఆనందాన్ని కల్గించింది. వడ్డాది పాపయ్యగారి చిత్రాలు యువకు ఆణి ముత్యాలు.

శ్రీ గంభీర్ & వీణ, హైద్రాబాద్-20.

జూలై నెల 'యువ' లో ప్రచురించిన శ్రీ అందేగారి కథ "చపలత్వమా నీ పేరే స్త్రీ!" చాలా బాగుంది. టైటిల్ చూడగానే ముందు చాల కోపం వచ్చింది. కాని కథ అంతా చదివాక, పూర్తిగా ఆ కథతో యేకీభవించకుండా ఉండలేకపోతున్నాను. స్త్రీగా నేను ఇలా వ్రాయటం చాలమంది సోదరీ మణులకు నాపై కోపం కూడ రావచ్చు. కాని, ఈ కథలోని సహజత్వాన్ని కాదనే సాహసం నాకు లేదు.

ఇంత చక్కటి కథ వ్రాసిన శ్రీ అందే గార్కి, ప్రచురించిన మీకు నా ధన్య వాదాలు.

'రాఘవంశీ', విశాఖపట్టణం-4.

# ఏజంట్లకు మనవి

ప్రతి నెలా ఐదవ తేదీ లోపుగనే, కావలసిన కాపీలకు డబ్బు పంపుతూ ఆర్డరు యివ్వకోరుతున్నాము. ఆ తర్వాత వచ్చిన ఆర్డరుకు మేము కాపీలు సప్లయి చేయలేము. కొందరు ఏజంట్లు యింకా డిపాజిట్ పూర్తిగా చెల్లించ లేదు. వారిని వెంటనే డిపాజిట్ పంపకోరుచున్నాము ఏజంట్లు యిది గమనించ ప్రార్థన.

మేనేజరు

**యువ**

1, ఆర్కాట్ రోడ్

మద్రాసు-26




# విశిష్టతయే ప్రాధాన్యత గల వారికి...




ఎల్లప్పుడు ప్రభాత్ ఉత్పాదనల కోసం అడగండి

ప్రభాత్ లాంతర్లు మరియు ఎలెక్ట్రిక్ మ్యాంటిల్‌లు 40 సంవత్సరముల అనుభవము ఫలితముగా తయారుచేయబడుచున్నవి అవి మీ ఇంట్లో వుండుటకు అమూల్యమైనవి ప్రభాత్ గ్లో ల్యాంప్‌లు స్టవ్‌లు బర్నర్‌లు మరియు విక్ స్టవ్‌లు ఇబ్బంది కలుగ జేయకుండా పని చేయుటకు ప్రసిద్దికెక్కినవి



Pearl Pub PUL/589 Tel




## ప్రభాత్
ప్రఖ్యాతి గాంచిన పేరు

## ప్రభాత్ ఉద్యోగ్ లిమిటెడ్
బొంబాయి-60

ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు శ్రీ రామ కార్పొరేషన్, ఏలూరు రోడ్ విజయవాడ-2
బ్రాంచ్‌లు: హైదరాబాద్ రాజమండ్రి మరియు విశాఖపట్నము

# అంతు లేని ఆనందాన్ని పొందండి
# చూయింగ్ గమ్ చప్పరించి చూడండి!




కమ్మని పెప్పర్‌మింట్ రుచిగల
చిక్‌లెట్స్
చూయింగ్ గమ్




**60 పైసలకు 12** **10 పైసలకు 2**




అడమ్స్‌వారి
శ్రేష్ఠమైన తయారీ













"చిన్న కుటుంబమే - సుఖవంతమైన కుటుంబం"

యువ
సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 21 ఆగస్టు, 1970 సంచిక 8

సాధారణ పరిస్థితులలో, జులై మాసం వచ్చిందంటే, దేశం కళకళలాడుతూ వుంటుంది. మృగశిరకార్తె అయిపోయి, ఆర్ద్రకార్తె నడుస్తూ వుంటుంది. దేశం అంతా వానలు కురిసి, భూమీ, ప్రజల మనసూ చల్లబడుతాయి. పైరులు కొంచెం కొంచెం పెరిగి, దేశమంతా పచ్చగా వుంటుంది.

అలాంటి చల్లటి కాలంలో, ఎండాకాలపు సెలవులు అయిపోయి, స్కూళ్లూ, కాలేజీలు పని చెయ్యడం ఆరంభిస్తాయి. విద్యార్థులకు మళ్లీ ఒక సంవత్సరపు చదువు ప్రారంభమౌతుంది. కొత్త పుస్తకాల పరిచయంతో, కొత్త క్లాసులలో కొత్త స్నేహితులతో, కొత్త టీచర్ల దగ్గర చదువుకోవడానికి విద్యార్థులు ఉత్సాహం చూపిస్తారు.

ఈ విధంగా ప్రారంభమైన కొత్త విద్యాసంవత్సరం పూర్తిగా, నిరాటంకంగా జరగడం, ఇటీవల కొన్ని సంవత్సరాలుగా సాధ్యం కావడంలేదు. దానికి కారణం, రాజకీయ నాయకులూ, కుల, మత వర్గాల నాయకులూ స్వప్రయోజనాల కోసం విద్యార్థులను ఉపయోగించుకోవడం ప్రారంభించడమే. ఎండాకాలపు సెలవులలో విద్యార్థులలో చాలామంది బస్తీల నుంచి తమతమ గ్రామాలకు వెళ్లిపోతారు. బస్తీలలో వున్నవారు కూడా, స్కూళ్లూ, కాలేజీలూ మూసివేసి వున్నందున, అందరూ కలుసుకోవడానికి నిర్ణీత స్థానం లేనందున, ఏ ఆందోళనలో పాల్గొనడానికీ ఎక్కువ అవకాశం లేకపోవడంవల్ల

రాజకీయ నాయకులకు అందుబాటులో లేకుండా వుంటారు. స్కూళ్లూ, కాలేజీలూ తెరవ గానే, విద్యార్థులకు కూడలి ప్రదేశాలు అమరుతున్నాయి. తమ చెప్పుచేతలలో వున్న, కొందరు విద్యార్థి నాయకులచేత విద్యార్థులందరినీ ఉద్యమాలలోకి లాగడం రాజకీయ, వర్గనాయకులకు సులువు అవుతున్నది.

ఇటీవల కొద్ది సంవత్సరాలుగా, దేశంలో విద్యార్థులు పాల్గొన్న ఉద్యమాలను పరిశీలిస్తే, వాటిలో ప్రతి ఉద్యమమూ వర్గరాజకీయాలకు సంబంధించినదో, ఎవరో ఒక నాయకుడో, ఏదో ఒక పార్టీయో తన స్వప్రయోజనాలకు ఆరంభించినదో తప్ప, దేశాన్ని ఉద్ధరించడానికిగాని, రాష్ట్రాన్ని బాగుచెయ్యడానికిగాని, ప్రజల ఆర్థిక పరిస్థితులను చక్కబరచడానికిగాని ఉద్దేశింపబడినది కాదు. ఈ ఉద్యమాలలో పాల్గొన్న విద్యార్థులకు కలిగిన ప్రయోజనం ఏమైనా వుందా అంటే, తమ చదువు చెడటం, తల్లిదండ్రులు కష్టపడి పెట్టిన ఖర్చు వృథా అవటం తప్ప మరేమీలేదు.

విద్యార్థులను కూడదీసుకుంటేనే, తాము సాగించే ఆందోళన తీవ్రరూపం ధరిస్తుందని, ఉద్యమాలను సాగించే నాయకులు మన దేశంలోనే కాక ప్రపంచం అంతటా, ప్రతి దేశంలోనివారూ గ్రహించారు. విద్యార్థులను ఉద్యమాలలోకి లాగుతున్నారు. అమాయకులైన విద్యార్థులు, సమూహంగా ఉద్యమాలలో చేరడానికి కారణం ఏమిటంటే, అసలు ఆ ఉద్యమం ఏమిటో కూడా వారిలో చాలామందికి తెలియకపోవడం. ఆ ఉద్యమాన్ని ప్రారంభించడానికి నాయకుడు చెప్పే కారణాలు నిజమైనవేనా, ఆ నాయకుడు ప్రజలక్షేమం, దేశక్షేమం కోరి ఆ ఉద్యమాన్ని ప్రారంభిస్తున్నాడా అనే విషయాలు, నూటికి తొంభై మందికి పైగా విద్యార్థులకు తెలియనే తెలియవు. నాల్గవ ఫారము, మూడవ ఫారము చదివే విద్యార్థులకు, రాజకీయ విధానాలు గాని, పరిపాలనా పద్ధతులు గాని, ఏమి తెలుసును? అయితే, అత్యధిక సంఖ్యాకంగా విద్యార్థులు, ఏదో ఒక ఉద్యమంలో పాల్గొని, చదువులు మాని, బస్సుల మీదా, రైళ్ల మీదా రాళ్లు రువ్వి, తమ తల్లిదండ్రులతోపాటు అనేకమంది పౌరులకు కష్టాలనూ, నష్టాలనూ కలిగించడానికి కారణం ఏమిటి?

ప్రతి కాలేజీలోను, విద్యార్థుల సంఘం వుంటుంది. ఒక యూనివర్శిటీ ప్రాంతంలో వున్న కాలేజీ లన్నిటి విద్యార్థులకూ ఒక సంఘం వుంటుంది. కాలేజీలలో, ఆఖరు సంవత్సరం చదువులో వున్న విద్యార్థి, సాధారణంగా, యీ సంఘానికి అధ్యక్షుడుగా వుంటాడు. అతడిని కూడదీసుకుంటే, విద్యార్థుల మద్దతు పొందడం సులభం అని ఉద్యమాల నాయకులకు తెలుసు. కాలేజీ విద్యార్థులు చేరిన ఉద్యమంలోకి, హైస్కూలు, ఎలిమెంటరీ స్కూళ్ల విద్యార్థులను కూడా ప్రోత్సహించో, బెదరించో కూడదీసుకోవడం

సులభం. ఈ విధంగా, విద్యార్థులు తమకు సంబంధంలేని, తమకు అర్థం కాని ఉద్యమా లలో పాల్గొనడం సంభవిస్తున్నది.

ఆఖరు సంవత్సరం చదువులో వుండి, చదువు అయిన తరువాత, ఉద్యమ నాయకులు తనకు ఏదో ఉపకారం చేస్తారనే ఆశతో, తాను ఏదో ఒక ఉద్యమంలో పాల్గొన డమే కాక తనతోటి విద్యార్థులను కూడా ఉద్యమంలోకి లాగడమూ, తరువాత ఆఖరు పరీక్ష తప్పినా, ప్యాసయినా తన విద్యార్థిత్వం ముగిసినందువల్ల విద్యార్థి నాయకుడుగా వుండటానికి వీలులేక, ఉద్యమ నాయకుల చుట్టూ తనకు ఏదైనా దారి చూపించమని తిరిగేవారు, యీనాడు దేశంలో చాలామంది ఉన్నారు. కాని, వీరి ప్రయోజనం అయి పోయినందువల్ల, వీరిని ఉద్యమ నాయకులు ఉదాసీనంగా చూడడమూ, వృథాగా యితరుల ప్రయోజనాల కోసం తమ భవిష్యత్తును పాడుచేసుకున్నామే అని వారు దుఃఖించ డమూ జరుగుతున్నది.

తాము బాగుపడాలంటేనూ, తమ కుటుంబాలు బాగుపడాలంటేనూ, తమ రాష్ట్రమూ, దేశమూ బాగుపడాలంటేనూ, విద్యార్థులు శ్రద్ధతో తమ చదువును ముగించు కోవాలి.

వందలాది సంవత్సరాల తరువాత మనం స్వపరిపాలన పొందాము. ఇది వైజ్ఞానిక యుగం. ప్రతి దేశమూ వైజ్ఞానికంగా, అతి త్వరితగతిలో ముందుకు పోతున్నది. అలాటి పరిస్థితులలో, మన విద్యార్థులు శ్రద్ధగా చదువుకొని, తమ అభిమాన విషయా లలో ప్రవీణతను సంపాదించి, తమ ప్రజ్ఞవల్ల తమనూ తమ కుటుంబాలనూ, తమ దేశాన్నీ, అభ్యుదయ పంథాలో, ఇతర దేశాలతో సమంగానైనా నడపాలి.

చదువుకోవడానికి విశేషంగా అవకాశాలు లభిస్తున్న యీ రోజులలో, ఆ అవకాశా లను ఉపయోగించుకొనని విద్యార్థులు, ఉత్తరోత్తరా చాలా కష్టపడవలసి వస్తుంది. తాము బాగుపడకపోవడమూ, దేశానికి ఉపయోగపడకపోవడమూ మాత్రమేకాక, తమ తల్లి దండ్రులకు అపారనష్టాన్ని కలిగించిన వారవుతారు.

శాస్త్రవేత్తలుగా రాణించాలన్నా, పరిపాలనాదక్షత సందిపాంచుకోవాలన్నా, రాజ కీయ నాయకులవాలన్నా, విద్య ముఖ్యం. విద్యాభ్యాస కాలంలో, ఒక సంవత్సరం పోయిందంటే, జీవితావకాశాలలో, జీవితానుభవాలలో ఒక ఏడు, పూర్తిగా పోయినట్లే. ఇతరుల ప్రేరేపణలకు లొంగి, క్షణికమైన ఉద్రేకాలను తెచ్చిపెట్టుకొని, చదువు పాడుచేసుకోని విద్యార్థులే, భావికాలంలో అన్ని రంగాలలోనూ ప్రముఖులు అవుతారు.

యువతరంలోని విద్యార్థులు, అమూల్యమైన తమ కాలాన్ని వృథా చేసుకోక, ప్రారంభించిన చదువును జయప్రదంగా ముగించుకోవాలి.

# ?

—జి. సాంబిరెడ్డి.

రాజా రామగజపతిరాయలవారికీ, వెంకట సుబ్బారావు యమ్. ఎ; పి. హెచ్. డీ; కీ ఎలక్షన్లలో పోటీ వచ్చింది.

మద్దిలపాలెంలో వెంకట సుబ్బారావు యమ్. ఎ; పి. హెచ్. డీ; గారు బహిరంగ సభ పెట్టారు. ఇసుక వేస్తే రాలనట్లుగా జనం సర్దుకుని కూర్చున్నారు. ఆ జనసమూహాన్ని చూచి మహోత్సాహంతో ఉపన్యసించారు వెంకట సుబ్బారావుగారు. "మహాజనులారా!.........మన మంతా సామాన్యులం. మన కష్ట నష్టాలు, ఈతి బాధలు తెలిసిన వాడే, సామాన్యుడే, శాసనసభలో మన తరఫున ప్రతినిధిగా ఉండాలి. అది అత్యావశ్యకం. అట్టి వ్యక్తి మాత్రమే శాసనసభలో మన తరఫున గట్టిగా మాట్లాడి పనిచేయగలడు. అట్టి వాడిని యెన్నుకోవటమే మీ ముఖ్య కర్తవ్యం. ఈ సందర్భంగా ఈ నియోజకవర్గం నుంచి పోటీ చేస్తున్న నేను, అతి సామాన్య కుటుంబంలో పుట్టి, మీ మధ్య పెరిగి పెద్దవాడనైన నేను నా శాయశక్తులా మీ అందరి సౌభాగ్యానికీ కృషిచేయటానికి వీలుగా, ఓటు యొక్క పవిత్ర లక్ష్యాన్ని గుర్తెరిగిన మీరు, మీ పవిత్రమైన ఓట్లను నాకే యిచ్చి గెలిపించవలసిందిగా సవినయంగా ప్రార్థిస్తున్నాను." అయిదు నిముషాలసేపు సభంతా చప్పట్లతో మార్మోగిపోయింది. వెంకట సుబ్బారావుగారు సంతోషంగా గుండెలనిండా గాలి పీల్చుకున్నారు.

*　　　*　　　*

పోలింగ్ అయిపోయిన సాయంత్రం—

"ఒసే అప్పాయమ్మా! నీ ఓటెవరికిచ్చేసినావు?"

"ఎవరికేటి యెర్రి మొగమా? బాబుగోరు, ఎప్పుడూ కాలు కిందెట్టని బాబుగోరు, రాజాగోరు సొయంగా కాల్నడకని నడిసొచ్చేసి మన్ని ఓటడిగినోరు. కుల పెద్దగోరు కూడా సెప్పినారు. రాజాగోరి కిచ్చేక మరోరికిస్తనేటి?"

ఎలక్షన్లో ఎవరు గెలిచారో చెప్పనక్కరలే దనుకుంటాను.



చంద్రనాథుడి తండ్రి పెద్ద కర్మకు ముందురోజున అతనికీ, పినతండ్రి మణిశంకరుడికీ ఏదో మాటా మాటా వచ్చి మనస్పర్థ ఏర్పడింది. ఆ కారణంవల్ల మణిశంకరుడు మర్నాడు చంద్రనాథుడి యింటికొచ్చి అన్నగారి శ్రాద్ధకర్మ అంతా సక్రమంగా జరిపించినా, అతడు మాత్రం ఆ యింట భోజనం చెయ్యలేదు, తన వాళ్ళనూ

వచ్చి మంచినీళ్లు కూడా ముట్టనివ్వలేదు. అందరి భోజనాలూ ముగిసిం తరవాత చంద్ర నాథుడు పినతండ్రి దగ్గరకువచ్చి వినయంగా, "బాబాయ్, మీరు నాకు పితృ సమానులు. నా వల్ల ఏమైనా పొరపాట్లు జరిగివుంటే, యీ ఒక్కసారికీ క్షమించండి," అన్నాడు.

మణిశంకరుడు అయిష్టంగా ముఖంపెట్టి, "ఒరే, నాయనా! మీరు కలకత్తాచేరి ఎం. ఏలూ, బియ్యేలూ పాసైపోయి విద్వాంసులయారు. నేమో, యింకా ఆ పూర్వకాలపు ఛాందసులమే. మీకు నాబోటి వాడితో పొత్తు ఎలా కుదురుతుంది? సామెతలేదూ— వేళ్ళను కోసి చిగుళ్ళను పెంచమనీ...." అన్నాడు.

పినతండ్రి కటువు మాటలు విన్నమీదట చంద్రనాథుడు, యిక పినతండ్రితో ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకూడదనుకున్నాడు. తండ్రి బతికున్న రోజుల్లో కూడా ఆ ఇద్దరికీ చెప్పుకోదగ్గ ఆప్యాయత వుండేది కాదు. ఏవో భోజన సంబంధాల వరకు మాత్రం వుండేది. నేటితో అవి కూడా తెగిపోయాయి. తండ్రి చంద్రనాథుడికి మంచి ఆస్తి పాస్తులు ఒప్పగించి పోయాడు. కాని గృహంలో నా అని చెప్పుకోదగ్గ ఆత్మీయు లెవరూ లేరు. మేనమామ వ్రజకిశోరుడూ, అతని భార్య కాశీ మాత్రం వున్నారు. వాళ్లకు పిల్లా జెల్లా ఎవరూ లేరు.

కొద్ది రోజులు గడిచేసరికి చంద్రనాథుకి తనుంటున్నది వట్టి శూన్య గృహంలా తోచింది. అతడు గుమాస్తాను పిలిచి, "నేను యాత్రకు పోతున్నాను; తిరిగిరావటానికి చాలా కాలం పడుతుంది. ఇంటి వ్యవహారాలన్నీ జాగ్రత్తగా చూస్తూండు," అని చెప్పాడు.

ఆ సమయానికి అక్కడికి కొచ్చిన మేనమామ వ్రజకిశోరుడు,చంద్రనాథుడితో,"ఇప్పుడు యాత్ర లేమిటి? నీ మనసు అంత బాగా వుండటంలేదు. కొంత కాలంపాటు యింటి పట్టునే వుండు," అన్నాడు.

చంద్రనాథుడు మేనమామ సలహా లక్ష్యపెట్టక, జమ వ్యవహారాలన్నీ గుమస్తాకు ఒప్ప జెప్పి మర్నాడు ప్రయాణమయాడు. అతడు అటు యింటినుంచి బయిటికి పోగానే వ్రజ కిశోరుడి భార్య కాశీ భర్తను చాటుకు పిలిచి, "మీకు ఒక్క పనికూడా సక్రమంగా చేయటం చేతకాదు!" అన్నది.

"ఏమిటీ? అర్థంకాలేదు," అన్నాడు వ్రజకిశోరుడు ఆశ్చర్యపోతూ.

"తీర్థయాత్రలకంటూ దూర ప్రాంతాలకు పోతున్నాడు గదా....అతనిచేత ఏమైనా రాతకోతలంటూ చేయించారా? మనిషికి బుద్ధి ఏ క్షణాన ఎలా మారుతుందో చెప్పలేం. పైగా ఎంత దూరాభారపు తీర్థాలు! అక్కడేమైనా మంచీ....చెడూ జరిగితే, మనం ఎక్కడ తలదాచుకుంటాం?" అన్నది కాశి.




"రామ! రామ! అలాంటి అపశకునపు మాటలు ఎన్నడూ నోటరానియ్యకు," అన్నాడు ప్రజకిశోరుడు చెవులు మూసుకుంటూ.

కాశీ మండిపడిపోతూ, "మీరు వట్టి మూర్ఖులు. తెలివిగలవాళ్ళయితే బాగుపడే వుండే వాళ్ళం," అన్నది.

ప్రజకిశోరుడు అప్పటికి భార్య కేమీ సమాధానం యివ్వకుండా వూరుకున్నా, ఆ తర వాత రెండు మూడు రోజులకు తను పొరబాటు చేశానని పశ్చాత్తాపపడసాగాడు.

* * *

ఒక సంవత్సరంపాటు చంద్రనాథుడు ఏకాకిగా అనేక తీర్థాలు తిరిగాడు. తర్వాత గయకు వెళ్ళి, అక్కడ తండ్రిగారి సాంవత్సరీకం చేశాడు. ఇంతకాలం పరాయిచోట్ల కాలం గడిపినా అతడికి తిరిగి యింటికి వెళ్ళ బుద్ధికాలేదు. అతడికి కాశీ వెళ్ళి కొంత కాలం వుండాలనిపించింది. అక్కడ అతడి వంశస్థుడే అయిన హరిదయాల్ అనే పురో హితు డున్నాడు.

చంద్రనాథుడు ఒకనాటి పగలు రెండు ఝాముల వేళ చేతిలో సంచీ పట్టుకుని హరి దయాల్ యిల్లు చేరాడు. కాశీ పట్టణం అతడికి బాగా తెలిసిందే. లోగడ అతను అనేక సార్లు తండ్రి వెంట అక్కడికి వచ్చాడు. చంద్రనాథ్ హఠాత్తుగా యిలా రావటం చూసి, హరిదయాల్‌కు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. అతడు ఆప్యాయంగా అతణ్ణి ఆహ్వా నించి, మిద్దె పై భాగాన వున్న ఒక గదిని అతడికి బసగా ఏర్పాటు చేశాడు. ఆ గది కిటికీ

ఒకటి యింటి లోపలి వైపుకు వున్నది అక్కణ్ణించి చూస్తే వంట యింట్లో కొంత భాగం కనబడుతుంది చంద్రనాథుడు ఎక్కువసేపు అటుకేసి చూస్తూండే వాడు దుఃఖ భారంతో కుంగిపోతున్నట్టు కనబడే వంటావిడే అందుక్కారణం.

వంటావిడ అందమైనదే కాని, ఆమె ముఖంలో కనిపించే విషాదచ్ఛాయల కార ణంగా ఆమె వయసు యింత అయి వుంటుందని గ్రహించటం కష్టం. ఆమె వంట పనులు చేసుకుంటూ పోతూంటే, ఓ పదేళ్ల పిల్ల ఆమెకు వంట సామగ్రి అందిస్తూ సాయపడుతూండేది. వయసులో వంటావిడ చంద్రనాథుడి కన్న చాలా పెద్ద అనేది గుర్తించటం మాత్రం కష్టంకాదు.

మొదటి రోజుల్లో ఆమె చంద్రనాథుడి ఎదటపడటానికి కొంచెం సంకోచించినా, క్రమంగా ఆమెలో ఆ సంకోచంపోయి, అతడికి భోజనం పెట్టి అంత ఎడంలో కూర్చుని కూరలు అవీ అడిగి మరీ వడ్డించ సాగింది.

ఒకనాడు చంద్రనాథుడు, హరిదయాల్‌ను, "ఈమె మీ బంధువేనా?" అని అడిగాడు.

"బంధువేం కాదు. ఆశ్రయంలేని ఒక అనాధ బ్రాహ్మణి!" అన్నాడు హరిదయాల్.

"అలాగా! అయితే యిక్కడి కెలా వచ్చింది?" అన్నాడు చంద్రనాథ్.

"అదొక పెద్ద కథ. రెండు మూడు సంవత్సరాల కిందట....ఆ పిల్లను వెంటపెట్టుకుని భర్తతో తీర్థ యాత్రకు వచ్చిందట. అతడు యిక్కడ కాశీలో కలరా తగిలి చనిపోయా డట. ఇంటికి తిరిగి వెళ్లటానికి నా అనేవారెవరూ లేరట," అన్నాడు హరిదయాల్

"నే నడిగేది—యీ యింటికి ఎలా వచ్చిందని?" అన్నాడు చంద్రనాథ్.

"అదా! మణికర్ణికాఘట్టం వద్ద బిచ్చమెత్తుకుంటూంటే చూసి తీసుకొచ్చాను. తన సొంతవూరు నవద్వీపం వద్ద ఏదో పల్లె అనిచెప్పింది," అన్నాడు హరిదయాల్.

## 2

రెండు రోజుల తర్వాత చంద్రనాథ్, బ్రాహ్మణి వడ్డించగా తల వంచుకుని భోజనం చేస్తూ, మధ్యలో తల ఎత్తి ఆవిడ ముఖంలోకి సూటిగా చూస్తూ, "మీ రెవరు?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న వింటూనే బ్రాహ్మణి ముఖం వెలవెల పోయింది. కాని అంతలోనే ఆ ప్రశ్న విననట్టు వంటగదిలోకి పోయి అక్కడ ఒక గిన్నెలోంచి మరొక గిన్నెలోకి పాలు ఆరబోస్తున్న కూతురు సరయు ముఖంకేసి ఓసారి చూసి, "దీనరక్షకా! నన్ను క్షమించు!" అని మనసులో అనుకుని ఒక నిట్టూర్పు విడిచింది. తరవాత పాలగిన్నె తీసుకుని చంద్రనాథ్ దగ్గరకు వచ్చి, దాన్ని అతడి ముందు పెట్టింది చంద్రనాథ్ అదే

ప్రశ్న మళ్ళీ అడిగాడు. బ్రాహ్మణి లోగడ తాను హరిదయాల్‌కు చెప్పినట్టే చెప్పింది
"అదంతా హరిదయాల్ చెప్పగా విన్నాను. కాని, మీరు మీ యింటికి తిరిగి ఎందుకు వెళ్లలేదో నా కర్థం కావటంలేదు. అక్కడ మీకు ఒక్కగానొక్క దగ్గిర బంధువైనా లేడా?" అని అడిగాడు చంద్రనాథ్.

"....పట్టెడన్నం పెట్టేవారు మాత్రం ఎవరూలేరు," అన్నది బ్రాహ్మణి.

చంద్రనాథ్ ఓ క్షణం ఆగి, "అయితే మీరు మీ కూతురు వివాహం ఎలా చేస్తారు?" అని అడిగాడు.

బ్రాహ్మణి జవాబివ్వలేదు. చంద్రనాథ్ భోజనం ముగియటంతో లేచి, "మీ అమ్మాయి ఎలావుంటుందో నేను సరిగా చూడలేదు. వినయ విధేయతలున్న పిల్ల అంటూంటాడు, హరిదయాల్. అందంగా కూడా వుంటుందా?" అన్నాడు.

బ్రాహ్మణి చిరునవ్వు నవ్వి, "నేను తల్లినైపోయాను. తల్లి కళ్ళను నమ్మటానికి లేదు....అయినా, సరయు కురూపిమాత్రంకాదని చెప్పగలను," అన్నది.

ఆ తర్వాత రెండు మూడు రోజులకు, ఒకనాటి ఉదయం చంద్రనాథ్ వంటింట్లోకి వెళ్లి సరయూను కళ్లారా చూశాడు. అతడికి ప్రపంచంలో యిటువంటి అందం వుండటం అసంభవమనిపించింది. సరయూ కూర్చుని కూరగాయలు తరుగుతున్నది. ఆ సమయంలో తల్లి నదికి స్నానానికి వెళ్ళింది. హరిదయాల్ రోజూ మాదిరిగానే యాత్రికుల అన్వేషణకై వెళ్లాడు.

చంద్రనాథుడు, సరయూ పక్కగా నిలబడి, "సరయూ!" అని పిలిచాడు.

సరయు ఉలిక్కిపడి, తల వంచుకునే, "ఊం" అన్నది.

"నీకు వంట చేయటం చేతనవునా?" అని అడిగాడు చంద్రనాథ్.

సరయు, "ఆం" అన్నది.

"ఏమేమి వంటకాలు చేయటం నేర్చుకున్నావ్?" అన్నాడు చంద్రనాథ్.

సరయు మౌనంగా వూరుకున్నది. చంద్రనాథ్ ప్రసంగం మారుస్తూ, "యిక్కడ నువ్వూ, మీ అమ్మా పనిచేస్తున్నారా?" అని అడిగాడు.

సరయు తల ఎత్తకుండానే, "అవును," అన్నది.

"నీకు నెలకెంత జీతం యిస్తాడు, హరిదయాల్?"

"జీతం మా అమ్మ ఒక్కదానికే యిస్తారు. నాకు మాత్రం తిండి పెడతారు," అన్నది సరయు.

"నువ్వు కేవలం తిండికే యింతపనీ చేస్తున్నావా?"

ఈ ప్రశ్నకు సరయు జవాబివ్వలేదు. చంద్రనాథ్ ఓ క్షణం వూరుకుని, "నేను తిండి పెడితే మా పని చేస్తావా?" అని అడిగాడు



"అమ్మను అడుగుతాను," అన్నది సరయు చిన్న గొంతుతో.

"సరే, అలాగే అడుగు," అంటూ చంద్రనాథ్ గదినుంచి బయటికి వచ్చాడు.

ఆ రాత్రి అతడు హరిదయాల్‌ను, బ్రాహ్మణిని గురించి మరేవో ఒకటి రెండు ప్రశ్నలడిగి తెలుసుకుని, ఇంటికి గుమాస్తా పేర యిలా ఉత్తరం రాశాడు:

"ప్రస్తుతం నేను కాశీలో వున్నాను. ఇక్కడే ఓ నెల రోజుల లోపల వివాహం

చేసుకోవాలని నిశ్చయించాను. మామగారికి యీ సంగతి చెప్పి, కొంత డబ్బూ, నగలూ-యింకా అవసరం అయిన వస్తువులూ తీసుకుని బయలుదేరిరా."

ఉత్తరంలో రాసిన విధంగా, ఆ నెలలోనే చంద్రనాథ్, సరయూను వివాహం చేసుకున్నాడు. అత్తవారింటికి బయలుదేరేప్పుడు సరయూ కళ్ళనీళ్ళు పెట్టుకుని, "అమ్మ ఏమై పోతుందో!" అన్నది భర్తతో.

"ఏమీకాదు, మనవెంట వస్తుంది," అన్నాడు చంద్రనాథ్.

భార్యా భర్తల సంభాషణ బ్రాహ్మణి విని, కూతురును రహస్యంగా పిలిచి, "సరయూ, అత్తవారింటికి వెళ్లిం తర్వాత నన్ను మర్చిపోకు. కాని....ఆ విషయంమాత్రం బయట పెట్టకు. నేను బతికున్నంతవరకూ యిక్కడ కాశీలోనే వుంటాను. ఎప్పుడైనా నివ్విటు రావటం జరిగితే కలుసుకుందాం," అన్నది.

సరయు ఏడ్వసాగింది. బ్రాహ్మణి కూతురి కళ్ళ నీళ్లు తుడుస్తూ, "తల్లి మేలుకోసం, తల్లిని మర్చిపోవటమే నిజమైన మాతృభక్తి, సరయూ!" అన్నది.

ప్రయాణమైపోయే సమయంలో కూడా చంద్రనాథ్, బ్రాహ్మణిని తనవెంట రావలసిందిగా ఒకటికి రెండుసార్లు బలవంత పెట్టాడు. కాని, ఆమె కాశీ వదలలేనన్నది.

సరయూ, భర్త యింటికి వచ్చి—ఆ విశాలమైన భవంతినీ, సుఖంగా బతకటానికి అక్కడవున్న అంతులేని సౌకర్యాలనూ చూసి చాలా ఆశ్చర్యపడింది. ఆమె తన మనసులో, 'నిజంగా....వారు, నామీద ఎంతో అనుగ్రహం చూపారు' అనుకున్నది. చంద్రనాథ్, తన నవవధువును పిలిచి, "ఇల్లంతా చూశావు గదా? బావుందా?" అని అడిగాడు

సరయూ జవాబు చెప్పలేక సిగ్గుతో తల వంచుకున్నది. అతను రెండు చేతులతో ఆమె ముఖం పైకెత్తి, "చెప్పు, బావుందా?" అని మళ్ళీ అడిగాడు.

సరయు మరింతగా సిగ్గుపడిపోతూ, "యిదంతా మీదేనా?" అన్నది.

చంద్రనాథ్ నవ్వుతూ, "ఆఁ, ఇదంతా నీదే!" అన్నాడు.

కాలం గడుస్తున్నది. ఈనాడు సరయూ వివాహం నాటి బాలికకాదు. వయసూ, దానితోపాటు అందం మరింతగా పెరిగింది. భర్తకు సేవాశుశ్రూషలు చేయటం బాగా నేర్చుకున్నది. తను చెప్పకుండానే తన మనోభావాలు వూహించగలుగుతున్నదని చంద్రనాథ్ గ్రహించాడు. సరయు దాసిగా వచ్చివుంటే, అంతకన్న మంచి దాసి ప్రపంచమంతా గాలించినా చంద్రనాథ్‌కు దొరకదు. కాని, కేవలం దాస్యం చేయించుకోవడానికి ఎవడూ ఏ స్త్రీనీ వివాహం ఆడడు.

సరయూ ప్రవర్తన చాలా ఆహ్లాదంగా, మనోహరంగా వుండేది. కాని, చంద్రనాథ్ దాంపత్య జీవితంలో వుండే పరిపూర్ణమైన సుఖాన్ని పొందలేక పోతున్నాడు. ఒకనాడు



అతను, “నన్ను చూచి నువ్వింతగా భయపడుతున్నట్టు కనబడతావేం? నా ప్రవర్తనలో ఏమైనా లోపం వుందా?” అని అడిగాడు.

సరయు కొంచెంగా తల వంచుకుని, ‘ఈ ప్రశ్నకు సమాధానం మీకు తెలియంది కాదు! మీరు దైవసమానులు, మహానుభావులు, నేను పతితురాలను. మీరు దాతలు, నేను భిక్షకురాలను,’ అనుకున్నది మనసులో. కాని జవాబేమీ చెప్పలేదు. ఆమె కళ్లల్లోని

నీటిబిందువులు, దీపం వెలుగులో మెరుస్తున్నాయి. చంద్రనాథ్ ఆమెను ఆత్రుతతో దగ్గరకు తీసుకుని, "సరయూ, వూరికే అలా అడిగాను," అన్నాడు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచినై. చంద్రనాథ్, సరయును గట్టిగా హృదయానికి హత్తుకుని, "సరయూ, నా ప్రశ్న నీకు భయం కలిగించినట్టుంది, అందుకనే నా వంక చూడలేకపోయావు. ఒక పని చెయ్యి; నేను నిద్ర పోయింతర్వాత నా ముఖంకేసి ఓసారి చూడు, అక్కడ నీకు భయం కలిగించే చిహ్నాలేమైనా కనబడతవేమో! నా హృద యానికి ఆనుకుని వున్న నీ చెవులకు నా హృదయంలోని మాటలు వినబడటం లేదా? నువ్వు నన్నింతవరకూ అర్థంచేసుకోలేక పోయినందుకు చాలా విచారం కలుగుతున్నది," అన్నాడు పెద్దగా నిట్టూర్చుతూ.

*                    *                    *

చంద్రనాథుడి మేనమామ భార్య కాళికి, సరయూ వచ్చింతరవాత చాలా మనోవ్యథ పట్టుకున్నది. చంద్రనాథుడి తండ్రి మరణంతో యింటి పెత్తనమంతా తనదే అవుతుం దని ఆమె ఆశించింది. కాని, చంద్రనాథుడు తలవనితలంపుగా వివాహం చేసుకోవ టంతో ఆమె ఆశలన్నీ వమ్మయిపోయినై. కాళీ అక్కకు పద్నేళ్ల కూతురున్నది. ఆ పిల్లనూ, అప్పట్లో బ్రహ్మచారిగావున్న చంద్రనాథ్‌నూ ఊహించుకుని ఆమె చాలా ఆకాశసౌధాలు నిర్మించుకున్నది....

కావటానికి యిప్పుడూ యింటి పెత్తనమంతా కాళీ దంపతుల చేతుల్లోనే వుంది. ఇంటికి యజమానురాలైనా సరయూ చాలావరకు కాళీ దయాదాక్షిణ్యాలమీదే బతకవలసి వస్తోంది. కాళీకి దాదాపు ముప్పై ఏళ్లుంటాయి. సరయూకు యింకా పదిహేనేళ్ళయినా వెళ్లలేదు. అయినా, కాళీ వేసే ప్రశ్నలకు తల తిరిగే జవాబులిచ్చి, సరయూ ఆమె నోరు మూయించేది. ఈ ఇంటికంతకూ తానే యజమానురాలినని సరయూకు తెలియంది కాదు.

## 3

చంద్రనాథ్‌కు, హరిబాల అని దూరపు చుట్టం వున్నది. ఒకరోజున ఆమె అతడి యింటికి వచ్చేసరికి, సరయు పడమటింటి కిటికీ తెరిచి, బయటికి చూస్తూ నిలబడి వున్నది. హరిబాల ఒక చేతిలో ఫలహారమున్న పళ్లెమూ, రెండవచేతిలో మల్లెపూల చెండూ పట్టుకుని వచ్చి, పళ్లెం కిందపెట్టి చెండును సరయూ జడలోపెడుతూ, "యివ్వాళ నుంచి నువ్వు నాకు అక్కయ్య వయ్యావు. నన్ను చెల్లీ అని ఒకసారి పిలువు!" అన్నది.

ఇది ఆదరంకావచ్చు, వాత్సల్యంకావచ్చు—సరయూ జీవితంలో యింతకుముందు

యిలాంటి సంఘటన ఏనాడూ జరగలేదు కాని, వయసులో తన మిత్తివ ప్రాయంగల స్త్రీని కౌగలించుకుని, 'చెల్లీ' అనటానికి సరయూకు చాలా సిగ్గనిపించింది. హరిబాల ఆమె సంశయం గ్రహించి, చిరునవ్వుతో, "సరే, అలా అయితే నా పుట్టెదండ నా కిచ్చెయ్యి," అన్నది.

అప్పటికి సరయూ స్థిమితపడి, "అక్కను వెతకటానికి వెళరావా ఏం?" అన్నది.

హరిబాల నవ్వుతూ, "ఏమో అనుకున్నాను, నీకూ వ్యంగ్యంగా మాట్లాడటం బాగా చాతవునే. నువ్వు వట్టి మూగదానివని గ్రామంలో అంతా అనుకుంటారు. సరే, ఒకమాట చెప్తాను విను. ఈ ఊళ్ళో నీకు స్నేహితురాళ్ళెవరూలేరు. కొంత జమీందారీ యిల్లనీ, కొంత మీ కాళి నోటికి భయపడీ యిక్కడికిరారు. అందుకని యివాళ నిన్ను అక్కను చేశాను. ఈ పెద్దబంగళాలో రోజంతా తులసిమాల తిప్పుతూ కూర్చోటం కష్టం. ఇక నుంచి రోజూ మీ యింటికి వస్తూంటాను," అన్నది.

"ఆఁ, రోజూ వస్తూండమంటి!" అన్నది సరయు.

"అంటె ఏమిటి? నువ్వు రోజూ వస్తూండు, చెల్లీ! అనాలి," అన్నది హరిబాల కాస్త కోపంగా.

"చెల్లీ, నువ్వు రోజూ మా యింటికి వస్తూండు," అన్నది సరయు.

"ఆఁ, నేను రోజూ మీ యింటికి వస్తూంటాను, అక్కా," అన్నది హరిబాల తృప్తిగా నవ్వుతూ.

ఆ మరునాటి రోజునుంచి హరిబాల రోజూ సరయూ దగ్గిరకు వచ్చిపోయేది. క్రమంగా యీ అక్కా చెల్లెళ్ళ బాంధవ్యం బలపడ సాగింది. ఈ యిద్దరి స్నేహం కాళీ మనసుకు ఎలావుందో చెప్పటం కష్టంగాని, చంద్రనాథుడికి మాత్రం చాలా సంతోషం కలిగించింది

ఒకరోజున సరయూ, హరిబాల రాకకోసం రెండు జాములవరకూ ఎదురుచూసింది కాని హరిబాల రాలేదు. అడపాదడపా పడుతున్న వర్షం మూలాన రాలేక పోయిందను కున్నది, సరయు. ఆ రోజున ఉదయంనుంచే కాళీ కూడా యింట్లో లేదు. ఒంటరిగా కూర్చోవటం విసుగనిపించి, సరయూ భర్త చదువుకునే గదిలోకి వెళ్ళింది. ఎంతో అవ సరం అయిన పనివుంటే తప్ప ఎవరూ—ఆఖరికి సరయూకూడా ఆ గదిలోకి పోరు.

చంద్రనాథుడు చదువుతున్న పుస్తకం మీదినుంచి దృష్టి మళ్ళించి, "ఇవాళ నీ చెల్లి వచ్చి నట్టు లేదే!" అన్నాడు.

"రాలేదు."

"అందువల్లే నేను జ్ఞాపకం వచ్చివుంటాను'" అన్నాడు చంద్రనాథ్

- అంటే మీరు బ్రతికున్నంత కాలం
ఈ భీమా పాల్సీతో నాకు ఎలాంటి
సంబంధం ఉండదు కదండీ ?




సరయూ చిన్నగా నవ్వి, జ్ఞాపకం ఎప్పుడూ వుంటాను. ఇక్కడికి వచ్చేందుకు ధైర్యం చేయలేక పోతున్నాను; అనుకున్నది మనస్సులో.

"బహుశా వర్షంవల్ల రాలేక పోయిందేమో," అన్నాడు చంద్రనాథ్.

"కాదు. బాబాయిగారి చిన్నమ్మాయి నిర్మలకు పెళ్లి సంప్రతింపులేవో జరుగుతున్నవట అక్కడికి వెళ్లి వుంటుంది," అన్నది సరయు.

చంద్రనాథుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, "బాబాయికి మనమిద్దరమే పరాయి వాళ్లమయిపోయాం. అత్త ఎక్కడికి వెళ్లింది?" అని అడిగాడు.

"ఆమె కూడా అక్కడికే వెళ్లింది."

చంద్రనాథుడు తల వంచుకుని ఏదో ఆలోచించసాగాడు. సరయు పక్కగా వెళ్ళి కూర్చుని, "ఏమిటాలోచిస్తున్నారు?" అని అడిగింది.

చంద్రనాథుడు, సరయూ చేతిని తన చేతిలోకి తీసుకుని, "బాబాయి నాకు కబురన్నా చెయ్యలేదు....అదే ఆలోచిస్తున్నాను," అన్నాడు.

అతడి కంఠస్వరంలోని బాధ గ్రహించి సరయు, "నాకు ఆశ్రయం యిచ్చి వారికి మీరు పరాయివాళ్ళయి పోయారు," అన్నది.

చంద్రనాథుడు నవ్వి, "నాకు యిలా వుండటమే సుఖంగా వుంది. నిన్ను పెళ్ళి చేసుకోటానికి బాబాయి సలహాయే అడిగివున్నట్టయితే, ఈ పెళ్ళి జరిగేదేకాదు. కులమనీ, గోత్రమనీ ఏవో ఆటంకాలు కల్పించి, యిది కాకుండా చేసేవాడు," అన్నాడు.

ఆ మాటలతో తన చేతులో వున్న సరయూ చెయ్యి వణకటం చూసి, చంద్రనాథుడు ఆమె హృదయభావాన్ని గ్రహించి, "నేను బాబాయి సలహా అడగకపోవటం బావుందా? లేక అడిగివుంటే బావుండేదా?" అన్నాడు.

సరయూ కొంచెంసేపు మౌనంగా వూరుకుని, "నాకు తెలీదు. కాని, మీకు నా వంటి దాసీలకు కొరతంటూ వుండేదికాదు," అన్నది.

మర్నాడు హరిబాల సరయూ దగ్గిరకు వచ్చింది. కాని, యివాళ ఆమె ప్రవర్తనలో చాలా మార్పు కనిపిస్తున్నది. "చెల్లీ, పచ్చీసు ఆడుకుందాం, రా" అంటూ రోజూ మామూలుగా సరయూను బలవంత పెట్టలేదు.

"నిన్న రాలేదేం, చెల్లీ?" అనడిగింది సరయు.

"నిర్మల పెళ్లి మాటలు జరుగుతున్నవి గదా, వాళ్లింటికి వెళ్లాను," అన్నది హరిబాల.

"అఁ విన్నాను, ఖాయంచేసుకున్నారా?" అన్నది సరయు.

హరిబాల, సరయు ప్రశ్నకు జవాబు చెప్పకుండా, ఆమె ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "అక్కా, ఒక సంగతడుగుతాను, నిజం చెపుతావా?" అన్నది.

"ఏ సంగతి?"

"నిజం చెపుతానంటే అడుగుతాను, అలా కానప్పుడు అడిగి లాభమేమిటి?" అన్నది హరిబాల.

"ఎందుకు చెప్పను!" అన్నది సరయు.

"అయితే చెప్పు. చంద్రనాథుడు నిన్నెంతగా ప్రేమిస్తున్నాడు?"

సరయూ కొంత సిగ్గుపడి, "వారు నా మీద చాలా దయగా వుంటారు," అన్నది.

"దయ మాట కాదు నే నడిగేది, నిన్ను గాఢంగా ప్రేమిస్తాడా, లేదా?"

సరయూ నవ్వుతూ, "వారికి నామీద ప్రేమ ఎక్కువో, తక్కువో—ప్రగాఢమో... అవన్నీ నాకెలా తెలుస్తాయి?" అన్నది.

హరిబాల ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నదానిలా ముఖం పెట్టి, స్వగతంగా అనుకుంటున్నట్టుగా, "నిజమే, ఆడదానికి భర్త తన్నెంత ప్రేమించేదీ కనుక్కోవటం కష్టం.... యిదే నాకు చాలా సందేహం కలిగిస్తున్నది," అన్నది.

"ఏమిటా సందేహం?" అన్నది సరయూ.



హరిబాల, సరయూ గడ్డం పట్టుకుని, "ఆ సంగతి మరోసారి చెపుతాను. కాని సరయూ, యింత అందం, తెలివి తేటలూ వుండికూడా—ఇంతకాలం వరకూ నువ్వు గొడ్లు కాస్తున్నావా?" అన్నది.

హరిబాల చెప్పదలుచుకున్నదేమిటో అర్థంకాక, సరయూ చిరునవ్వు నవ్వి వూరుకున్నది.

## 4

హరిదయాల్‌కు మొదట్లో ఎలాంటి అనుమానమూ కలగలేదు. కాని, రెండు మూడు రోజులుగా ఆ చిరిగిన దుస్తులు ధరించిన వ్యక్తి వేళాపాళాలేకుండా వచ్చి, బ్రాహ్మణి సులోచనతో మాట్లాడిపోతూండటం గమనించిన తర్వాత, అతడికి పెద్ద అనుమానం కలిగింది. సులోచన మాత్రం హరిదయాల్‌కు యీ సంగతేమీ తెలియదనుకున్నది.

ఆ రోజున రెండు జాములవేళ హరిదయాల్ గదిలో కూర్చుని, కైలాసచంద్రుడితో చదరంగం ఆడుతున్నాడు. ఆ సమయంలో నడవా పక్కగది ప్రాంతం నుంచి చిన్న గల్లంతు అతడి చెవిన పడింది. బ్రాహ్మణి వినయంగా వేడుకుంటున్నట్టు మాట్లాడుతున్నది. రెండవ గొంతు కర్కశంగా జవాబిస్తున్నది.

"చూడు, నీ ఏనుగు చస్తున్నది!" అన్నాడు కైలాసచంద్రుడు.

హరిదయాల్ విసుక్కుంటూ లేచి, "కొంచెం ఆగు, ఆ గొడవేమిటో చూసి వస్తాను," అంటూ బయలుదేరాడు.

అతడు నడవా వాకిలి దగ్గరకు వచ్చేసరికి, సులోచన చిరిగిన దుస్తుల్లో వున్న ఒక పురుషుడి పాదాలు పట్టుకుని బతిమాలుతోంది. అతను, "నా మాట వినకపోయావో అన్నంతా చేస్తాను," అంటున్నాడు.

"నన్ను క్షమించు. లోగడ ఒకసారి నన్ను నరకకూపంలో పడదోశావు... మళ్ళీ నన్ను సర్వనాశనం చెయ్యకు," అంటున్నది సులోచన ఏడ్పు గొంతుతో.

"నీ కూతుర్ని అంత పెద్ద డబ్బున్న వాడికిచ్చి చేశావు గదా? రెండువేల రూపాయిలివ్వలేవా? డబ్బు ముట్టగానే వెళ్ళిపోతాను." అంటున్నా డతను.

"నీ స్వభావంమంచిదికాదు, తాగుబోతువి. ఆ డబ్బు నీ చేతిలో ఎన్ని రోజులుంటుంది! అది అయిపోగానే మళ్ళీ డబ్బుకోసం వస్తావు. ఏమైనా సరే నేను నీకు డబ్బు మాత్రం యివ్వను," అన్నది సులోచన.

"నేను తాగుడు మానేసి, ఏదైనా వ్యాపారం చేసుకుంటాను."

"క్షమించి యిక్కణ్ణుంచి పో. డబ్బుకోసం సరయూను బాధపెట్టటం నా వల్ల కాదు." అన్నది సులోచన.

అంతలో హరిదయాల్ వాళ్ళ ఎదటికి వచ్చి నూతన వ్యక్తితో, "నువ్వు ఎవరి అనుమతితో, యీ యింట్లోకి వచ్చావ్?" అన్నాడు గద్దిస్తూ.

నూతన వ్యక్తి పారిపోవాలని వెనుదిరిగాడు, కాని హరిదయాల్ గట్టిగా చేయిపట్టుకోవటంతో, యిక చేసేదిలేక, "సులోచనతో మాట్లాడేందుకు వచ్చాను," అన్నాడు

ఆ మాట్లాడేటప్పుడు అతడి నోటినుంచి గుప్పుమంటూ సారా వాసన వచ్చింది హరిదయాల్ ఏవగింపుగా ముఖం ఓసారి పక్కకు తిప్పి, "ఎవరి అనుమతితో వచ్చావని అడుగుతున్నాను, తెలిసిందా? నిన్నిప్పుడే పోలీస్ స్టేషన్‌కు లాక్కుపోగలను,"అన్నాడు

నూతన వ్యక్తి పకపక నవ్వి, "పోలీస్ స్టేషన్‌కు లాక్కెళతారా? నేను తలుచుకుంటే మిమ్మల్ని యీ కాశీనగరంలోనే లేకుండా చేయగలను," అన్నాడు.

"నన్ను నగరంలోనే లేకుండా చేస్తావా? ఆ రౌడీతనం ఏదో నేనూ చూస్తాను, పద," అన్నాడు హరిదయాల్.

"అయ్యా, ఇది రౌడీతనం కాదు. ఒకవేళ నన్నే గనక మీరు పోలీస్ స్టేషనుకు తీసుకుపోతే.... అక్కడ మీరు కులభ్రష్టులయ్యారని అందరికీ తెలిసిపోతుంది," అన్నాడు నూతన వ్యక్తి.

"నేను కులభ్రష్టుణ్ణయానా?" అన్నాడు హరిదయాల్ క్రోధంతో మండిపడిపోతూ.



“అంత కోపం తెచ్చుకోకండి. కులభ్రష్టులైంది మీ రొక్కరే కాదు, మిమ్మల్ని నమ్మి యీ మూడేళ్ళలో మీ ఇంటికి వచ్చి భోజనంచేసిన పెద్దమనుషులంతా కులభ్రష్టులై పోయారు.... నేను వాళ్ళ దగ్గిరక్కూడా పోయి, యీ సంగతి చెపుతాను.” అన్నాడు నూతన వ్యక్తి, గంభీరంగా ముఖంపెట్టి.

ఆ మాటలతో హరిదయాల్‌కు కొంచెం భయం కలిగింది. అతను గొంతు తగ్గించి, “నేను లోకులను కులభ్రష్టుల్ని చేశానా? ఏ విధంగా?” అన్నాడు.

“చెప్తాను. ఋజువుచేసే బాధ్యత కూడా నాదే.”

హరిదయాల్ ఆ జవాబుతో ఉలిక్కిపడి, “అసలు విషయం ఏమిటో రెండుమూడు ముక్కల్లో చెప్పు, నాయనా!” అన్నాడు.

నూతన వ్యక్తి చిరునవ్వు నవ్వి, “అలాగే చెప్తాను. మీరొక్కరే వింటారా, నలుగుర్నీ పిలవమంటారా?” అని అడిగాడు.

హరిదయాల్, ఆ నూతనవ్యక్తిని చేయిపట్టుకుని పక్క గదిలోకి తీసుకుపోయాడు. ఇద్దరూ కూర్చున్న తరవాత, “మీకు వంటా వార్పూ చేస్తున్న సులోచనను ఎక్కణ్ణించి తీసుకు వచ్చారు?” అని అడిగాడు నూతన వ్యక్తి.

"తీసుకు రావటం ఏముంది? దిక్కు లేనిదని ఆశ్రయం. యిచ్చాను. పేదబ్రాహ్మణి, విధవ, సదాచారిణి—ఇంత ఆమె చేతి అన్నం తింటే దోషమేముంది?" అన్నాడు హరిదయాల్.

"ఆమె బ్రాహ్మణ పేదరాలు, విధవ—అంతవరకు నిజమే! ఇల్లు విడిచి లేచివచ్చిన ఆడదాన్ని కూడా మీరు సదాచారిణి అంటారా? ఆమె వంటచేస్తే తినవచ్చా?" అని అడిగాడు నూతన వ్యక్తి.

"దీనికి ఋజువు?" అన్నాడు హరిదయాల్.

"ఋజు వెందుకులేదు? ఆమె ఇల్లు విడిచి ఎవరితో లేచి వచ్చిందో—ఆ ప్రేమమూర్తి రాఘల్‌దాసు యింకా జీవించే వున్నాడు."

హరిదయాల్ కొంచెంసేపు అతడి ముఖంకేసి పరీక్షగా చూసి, బహుశా యితడే ఆ రాఘల్‌దాసై వుంటాడనుకుని, "నువ్వు బ్రాహ్మడివా?" అని అడిగాడు.

ఆ నూతన వ్యక్తి చిరిగిపోయిన పంచెలోంచి యజ్ఞోపవీతాన్ని పైకి తీసి, "కాదు, వెర్రికాపును!" అన్నాడు.

హరిదయాల్ అతడికి కాస్త దూరంగా జరిగి కూర్చుని, "చూట్టానికి అస్పృశ్యుడిలా వున్నావు. సరే నమస్తే!" అన్నాడు.

"మీరేమైనా అనుకోండి, నేను రాఘల్‌దాసుననేది మాత్రం వాస్తవం," అన్నాడతను.

"అయితే, యిప్పుడొచ్చిందెందుకు, రాఘల్‌దాస్? సులోచనను తీసుకుపోతావా?" అని అడిగాడు హరిదయాల్ కోపాన్ని అణుచుకుంటూ.

"తీసుకుపోతే మీకు చాలా ఇబ్బందిగా ఉంటుంది. డబ్బు కావాలి. రెండు వందరూపాయ లిచ్చారంటే, నా దారిన నేను పోతాను," అన్నాడు రాఘల్.

"ఇంత డబ్బు నీ కెవరిస్తారనుకున్నావ్?" అన్నాడు హరిదయాల్ ఆశ్చర్యంగా.

"అపకీర్తి నుంచి బయటపడదలచిన వాళ్ళిస్తారు. మీరిస్తారు....లేకపోతే సులోచన అల్లుడిస్తాడు. ఏమంటారు?" అన్నాడు రాఘల్.

"అరే బాబూ, నేను చాలా బీదవాణ్ణి. సులోచన అల్లుడు యివ్వశక్తి గలవాడే గాని, అతను యివ్వడు. మరేదైనా యుక్తి ఆలోచించుకో," అన్నాడు హరిదయాల్.

"అలాగే ఆలోచిస్తాను. యత్నే కృతే యది నసిద్ధ్యతి కోత్ర దోషః," అన్నాడు రాఘల్‌దాసు.

హరిదయాల్ అతన్ని మధ్యలోనే ఆపప్రయత్నిస్తూ, "అంతటితో ఆగు నాయనా! దేవభాషను అపవిత్ర పరచకు," అన్నాడు.

"చిత్తం. ఇక నే వెళతాను. ఆ అల్లుడు ఎక్కడుండేదీ చెప్పండి."

"ఆ సంగతి సులోచననే అడిగి తెలుసుకోరాదా?" అన్నాడు హరిదయాల్.

"ఆవిడ చెప్పదు, మీరూ చెప్పననకండి. అలా అంటే, నేను చేయబోయే దేవిటో మీకు ముందుగానే చెప్పాను. అల్లుణ్ణి చూసి వస్తాను. బిడ్డను చూసి కూడా చాలా ఏళ్ళయింది," అన్నాడు రాఘల్.

"నువ్వేమైనా చేయి, ఆయన ఎక్కడుండేదీ చెప్పను. ఏదో తెలియక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. తీరిపోతుంది," అన్నాడు హరిదయాల్.

"సరే, ఈ రోజునే ఆ విషయం అంతా కాశీలో వున్న పండాలతో చెప్పేస్తాను. మీవల్ల జాతికుల భ్రష్టులైన యాత్రికులేమోగాని, కొత్తగా ఒక్క యాత్రికుడూ మీ దగ్గరకు రాడు. వెళ్ళిపోతారు....అప్రతిష్ఠ....అవమానం. సరే, వెళ్ళొస్తాను, సెలవు!" అంటూ రాఘల్ లేవబోయాడు.

హరిదయాల్ ఆతృతగా అతనిచేయిపట్టుకుని కూర్చోబెట్టి, "ఈ సంగతి ఎవరితోనూ అనకు. అయిదారు రోజుల్లో మళ్ళీరా. సాధ్యమైనంతలో నీ వడిగిన డబ్బు యిచ్చే ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

"ఆరోజునా యిలాగే వట్టిచేతులతో పంపితే మాత్రం మర్యాద దక్కదు," అన్నాడు రాఘల్.

హరిదయాల్, రాఘల్‌దాసు కేసి తీవ్ర దృష్టితో చూస్తూ, "ఏం బాబూ, నిజంగా నువ్వు బ్రాహ్మణ బిడ్డవేనా?" అని అడిగాడు.

"అవునండీ——"

హరిదయాల్ పెద్దగా నిట్టూర్చి, "సరే, అయిదారు రోజుల్లో రా. ఈ సంగతిమాత్రం ఎక్కడా అనకు," అన్నాడు.

"సరే," అంటూ రాఘల్ లేచి వాకిటిదాకా పోయి వెనక్కి తిరిగి వచ్చి, "నా మనీ పర్స్ ఎక్కడోపోయింది. రెండు రూపాయిలుంటే యివ్వండి," అంటూ పిరగబడి నవ్వసాగాడు.

హరిదయాల్ ఎక్కడలేని అసహ్యంతో అతడి ముఖమైనా చూడకుండా, రెండు రూపాయిలు తెచ్చి అతడి కిచ్చాడు. రాఘల్ మరి మాటాడకుండా బయటికి వెళ్ళాడు. హరిదయాల్ మౌనంగా చాలాసేపు గదిలో కూర్చుండిపోయాడు. అతడి శరీరమంతా జెర్రులూ, పాములూ పాకుతున్నట్టుగా వుంది.



# 5

సులోచన ఎటో వెళ్లిపోయింది. ఆమె కోసం మూడు రోజులపాటు హరిదయాల్ తిండీ తిప్పలూ మాని కాశీ అంతా గాలించాడు. ఆమె ఎక్కడా కనిపించ లేదు ఆఖరికి విసిగిపోయి ఇంటికి తిరిగివచ్చి, "ఓయి భగవంతుడా, ఇదేం దౌర్భాగ్యం! మంచి చేయబోతే చెడ్డె కూర్చున్నది. ఒక అనాధకు ఆశ్రయం యిచ్చి ఎంత పాపం ఒడిగట్టుకు న్నాను!" అని వాపోయాడు.

అతడున్న గొంది చివరనే కైలాసచంద్రుడి ఇల్లున్నది. హరిదయాల్ అక్కడికి వెళ్ళే సరికి వాకిట్లో ఎవరూ కనిపించలేదు. "బాబాయ్, ఇంట్లో వున్నావా?" అంటూ అతను కేకపెట్టాడు.

జవాబులేదు. హరిదయాల్ తలుపు నెట్టుకుని సరాసరి లోపలికి వెళ్ళాడు. దీపం వెలుగులో చదరంగం పావులు ముందు పెట్టుకుని కైలాసుడొక్కడే కూర్చున్నాడు.

"ఒక్కడివే ఆడుతున్నావా, బాబాయ్?" అన్నాడు హరిదయాల్.

కైలాసుడు తల ఎత్తి అతడికేసి చూసి "రా నాయనా, రా! ఈ మంత్రిని ఎలా బతికించాలో చూడు!" అన్నాడు.

హరిదయాల్ ఎంతో విరక్తిగా, "కులమే నిలిచేట్టు లేదు, చదరంగం పావు నిలుస్తుందా!" అన్నాడు.

కైలాసుడికి అర్థంకాక, "ఏమిటి నాయనా, నువ్వనేది?" అని అడిగాడు.

"....ఆరోజు సంగతి గుర్తుందిగా? మా ఇంటి నడవా దగ్గిర జరిగిన గల్లంతు—" అన్నాడు హరిదయాల్.

"లేదు బాబూ, నేను బాగా వినలేదు. ఎవరో కీచులాడుకున్నట్టు వినబడింది—అంతే ఒకటి మాత్రం బాగా గుర్తుంది....ఆ రోజున నీ పందెం మాత్రం చాలా మందకొడిగా నడిచింది," అన్నాడు కైలాసచంద్రుడు.

"పందెం మాట తగలడనీ....నువ్వీలోకంలో ఏం చేయా చేయకపో - పరలోకం అంటూ ఒకటుందని అంగీకరిస్తావా?" అన్నాడు హరిదయాల్ గంభీరస్వరంతో.

"ఎందుకు అంగీకరించను!" అన్నాడు కైలాసచంద్రుడు ఆశ్చర్యంగా.

"అలా అయితే ఆ పరలోకం కోసం నువ్వు చేసిందేమిటి? ఒక్క రోజునైనా దేవాలయానికి ఎందుకు వెళ్ళవ్?"

కైలాసచంద్రుడు యీ ప్రశ్నకు మరింతగా ఆశ్చర్యపోతూ, "అవేం మాటలురా దేవాలయానికి వెళ్ళకపోవట మేమిటి—చాలాసార్లు వెళ్లాను," అన్నాడు.

"నువ్వు కాశీలో నివాసం ఏర్పరుచుకుని ఇరవై ఏళ్ళయింది. ఈ ఇరవై ఏళ్ళలో ఇరవైసార్లయినా దేవాలయానికి వెళ్ళి వచ్చావా అని నా అనుమానం. ఇక గాయత్రీ మంత్రానికీ నీకూ చాలా దూరమాయె," అన్నాడు హరిదయాల్.

"నీకు తెలియందా? గాయత్రీ చదవటానికి నాకు తీరికెక్కడుంది. ఉదయం లేవగానే శంభూమిశ్రతో ఒక ఆట ఆడక తప్పదు. అతను కూడా మాంచి ఎత్తులు వేయ గలడు ఆట ముగిసేసరికి రెండు ఝాములౌతుంది. తర్వాత స్నానంచేసి వంట ప్రారంభిస్తాను ఇక గంగాపాండే వున్నాడు! ఏమన్నా అను, అతని ఆటకూడా చెప్పుకోదగిందే.. ఆ రోజున అతను ఆటలో నన్ను తలదన్నిపోయాడంటేనమ్ము. ఒక వైపున గుర్రం మరోవైపున ఏనుగునూ తీసుకుని, నా ఆటను చంపుతూనే వచ్చాడు," అన్నాడు కైలాసచంద్రుడు.

"సరే, మరి సాయంత్రం పూట ఏంచేస్తావ్?" అన్నాడు హరిదయాల్.

"సాయంత్రంపూట ముకుందఘోషుతో....అతని ఏనుగులు రెండూ...."

హరిదయాల్ విసుక్కుంటూ అతడి మాటలకు అడ్డుపడి, "మధ్యాహ్నం గంగా పాండే, సాయంత్రం ముకుందఘోష్—ఇక నీకు తీరుబాటెక్కడ?" అన్నాడు.

కైలాసచంద్రుడు మాట్లాడకుండా వూరుకున్నాడు.

హరిదయాల్ ఉపదేశిస్తున్న ధోరణిలో గంభీరంగా గొంతుపెట్టి, "బాబాయ్, యింకా యీ జీవితశేషం మరేం ఎక్కువలేదు. పరలోకం కోసం సిద్ధమవకతప్పదు. దాన్ని

గురించి కొంచెం ఆలోచించు. అక్కడికి ఈ చదరంగపు పావులేవీ వెంటరావు,” అన్నాడు.

“నిజమే, వాటిని నా వెంట తీసుకుపోయేందుకు వీలుకానట్టే వుంది! అయినా ఆ భగవంతుడి పిలుపు వచ్చిన రోజున, అవన్నీ ఎవరికన్నా యిచ్చి, తిన్నగా వెళ్ళిపోతాను; దానికి విచారమెందుకు,” అన్నాడు కైలాసచంద్రుడు.

“డబ్బూ దస్కం మాటేమిటి? చావంటే భయం లేదా?”

“నా కమల కన్నుమూసిన రోజునే నా కన్ని భయాలూ పోయినై,” అంటూండగా ఆ వృద్ధుడి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

హరిదయాల్ ఆ ప్రసంగం అంతటితో ఆపి, ప్రాముఖ్యమైన విషయమై, రాఘవ్ అన్నదంతా కైలాసుడికి చెప్పి, “ఇప్పుడేం చెయ్యమంటావ్?” అని అడిగాడు.

కైలాసచంద్రుడు ఓ క్షణం మౌనంగా వూరుకుని, “అదంతా అబద్ధం. సురోచన సాధ్వి,” అన్నాడు.

“మొదట్లో నేనూ ఆవిణ్ణి గురించి అలాంటి అభిప్రాయంలోనే వున్నాను....కాని, స్త్రీ విషయంలో అసంభవమంటూ ఏమీలేదు,” అన్నాడు హరిదయాల్.

“రామ, రామ, అలాంటి మాటలనకు, హరీ! మనుష్యమాత్రుడెవడూ ఏదో ఒక సందర్భంలో తప్పుచేయకుండా వుండడు. అందులో స్త్రీ అనీ, పురుషుడనీ విచక్షణ చెయ్యకు. నీకు, నీ తల్లి విషయం జ్ఞాపకం లేదా? అప్పుడే మరిచావా?” అన్నాడు కైలాసచంద్రుడు.

హరిదయాల్ ఆ ప్రశ్నతో సిగ్గుపడిపోయి తలవంచుకున్నాడు. తరవాత కొంచెం ఆగి విసుగ్గా, “అది సరే, ఇప్పుడు నా కులం భ్రష్టయిపోతున్నది. ఏం చేయమంటావ్?” అన్నాడు.

“ప్రాయశ్చిత్తం చేసుకో.”

“చేసుకున్నా, ముందు అందరూ నన్ను కులం లోంచి వెలివేస్తారు గదా?” అన్నాడు హరిదయాల్ బాధగా.

“వెలివెయ్యనీ,” అన్నాడు కైలాసుడు తాపీగా.

హరిదయాల్ కోపంగా, “ఏమిటి? ఏమైనా ఆలోచించి మాట్లాడుతున్నావా,దాదాయ్?” అన్నాడు.

“ఆలోచించే మాట్లాడుతున్నాను. నీ వయసు ఏభై కి పైబడింది. ఇప్పటివరకూ కులం, గోత్రం వుంది. ఇంక కొద్దికాలంపాటు అది లేకపోతే నష్టం ఏముంది?” అన్నాడు కైలాసుడు.




"కులం పోగానే ధర్మం పోతుంది. అప్పుడు భగవంతుడికి ఏం సమాధానం యిచ్చుకునేది?" అన్నాడు హరిదయాల్.

"ఒక అనాథకు ఆశ్రయం యిచ్చాను, అని చెప్పు."

హరిదయాల్ కొంచెంసేపు ఆలోచిస్తూ పూరుకుని, "అయితే బాబాయ్, నన్ను ఆ రాఘవ్‌దాసుకు సులోచన అల్లుడి జాడ చెప్పమనా మీ సలహా?" అని అడిగాడు.

"అలా చెప్పకు. ఆ తాగుబోతు ముండాకొడుకు ఆ పెద్ద మనిషి దగ్గిర కూడా డబ్బు వసూలుచేయటానికి పోరాడు," అన్నాడు కైలాసుడు.

"చెప్పకపోతే నేను సర్వనాశనం అయిపోతాను. వాడు సంగతంతా నలుగురికీ చెప్పేస్తాడు. ఒక్క యాత్రికుడు కూడా నాకేసి తిరిగి చూడడు. నా భుక్తి మాటేమిటి?" అన్నాడు హరిదయాల్ ఆదుర్దాగా.

"భుక్తి విషయమై భయపడకు. సర్కారు దయవల్ల నాకు నెలకు ఇరవై రూపాయలు పింఛను వస్తోంది గదా? దాంతోనే మన ఇద్దరి తిండీ తిప్పలూ జరిగిపోతాయి. హాయిగా చదరంగం ఆడుకుంటూ కూచుందాం, ఇంట్లోంచి అడుగు బయట పెట్టకుండా," అన్నాడు కైలాసుడు.

ఈ జవాబుతో హరిదయాల్‌కు చాలా కోపం వచ్చింది. "నా గురించి మీరంతబాధ్యత పెట్టుకోనవసరం లేదు. పరాయివాళ్ళ కోసం నా కులాన్నీ, ధర్మాన్నీ నాశనం చేసుకుంటానా?" అన్నాడతను.

"వద్దు, వద్దు, సులోచన అల్లుడి చిరునామా అదీ ఆ దుష్టుడికి చెప్పి, ఆ పిల్ల కాపరం చెడగొట్టు. నీ దేహాన్ని నక్కలూ, గద్దలూ తినకుండా చేసుకో," అన్నాడు కైలాసుడు.

హరిదయాల్ సమాధానమేమీ యివ్వకుండా లేచి నిలబడ్డాడు. "అయితే నా సలహా పాటించ దలుచుకోలేదా?" అని అడిగాడు కైలాసుడు.

"వెర్రివాళ్ళ సలహాలు పాటించాలంటే, నేనూ వెర్రివాణ్ణి కాక తప్పదు," అంటూ హరిదయాల్ బయటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి హరిదయాల్ బాగా ఆలోచించి చంద్రనాథ్ పినతండ్రి అయిన మణిశంకరుడికి, "చంద్రనాథ్ బుద్ధి పూర్వకంగా, ఎంతో యిష్టపడి ఒక వేశ్య కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడు," అని ఉత్తరం రాసి, మర్నాడు పోస్టుచేశాడు.

# 6

కాశీ నుంచి హరిదయాల్ రాసిన ఉత్తరం అందగానే మణిశంకరుడు దాన్ని ఒకటికి రెండుసార్లు చదివి, అందులో అబద్ధం ఏమీ లేదన్న నిర్ణయానికి వచ్చాడు. కాని, ఏం చెయ్యాల్లో ఎంత ఆలోచించినా అతడికి తోచలేదు. అతను భార్యను పిలిచి రహస్యంగా ఉత్తరంలోని సంగతంతా చెప్పి, "వివాహానికి ముందు నాతో సంప్రతించి వుంటే, యిలా జరగనిచ్చేవాణ్ణా? సరే, జరిగిందేదో జరిగింది, ఈ సంగతి మాత్రం ఎవరి చెవినీ పడనీయకు. ఏం చేస్తే బావుంటుందో నేను మరి కాస్త ఆలోచించి చూడాలి," అన్నాడు.

మణిశంకరుడి భార్య నాలుగైదు రోజులపాటు ఆ రహస్యాన్ని ఎంతో బలవంతం మీద తన మనస్సులో దాచుకో గలిగింది. కాని ఆ తరవాత ఇక వుండబట్టలేక ఆత్మీయులనుకున్న యిద్దరు ముగ్గురు స్త్రీలతో చెప్పింది. క్రమంగా ఆ సంగతి నలుగురి చెవులా పడిపోయింది. మణిశంకరుడి కుమార్తె పెళ్ళి సంప్రతింపుల రోజున అక్కడికి వెళ్ళిన హరిబాల కూడా యీ సంగతి మరొకరి ద్వారా తెలిసింది.

ఒకటి రెండు వారాల్లో చంద్రనాథుడి భార్య సరయూ కాశీలో ఒక వేశ్య కూతురు అన్న విషయం గ్రామంలో ఆబాలగోపాలానికీ తెలిసిపోయింది. చంద్రనాథుడు బాగా స్థితిమంతుడు కావటంతో ఎవరూ అతని ఎదటపడి యీ విషయమై నిగ్గదీసి అడగలేక పోయారు. ఆ శక్తీ, హక్కూ కూడా వున్న మణిశంకరుడు మౌనంగా వూరుకున్నాడు.

ఆఖరికి చంద్రనాథుడి ఇరుగుపొరుగు కొంపల్లో వున్న కొందరు విధవలూ, వృద్ధ

స్త్రీలూ—కాశీ దంపతుల కులాన్నీ, ధర్మాన్నీ కాపాడాలనే పవిత్రోద్దేశంతో కాశీకి యీ సంగతి రహస్యం అంటూ చెప్పేశారు.

కాశీ ఒక పూటల్లా తన గదిలో కూర్చుని ఆలోచించింది. ఆవిణ్ణి ఒకేఒక్క భయం బాధిస్తున్నది. తీరా యీ సంగతి రుజువుకాకుండా పోతుందా? 'నా అదృష్టం బావుండే, ఆ దేవుడు కన్ను తెరిచాడు. మా అక్క కూతురికి యింకా పెళ్ళి కాలేదు....నా శక్తి కొద్దీ ప్రయత్నించి చూస్తాను.' అనుకున్నదామె.

కాశీ అడుగులో అడుగువేసుకుంటూ చంద్రనాథుడి గదిలోకి వెళ్లేసరికి, అతడేదో పుస్తకం చదువుకుంటున్నాడు. అడుగుల చప్పుడు విని అతడు తల ఎత్తి చూసి, "ఎవిఁటి, అత్తా?" అని అడిగాడు.

కాశీ తల కొట్టుకుంటూ, "బాబూ, చంద్రనాథ్? దిక్కులేని దరిద్రులం అనేగా మాకింత శిక్ష వేశావ్?" అన్నది.

చంద్రనాథ్ ఆశ్చర్యపోయాడు. కాశీ మాటలు అతడికేమీ అర్థం కాలేదు. కాశీ బాగా గొంతెత్తి, "పట్టెడు మెతుకుల కాశపడి, నీ ఇంట చేరినందుకు మా జాతీ ధర్మం కూడా సర్వనాశనమైపోయాయి," అన్నది.

"జరిగిందేవిఁటి? నాకేం అర్థంకావటంలేదు," అన్నాడు చంద్రనాథ్.

"....ఆ దొంగముండల మాయలో చిక్కి నాశనం అయిపోయావురా, బాబూ!.... నేనేం చెప్పేది? వెళ్ళి మీ బాబాయి నడుగు," అన్నది కాశీ పైట చెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ.

ఆ జవాబుతో చంద్రనాథ్‌కు బాగా కోపం వచ్చి, "నేను బాబాయి నడిగి తెలుసుకోవలసిన సంగతయితే, మధ్య నీ వెధవ హంగామా అంతా ఎందుకు?" అన్నాడు.

కాశీ ఓసారి పెద్దగా ఏడ్చి కన్నీళ్లు తుడుచుకుంటూ, "నిజంగా, యీ సంగతి నీకు తెలియదా, బాబూ!" అని అడిగింది.

"ఏ సంగతి?"

"కాశీ నుంచి హరిదయాల్ మీ బాబాయికి ఉత్తరం రాశాడు. అక్కడ నిన్ను ఒంటరిగా చూసి....వాళ్లు నీకు ఒక కులట కూతుర్ని- వేశ్యను అంటగట్టారు, బాబూ!" అన్నది కాశీ.

చంద్రనాథుడు కళ వెళపడిపోతూ, "నాకు ఒక కులట కూతుర్ని అంటగట్టారా! ఆ పిల్ల వేశ్యా! నీకు జ్ఞాపకంలేదా? సరయూ మన యింటి కొచ్చేటప్పటికి పదేళ్ళ పిల్లేగా?" అన్నాడు.

"ఆమె తల్లిని గురించి కాశీలో చాలా చెడ్డగా చెప్పుకుంటారట."



"అలా చెప్పు. వేశ్యా వృత్తి చేస్తున్నది సరయూ తల్లి, సరయూ కాదుగా!" అన్నాడు చంద్రనాథ్ తాపీగా.

"తల్లి చేస్తే ఒకటీ, కూతురు చేస్తే ఒకటీనా?" అన్నది కాళి ఉగ్రురాలై పోతూ.

చంద్రనాథుడు విసురుగా, "నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నీ కేమైనా పిచ్చెక్కిందా ఏం?" అన్నాడు.

కాళీ ఏడుస్తూ, "ఇది పిచ్చెత్తించే సంగతే, బాబూ! మాకు ప్రాయశ్చిత్తం చేయించు, ఎక్కడికన్నా పోతాం," అన్నది.

"కాదన్న దెవరు? వెళ్ళిపోండి," అన్నాడు చంద్రనాథుడు కోపంగా.

"అయ్యో, దేవుడా! చివరికి మాకీ గతి పట్టిందా," అంటూ కాళీ ఏడవసాగింది.

"ఆ ఏడ్పుమాని అసలు సంగతేమిటో చెప్పు," అన్నాడు చంద్రనాథ్.

"ఇంకేం చెప్పేది? అంతా చెప్పాను," అన్నది కాళీ వెక్కుతూ.

"ఏం చెప్పావ్? ఆ ఉత్తరం ఎక్కడుంది?" అన్నాడు చంద్రనాథ్.

"మీ బాబాయి దగ్గిర."

"ఉత్తరం చూశావా? అందులో ఏమని వుంది?" అన్నాడు చంద్రనాథ్ చిన్న గొంతుతో

"ఆ సంగతేగా యింతకు ముందు చెప్పింది."

చంద్రనాధుడు, కాశీ ముఖంకేసి ఓ క్షణకాలం తీవ్రంగా చూసి తల వంచుకున్నాడు అతడిలో ఎలాంటి చలనమూ లేదు, శిలా ప్రతిమలా అయిపోయాడు అది చూసి కాశీ చాలా భయపడింది.

*  *  *

పినతండ్రి మణిశంకరుడి దగ్గిరకు పోయి చంద్రనాథ్, "ఏదీ ఆ ఉత్తరం?" అని అడిగాడు సూటిగా.

మణిశంకరుడు మాట్లాడకుండా పెట్టెలోంచి ఉత్తరాన్ని బయిటకి తీసి చంద్రనాధుడికి యిచ్చాడు. అతడు ఉత్తరాన్ని రెండు మూడుసార్లు జాగ్రత్తగా చదివి, "ఈ రాసిన దానికి ఋజువేమిటి?" అని అడిగాడు.

"ఋజువా? రాఖల్‌దాసు స్వయంగా యిక్కడికి వచ్చాడు," అన్నాడు మణిశంకరుడు అయిష్టమైన స్వరంతో.

"అతను చెప్పే మాటల మీద మనకు నమ్మకం ఏమిటి?" అని అడిగాడు చంద్రనాథ్.

"ఆ సంగతి నాకేం తెలియదు. నీకు తోచిన విధంగా చెయ్యి," అన్నాడు మణిశంకరుడు బాధగా.

"అతనిక్కడి కెందుకొచ్చాడు?....ఈ సంగతి ఋజువు చెయ్యటంలో అతడి కొచ్చే లాభ మేమిటి?" అని అడిగాడు చంద్రనాథ్.

"అది కూడా ఆ ఉత్తరంలోనే వుంది. ఆతగాడికి రెండువేల రూపాయిలు కావాలట."

"ఈ సంగతి బయట పెట్టకపోతే అతడికి ఏమైనా కొంత డబ్బు ముట్టేదేమో! కాని యిప్పుడు ఆ అవకాశం పోయింది. మీరు ఒక విధంగా నాకు మేలే చేశారు....ధన నష్టం తప్పింది," అన్నాడు చంద్రనాథ్.

మణిశంకరుడు సిగ్గుతో కుంగిపోయాడు. ఈ విషయం బహిర్గతం చేసింది తాను కాదని చెప్పాలనుకున్నాడు. కాని, తను భార్యతో అనటంవల్లనే ఇదంతా బయట పడింది.........

చంద్రనాధుడు పినతండ్రికేసి గుచ్చి చూస్తూ, "ఇది నా పూచు. ఎవడో అడుక్కు తినే వెధవ యిక్కడికొచ్చి, నన్నవమానించి, నా దగ్గిర్నుంచి డబ్బులా తీసుకు పోగల డని మిమ్మల్ని ప్రశ్నించబోవటంలేదు. కాని, బాబాయ్....అదృష్టవశాన నాకు వాప్ప తటస్థపడితే మీరు సంతోషిస్తారా?" అన్నాడు.

మణిశంకరుడు నాలుక కొరుక్కుని, "రామ! రామ! అలాంటి అపశకునం మాటలు నోటి వెంట రానియ్యకు, చంద్రనాథ్!" అన్నాడు.

"మీరు నాకు పూజ్యులు. నావల్ల అపరాధం జరిగితే యీసారికి క్షమించండి. నా ఆస్తి పాస్తులన్నీ మీరు తీసుకుని, నెలకు యింత అని ఏదో కొంత డబ్బు నేనున్న చోటుకు పంపుతూండండి. భగవత్ సాక్షిగా నేను మిమ్మల్ని యింతకన్న కోరేదేమీ లేదు," అన్నాడు చంద్రనాథ్ బొంగురుపోయిన గొంతుతో.

మణిశంకరుడు చప్పున అతని చేయి పట్టుకుని, "నాయనా, చంద్రనాథ్! మా వంశానికి నీ వొక్కడివే ఆశాజ్యోతివి, వంశోద్ధారకుడవు. ఈ ముసలితనంలో నన్నింక ఎక్కువ బాధ పెట్టకు," అన్నాడు వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

చంద్రనాథుడు ముఖం పక్కకు తిప్పుకుని, "బాబాయ్, నేను మిమ్మల్ని దుఃఖపెట్టటం లేదు. ఇంత అపవాదు వచ్చిం తర్వాత, గ్రామం విడిచి పోవటం తప్ప మరో మార్గం కనిపించటంలేదు," అన్నాడు.

"గ్రామం విడిచిపోవట మెందుకు? తెలియక వివాహం చేసుకున్నావు. ప్రాయశ్చిత్తం చేసుకుంటే సరిపోతుందనుకుంటాను," అన్నాడు మణిశంకరుడు.

చంద్రనాథుడు మౌనంగా వూరుకున్నాడు.

మణిశంకరుడు వాస్త తేరుకుని, "దీనికి అనేకమార్గాలున్నాయ్. ప్రాయశ్చిత్తం చేసుకుని, మళ్ళీ వివాహం చేసుకుంటే—అంతా సర్దుమణుగుతుంది," అన్నాడు.

ఈ మాటలు వింటూనే చంద్రనాథ్ నిలువెల్లా కంపించి పోయాడు. మణిశంకరుడు అతడి ముఖంకేసి పరీక్షగా చూస్తూ వూరుకున్నాడు. ఒకటి రెండు నిమిషాలు నిశ్శబ్దం. చంద్రనాథ్ ఓసారి గొంతు సవరించుకుని, "బాబాయ్, నేను ఏ పరిస్థితుల్లోనూ నా భార్యను వదిలిపెట్టలేను," అన్నాడు.

"కాస్త స్థిమితంగా ఆలోచిస్తే, అదేమంత కష్ట కార్యం కాదని నీకే తెలుస్తుంది.... యిక ఆవిణ్ణి యింట్లో వుంచటం మంచిదికాదు," అన్నాడు మణిశంకరుడు.

"వాస్తవం యేమిటో తెలియకుండా....ఆమెను యెలా వదలను?" అన్నాడు చంద్రనాథ్.

"ఇప్పుడు ఆ తెలియటం తెలియక పోవటంతో పనిలేదు. వదిలిపెట్టి ప్రాయశ్చిత్తం చేసుకో. అంతా చక్కబడుతుంది," అన్నాడు మణిశంకరుడు.

చంద్రనాథుడు పినతండ్రికి ఏ జవాబూ యివ్వకుండా యింటికి తిరిగివచ్చి, గదిలోకి పోయి తలుపులు వేసుకుని పడుకున్నాడు. కొద్దిసేపటికి అతణ్ణి నిద్రమత్తు ఆవహించింది. ఆ అవస్థలో అతడి హృదయాన్ని ఎన్నో అనుమానాలూ, సంశయాలూ పీడించినై....




అతను సరయూను పరిత్యజించాడు.........ఆమె ఎక్కడికో తెలియని చోటుకు వెళ్ళి పోయింది. హృదయంలో ఎంత అంధకారం....ఎంత పీడన....

నౌకరు లాంతరు వెలిగించుకు వచ్చి తలుపు తట్టాడు. చంద్రనాథ్ తలుపు తెరిచి కాసేపు గదిలో అటూ యిటూ పచార్లు చేశాడు. సరయూకు అంతా తెలిసివుండే తననిలా మోసం చేసిందని అతడు నమ్మలేక పోయాడు. అతడు చరచరా గదినుంచి బయిటికి వచ్చి, సరయూ గదిలోకి వెళ్ళాడు. సరయూ సంధ్య దీపం వెలిగించి, దానిముందు కూర్చుని వున్నది. భర్త రావటం చూస్తూనే లేచి నిలబడింది. ఆమె ముఖంలో భయ చిహ్నాలేవీ లేవు.

“అంతా విన్నావు గదా?” అని ప్రశ్నించాడు చంద్రనాథ్ తడబడుతూ.

“ఆఁ” అన్నది సరయూ తల వంచుకుని.

“ఆ సంగతంతా నిజమేనా?”

“ఆఁ, నిజమే.”

చంద్రనాధుడు ఉస్సురంటూ మంచంమీద కూర్చుని, "అలా అయితే యింతకాలం వరకూ నా కెందుకు చెప్పలేదు?" అని అడిగాడు.

"అమ్మ చెప్పవద్దన్నది, పైగా మీరెన్నడూ అడగనూలేదు."

"హుఁ, నేను మీ అమ్మకు చేసిన మేలుకు యిది ప్రతిఫలం అన్నమాట!" అన్నాడు చంద్రనాథ్ కోపంగా. సరయూ మరింతగా తల వంచుకున్నది.

"నువ్వెందుకు భయపడుతూండేదానివో, నే నెంత గాఢంగా ప్రేమించినా ఎందుకు సుఖపడలేక పోయావో యిప్పుడు అర్థమవుతున్నది. నే నెంత బలవంతంచేసినా మీ అమ్మ యిక్కడికి రాని కారణం యిదేగా?" అన్నాడు చంద్రనాథ్.

"అవును."

చంద్రనాథ్ కొంచెంసేపు మౌనంగా వూరుకుని, విచారం వుట్టిపడే గొంతుతో "సరయూ, అసలు జరిగిన సంగతులన్నీ ఒకసారి నాకు చెప్పగలవా?" అని అడిగాడు.

"ఆఁ చెప్తాను. నవద్వీపం దగ్గిర ఒక చిన్న గ్రామంలో మా మేనమామగారు వుంటూండేవాడు. రాఘవ్‌దాసుగారి యిల్లు వారి యింటి పక్కనే వుండేదట. బాల్యంనుంచీ మా అమ్మా, ఆయనా ఎంతో అన్యోన్యంగా వుంటూ ఆడుకుంటూండేవారట. పెద్దవాళ్ళవుతున్నకొద్దీ మనస్సులో ప్రేమ బీజాలు మొలకెత్తాయి. పెద్దవాళ్ళ మధ్య వివాహ ప్రసక్తి కూడా వచ్చిందట. కాని, ఆయనది తక్కువకులం కావటంతో అది పొసగలేదు. మా అమ్మని దేవనగరంలో మా నాన్నకిచ్చి చేశారు. నాకు మూడేళ్ళ వయసులో మా తండ్రి చనిపోయాడు. మా అమ్మ నన్ను తీసుకుని తిరిగి నవద్వీపం వచ్చింది. తర్వాత....నా అయిదో ఏట నన్ను చంకన వేసుకుని రాఘవ్‌దాసుతో...." సరయూ గొంతు పూడుకు పోయింది. ఆమె మరి చెప్పలేక వూరుకున్నది.

"తరవాత ఏం జరిగింది?" అన్నాడు చంద్రనాథ్.

"కొన్నాళ్ళపాటు మేం మధురలోనూ, బృందావనంలోనూ వున్నాం. ఆ తరవాత కాశీ వచ్చాం. అక్కడే రాఘవ్‌దాసు తాగటం మొదలుపెట్టాడు, మా అమ్మ దగ్గిర కొద్దిగా నగలుండేవి. అవి యిమ్మని అతను రోజూ మా అమ్మతో పోట్లాడుతుండేవాడు. చివరికి ఒక రోజున వాటిని బలవంతంగా గుంజుకుని ఎటో పారిపోయాడు. అప్పటికి మా అమ్మ దగ్గిర ఒక్క చిల్లిగవ్వకూడా లేదు. అయిదారు రోజులపాటు ముష్టెత్తుకు బతికాం.... తర్వాత సంగతులన్నీ మీకు తెలిసినవే...." అని చెప్పింది సరయు.

చంద్రనాథుని మస్తిష్కంలో అగ్ని రగుల్కొన్నది. అతడు సరయూకేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూస్తూ, "ఆఁ, నువ్వు అటువంటి సరయూవా? అంతా తెలిసివుండే నన్ను

సర్వనాశనం చేశావన్నమాట! నువ్వింత పాపిష్టిదానివని కలలో కూడా అనుకోలేదు," అన్నాడు.

సరయూ కన్నీళ్లు కార్చుతూ తల వంచుకుని స్థాణువులా నిలబడింది. అతడు ఆమె కన్నీళ్లు చూడలేదు. "అయితే, యిప్పుడేం చేయమంటావ్?" అన్నాడు కఠోరస్వరంతో.

సరయూ కన్నీళ్లు తుడుచుకుంటూ, "మీ యిష్టం," అన్నది.

చంద్రనాథుడు, సరయూ చేతిని గట్టిగా వడిసిపట్టుకుని, "సరయూ అందరూ నిన్ను వదిలివెయ్యమంటున్నారు. కాని, నాకు ధైర్యం చాలటంలేదు. కాని, నాకు నీమీద వున్న నమ్మకం, విశ్వాసం—అంతా పోయింది," అన్నాడు.

"మీకు నా మీద నమ్మకం పోయిందా?" అన్నది సరయూ చప్పున తల ఎత్తి. ఆ సమయంలో ఆమె నేత్రాలు జ్యోతుల్లా మెరిశాయి.

"అవును.... నువ్వెంతకైనా సమర్థురాలవు."

"అలాగా. అయితే నే నొక ఉపాయం చెబుతాను, వింటారా?" అన్నది సరయు. ఆమె స్వరంలో తొట్రుపాటేమీలేదు.

"ఆఁ చెప్పు, ఏమిటా ఉపాయం?"

"నేను విషం తాగితే.........."

చంద్రనాథుడు ఆమె చేతిని మరింత గట్టిగా బిగించి పట్టుకుని, "ఇది మంచి ఉపాయంగానే వున్నది. నువ్వు నిజంగా విషం తాగ్గలవా?" అన్నాడు.

"ఆఁ, తాగుతాను."

"ఎప్పుడు?"

"ఇవ్వాళే!" అన్నది సరయు.

చంద్రనాథుడు తృప్తిగా తలాడించి గదిలోంచి బయలుదేరాడు. సరయు అతడి పాదాలు రెండూ పట్టుకుని, "నన్ను దీవించి మరీ వెళ్ళండి," అన్నది.

చంద్రనాథుడు తల పక్కకు తిప్పుకుని, "ఇప్పుడుకాదు. నీ మరణవార్త విన్న తర్వాత.... నీ భౌతికకాయం కాలి మసైపోయిం తర్వాత—అప్పుడు తప్పక దీవించుతాను," అన్నాడు.

"సరే, అప్పుడే దీవించండి," అన్నది సరయూ భర్త పాదాలు వదిలి. కాని, అతడు ముందుకు వెళ్ళిపోయేంతలో మళ్ళీ ఆపి, "నేను విషంతాగి చనిపోతే మీ మీది కేమీ రాదా?" అని అడిగింది.

"కొందరికి అనుమానం కలగొచ్చు. డబ్బుతో వాళ్ళ నోళ్లు మూస్తాను," అన్నాడు చంద్రనాథ్.



"నేను ఆత్మహత్య చేసుకుంటున్నట్టు ఉత్తరం రాసి, తలగడ కింద పెట్టిపోతే బావుం టుంది గదా?" అన్నది సరయు.

"ఆఁ అలా చెయ్యి. నేను హత్య చేశానన్న అనుమానం కూడా ఎవరికీ కలగదు— మరోసంగతి, బైటికి ఎలాంటి చడీచప్పుడూ రాకుండా గదికిటికీ రెక్కలన్నీ గట్టిగా బిగించు," అన్నాడు చంద్రనాథ్.

సరయూ భర్త దారికి అడ్డం తొలిగి, "సరే, ఇక వెళ్ళిరండి," అన్నది పాదాలకు

నమస్కరిస్తూ. కాని అతడు అడుగు వెయ్యబోయేంతలో చటుక్కున చేయి పట్టుకుని, "కాస్త ఆగండి," అని దీపం దగ్గరకు తీసుకుపోయి అతడి కళ్ళల్లోకి తేరిపార చూచింది. చంద్రనాథుడి కళ్ళల్లో ఏదో ఒక అమానుషమైన కాంతి మెరుస్తున్నది.

"నా కళ్ళల్లోకి అలా చూస్తున్నావేమిటి, సరయూ?" అన్నాడు చంద్రనాథుడు కళవెళ పడిపోతూ.

సరయూ ఓ క్షణం వూరుకుని, "ఏమీలేదు, వెళ్ళిరండి!" అన్నది.

చంద్రనాథుడు తల వంచుకుని తన గదికి పోతూ, "ఈ ఉపాయం బహు చక్కగా వుంది....ఈ రాత్రే...." అని గొణుక్కోసాగాడు.

# 7

సరయూ దుఃఖంతో కుమిలిపోతూ మంచంమీద దొర్లసాగింది. ఆమె భర్తతో చెప్పినట్టు విషం తాగలేదు. తన ఒక్క ప్రాణమే అయితే ఆమె విషం తాగేందుకు వెను దీసేదికాదు. ఆమె గర్భవతి. కాబోయే తల్లి. ఏ తల్లి తన సంతానాన్ని చేజేతులా హత్య చెయ్యగలదు? ఆ కారణంగా ఆమె చావలేదు. కాని, ఆమె సుఖపడే రోజులు మాత్రం గతించాయి....

చంద్రనాథుడు ఒక రాత్రివేళ సరయూ గదిలోకి వచ్చాడు. ఉన్మత్తావేశంతో భార్యను కౌగలించుకుని, "సరయూ, వద్దు, నువ్వు విషంతాగొద్దు!" అన్నాడు.

చంద్రనాథుడు ఆ మాటలు అనటంతప్ప, ఆపైన భార్య కిచ్చిన అభయంకాని, ఆమె హృదయంలో కొత్తగా వెలిగించిన ఆశగాని ఏమీలేదు.ఆమె కన్నీళ్ళతో అతణ్ణి మరోవారం గడువివ్వమని యాచించింది. తను ఇల్లొదిలి పోవటానికి యిది మంచి సమయం కాదు. ఈ భాద్రపద మాసపు ఆఖరి వారం రోజులూ ఆమె భర్త పంచనే వుంటుంది. ఆ మాసంలో ఆఖరికి కుక్కల్ని, పిల్లుల్ని కూడా బైటికి తరమరు. అది, అశుభం!

ఆ మర్నాడు ఆమె చంద్రనాథుడి చేయి పట్టుకుని "నా రాత యెలావుంటే అలా జరిగిపోతుంది. నా వంటి నిర్భాగ్యురాల్ని వివాహమాడి మీరు చాలా యిక్కట్ల పాలయాటు. నేను యిల్లొదిలి పోయిం తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకుని, గృహస్థులుకండి," అన్నది.

ఏం సమాధానం చెప్పాలో తెలియక చంద్రనాథుడు మౌనంగా తల వంచుకుని వూరుకున్నాడు.

మర్నాటి ఉదయానే కాశీ తన భర్తకు డిక్టేషన్ చెప్పినట్టు చెప్పి, ఒక కాయితం



మీద ఏదో రాయించి, దాన్ని తీసుకుని సరయూ దగ్గిరకు వచ్చి, సంతకం పెట్టమన్నది. సరయూ అంతా చదివి, "నే నెందుకు సంతకం చేయాలి?" అని అడిగింది.

"అంతా నీ మంచికే నమ్మా. ఒకసారి యిక్కణ్ణించి వెళ్ళిపోయిం తర్వాత నీ బాగోగుల్ని గురించి ఎవరు ఆలోచిస్తారు చెప్పు? అందుకని నువ్వెక్కడున్నా నెలకు అయిదు రూపాయలు మనోవర్తి వచ్చేటట్టు చేయాలనుకుంటున్నాను. ఇదేం నీకు కీడు చేయటం కాదు గదా!" అన్నది కాశీ.

సరయూకు తన మేలుకోరే వ్యక్తు లెవరో తెలియంది కాదు! కాని, పెద్ద పెద్ద భవనాలే నేలమట్ట మవుతూంటే, రాయీరప్పల కోసం ఆత్రపడట మెందుకని, కాశీ తెచ్చిన కాయితం మీద సంతకం పెట్టేసింది.

సరయూ ఇల్లు వదిలి పోవలసినరోజు-ఆశ్వయుజ విదియ వచ్చింది. ఆనాడు ఉదయం నుంచీ ఒకటే వాన. ఒకవేళ ఆవిడ ప్రయాణం ఆగిపోతుందేమో అని, కాశీ భయపడ సాగింది. సరయూ ఇంటి సామానంతా సర్ది పెట్టి, విలువైన వస్త్రాలూ, నగలూ పెట్టెలో పెట్టి తాళంవేసి—భర్తకోసం మనిషిని పంపింది.

చంద్రనాథుడు రావటం చూస్తూనే సరయూ లేచి నిలబడి, "ఇవ్వాళే నేను వెళ్ళ వలసిన రోజు!" అన్నది కన్నీళ్లు తుడుచుకుంటూ.

చంద్రనాథుడు ముఖం పక్కకు తిప్పుకుని కూర్చున్నాడు. సరయూ భర్తను సమీపించి, "ఇదిగో, తాళపు చెవులు. మా చెల్లి వచ్చేవరకూ మీ దగ్గరే వుంచుకోండి, మరెవరికీ యివ్వవద్దు," అన్నది.

"సరే ఎక్కడైనా పెట్టు," అన్నాడు చంద్రనాథుడు రుద్ధకంఠంతో.

సరయూ భర్త ముఖంలోకి తొంగి చూస్తూ, "ఏమిటీ, కన్నీళ్ళా?" అన్నది.

చంద్రనాథుడు మాట్లాడలేదు. సరయూ పమిట చెంగుతో అతడి కన్నీళ్లు తుడుస్తూ, "ఈనాటి వరకూ మీతో పరిహాసం ఆడి ఎరగను. వెళుతూ యీ చిన్న పరిహాస వాక్యం అన్నందుకు, కోప్పడకండి," అన్నది చిరునవ్వు నవ్వుతూ.

సరయూ యిప్పుడున్న స్థితి చూసి చంద్రనాథుడి హృదయం చిరుక్కుపోయింది. ఆమె చేతికి రెండు మట్టి గాజులు తప్ప, మరేం లేవు. కాని అతనేం చేయగలడు? సరయూ వంగి అతడి పాదాలకు నమస్కరించి, "నేను వెళ్ళిపోయానని మీరేమీ బాధ పడకండి—ఇందులో మీ బలవంతం ఏమీ లేదని నాకు బాగా తెలుసు," అన్నది.

చంద్రనాథుడు అంతవరకూ ఎలాగో కూర్చోగలిగాడు కాని, ఆ మాటలు హృదయాన్ని శూలాల్లా రాకటంతో, ఎక్కడలేని పశ్చాత్తాపం కలిగి చప్పున లేచి తన గది లోకి వెళ్ళిపోయాడు.

చీకటి పడకముందే సరయూ ఎక్కిన బండి స్టేషనుకు బయలుదేరింది. ఒక ముసలి గుమాస్తా రెండు మూడు గుడ్డలూ, అంగవస్త్రమూ మూటగట్టుకుని బండివాడి పక్కన కూర్చున్నాడు. ఆ సమయంలో ఆ వృద్ధుడికి సీతాదేవి కథ జ్ఞాపకం వచ్చింది. అతడి కళ్లు అశ్రుపూరితాలయాయి. 'భగవాన్, నౌకర్నయినందుకేనా నాకీ శిక్ష విధించావు!' అనుకున్నాడు మనసులో.

మేడ మీద నిలబడి సరయూ ప్రయాణమై పోవటం చూసిన మణిశంకరుడు, తను చేసిన పని మంచిది కాదేమో అని, మనసులో చాలా నొచ్చుకున్నాడు.

ఆ రాత్రంతా మణిశంకరుడికి సరిగా నిద్రపట్ట లేదు. తెల్లవార్లూ ఎద్దుబండి నడకా, దాని చక్రాల గతుకులూ అతడి చెవుల్లో మారుమోగాయి. అతడు సూర్యోదయంతోనే లేచి వీధి వాకిటి తలుపు తెరిచాడు. వాకిట్లో—అరుగుల పక్కగా ఎవరో బిచ్చగాడిలా వున్న ఒకతను కునికిపాట్లు పడుతున్నాడు. తలుపు తెరిచిన చప్పుడు కాగానే అతడు లేచి నిలబడి, "బాబూ, నేను బాటసారిని!" అన్నాడు.

మణిశంకరుడు ఆ మాట వినీ విననట్టు వూరుకుని వీధిలోకి పోబోయేసరికి, "బాబూ, మణిశంకరుడిగారి యిల్లు యిదేనా?" అని అడిగాడు.

మణిశంకరుడు ఆగి, "అవును," అన్నాడు.

"వారిని చూడడానికి ఎప్పుడు వీలవుతుందో సెలవిస్తారా?" అన్నాడు బికారి.

"నేనే, మణిశంకరుణ్ణి."

అతను మణిశంకరుడికి నమస్కారం చేసి, "నేను తమకోసమే వచ్చాను," అన్నాడు.

మణిశంకరుడతన్ని ఆపాదమస్తకం ఓసారి పరీక్షగా చూసి, "నువ్వు కాశీ నుంచి వచ్చావా?" అని అడిగాడు.

"అవును."

మణిశంకరుడు లోలోపల నవ్వుకుని, "హరిదయాల్ పంపించాడా?" అని ఓ క్షణం ఆగి, "డబ్బుకోసం వచ్చావా?" అని ప్రశ్నించాడు.

"అవును."

ఈసారి మణిశంకరుడు చిన్నగా నవ్వి "రాఘుదాసువా? అయితే నా దగ్గిరికెందు కొచ్చావ్? డబ్బు నేనే యిస్తాననుకున్నావా?" అని అడిగాడు.

"మీరిస్తారనికాదు—ఆ ఏర్పాటు మీరు చేస్తారని, హరిదయాల్‌బాబు చెప్పారు," అన్నాడు రాఘుదాసు.

మణిశంకరుడు నొసలు ముడిచి, "సరే, ఆ ఏర్పాటేదో చేస్తారే, లోపలికి రా," అన్నాడు.

ఇద్దరూ హాలు పక్కనున్న గదిలోకి వెళ్ళారు. మణిశంకరుడు తలుపులను లోపల గడి వేసి వచ్చి, "అయితే, ఆ సంగతంతా నిజమేనా?" అని అడిగాడు.

"ఆఁ, అక్షరాలా నిజం!" అంటూ రాఘుదాసు కొన్ని ఉత్తరాలు తీసి మణిశంకరుడి కిచ్చాడు.

మణిశంకరుడు ఆ ఉత్తరాలన్నీ జాగ్రత్తగా చదివి, "........కాని, ఈ విషయంలో సరయూ తప్పేముంది?" అని అడిగాడు.

"లేదనుకోండి. కాని, తల్లి దోషంవల్ల బిడ్డకూడా దోషిణురాలై పోయింది, పాపం!" అన్నాడు రాఘుదాసు.

"మరి ఆ నిర్దోషిని యెందుకు అన్యాయంగా కష్టాలపాలు చేయటం?" అని అడిగాడు మణిశంకరుడు.

"డబ్బుకోసం ఎంతటి ఘోరమైనా చెయ్యక తప్పదు."

"చంద్రనాథ్ మా అన్నకొడుకు. వాడిమీది కొచ్చిన అపవాదు నా మీదికీ వచ్చినట్టు కాదా, నాయనా!" అన్నాడు మణిశంకరుడు కాస్త బాధగా.

"నే నేం చేసేది? దరిద్రదశలో వున్నాను."

"ఆ సంగతి నీ వేషమే చెపుతున్నది. డబ్బిస్తాను, ఈ సంగతులేవీ బైటపెట్టకుండా ఊరొదిలిపోతావా?" అని అడిగాడు మణిశంకరుడు.



"అలాగే పోతాను, ఆ రెండువేలూ యిప్పించండి!" అన్నాడు రాఘల్‌దాసు.

మణిశంకరుడు, తన గుమాస్తాను పిలిచి అతడితో మెల్లిగా యేదో చెప్పి పంపాడు. తరవాత యింట్లోకి పోయి రెండు వెయ్యి రూపాయిల నోట్లు తెచ్చి, రాఘల్‌దాసుకిస్తూ, "ఇక్కడికి పదిమైళ్ళ దూరాన సర్కార్‌వారి ఖజానా వుంది. ఇంత పెద్ద నోట్లు అక్కడ తప్ప మారవు. మరోసంగతి, మరేనాడైనా యిటుకేసి వచ్చావో నీ ప్రాణం తీయిస్తాను," అన్నాడు తీవ్రస్వరంతో.

రాఘల్‌దాసు ఆ నోట్లు తీసుకుని ఆగమేగాలమీద బయలుదేరి ఖజానా చేరేసరికి పది గంటలైపోయింది. ఆ రోజు సెలవు కావటంవల్ల ఖజానాలేదు. మర్నాడు పది గంటలకు అతడు ఖజానాకు వెళ్ళి షరాబుకు రెండు నోట్లూ యిచ్చి, చిల్లర కావాలన్నాడు.

షరాబు నోట్లను అటూ యిటూ తిప్పి చూసి, "కూర్చో!" అని రాఘల్‌దాసుకు చెప్పి, ఆఫీసు వెనక్కుపోయి, కొద్ది సేపట్లో పోలీసులను వెంటబెట్టుకు వచ్చి, "వీడే దొంగ! నిన్న మణిశంకరుడిగారింటికి ఎవడో బిచ్చానికి వచ్చినట్టు వచ్చి, వీలు చూసుకుని యింట్లో జొరబడి, రెండువేల రూపాయిల రెండు కరెన్సీనోట్లు దొంగిలించుకు పోయాడని, ఆయన గుమాస్తాచేత రిపోర్టుచేయించాడు. ఆ నోట్ల నంబర్లు యివే!" అన్నాడు.

"నాకు ఆ మణిశంకరుడుగారే స్వయానా యీ నోట్లు యిచ్చారు," అన్నాడు రాఘల్‌దాసు భయకంపితుడైపోయి.

"సరే, ఆ సంగతేదో కోర్టులో చెప్పుకో," అన్నాడు షరాబు.

ఆ తర్వాత విచారణ రోజున మణిశంకరుకు కోర్టులో నిలబడి, జడ్జీతో, రాఫల్‌దాసును యీనాటి వరకూ తాను చూడలేదనీ, ఆ నోట్లు రెండూ తనవేననీ, ఎవ్వరికీ యివ్వలేదనీ చెప్పాడు.

రాఫల్‌దాసు శిక్ష తప్పించుకునేందుకు, జడ్జీతో అవీ యివీ ఎన్నో సంగతులు చెప్పాడు. కాని జడ్జీ అవేవీ నమ్మక రాఫల్‌దాసు నేరస్థుడని నిర్ణయించి, అతడికి రెండేళ్ళ కఠినశిక్ష విధించాడు.

## 8

హరిదయాల్ ఇంట యిప్పుడు మునుపటి పనిమనుషు లెవరూలేరు. సులోచన ఎటు పోయిందో, యీనాటికీ అంతు దొరకలేదు. సరయూ సరాసరి ఇంట్లోకి వెళ్ళేసరికి లోపల ఎవరూ కనిపించలేదు. వెంటవచ్చిన ముసలి గుమాస్తా, "ఇక నాకు సెల విప్పించమ్మా, వెళతాను," అన్నాడు, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

సరయూ అతడికి నమస్కరించి మౌనంగా తలవంచుకు నిలబడింది. గుమాస్తా, హరిదయాల్ వచ్చేవరకూ అక్కడ వుండలేక కన్నీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

సాయంకాలానికి హరిదయాల్ ఇంటికి తిరిగివచ్చి, వసారాలో కూర్చునివున్న సరయూను చూసి, "ఎవరు?" అని ప్రశ్నించాడు.

సరయూ చప్పునలేచి నిలబడి, "నేనే," అంటూ నమస్కరించింది.

"సరయూ!" అన్నాడు హరిదయాల్ ఆశ్చర్యపోయి. తరవాత అతడు తాపీగా ఆమెకేసి పరీక్షగా చూశాడు. ఆమె వంటిమీద నగలేమీ లేవు, కట్టుకున్నది మామూలు నూలు చీరె. కాళ్ళదగ్గిరగా చిన్న ట్రంకు పెట్టె వున్నది. అవన్నీ చూస్తూనే అతడు జరిగిందేమిటో ఊహించి, "నేననుకున్నంతా జరిగింది! వెళ్ళగొట్టాడూ?" అన్నాడు పరిహాస ధోరణిలో.

సరయూ మాట్లాడలేదు.

"మీ అమ్మ పారిపోయింది. నా గొంతుమీదికి తెచ్చి మరీ పారిపోయింది. ఆవిడ పాపచరిత్రకు తగినట్టుగానే ప్రవర్తించింది. ఎక్కడున్నదో, ఎలా వూరేగుతున్నదో!" అన్నాడు హరిదయాల్ మండిపోతూ.

సరియూ భర్త ఆశ్రయంపోయి తన తల్లి దగ్గిరకని వచ్చింది. కాని, ఆవిడ లేదు. ఆమెకు అంతా అంధకారంలా కనబడసాగింది.

"నిన్ను....నిన్ను, నా ఇంట్లో వుండనిచ్చి కులం పోగొట్టుకో దలచలేదు.

నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకున్నవాడు ఇంత చిన్నగుడిసె కూడా చూపలేకపోయాడా? ఇక యిక్కణ్ణించి కదులు," అన్నాడు హరిదయాళ్ తీవ్రస్వరంతో.

"తాతా! అమ్మ ఎక్కడున్నదో తెలీదు. ఇప్పుడెక్కడికి పోయేది?" అన్నది సరయూ ఏడుస్తూ.

హరిదయాళ్ హృదయంలో యిప్పుడు దయాదాక్షిణ్యాలకు స్థానం లేదు. "కాశీ లాంటి మహా పట్నంలో నీకు ఆశ్రయాని కేమీ కరువురాదు. మరెక్కడికైనా పో," అన్నాడతను.

సరయూ మనోవ్యథతో, కన్నీళ్ళుకారుస్తూ నిస్సహాయంగా గోడ కానుకుని కూర్చున్నది. ఈ పదహారేళ్ళ ప్రాయానికే ఆమె కోర్కెలూ, ఆశలూ నిండుకున్నాయి. తండ్రిలేడు, తల్లిలేదు, భర్త వదిలిపెట్టాడు. తలదాచుకోవటానికి ఎక్కడా చారెడు నీడ కూడా లేదు. కాని, అపవాదు, కళంకం, రూప యవ్వనాలు మాత్రం మిగిలివున్నాయి. వీటితోకూడా ఒక రకంగా పొట్టనింపుకోవచ్చు....కాని సరయూ లాటి దానికి అది అసంభవం.

హరిదయాళ్ కాసేపు ఆమెకేసి చూస్తూ నిలబడి, చీదరించుకుంటున్నట్టు, "ఇంకా యిక్కడే కూర్చున్నావేం, నడు!" అన్నాడు.

సరయూ శోక స్వరంతో, "ఎక్కడికి వెళ్ళను?" అన్నది.

"ఆ సంగతి నాకేం తెలుసు?" అన్నాడు హరిదయాళ్ కటువుగా.

"తాతా, ఈ రాత్రికి...."

"ఊహుఁ, నువ్వు ఒక్క-క్షణం కూడా యిక్కడ వుండటానికి వీల్లేదు."

సరయూ లేచినిలబడింది. ఇప్పు డామెకు కొంచెం ధైర్యం చిక్కింది. గంగాదేవి యింకా శుష్కించి పోలేదు. ఆమె సంతానానికి భయపడదు, కులగోత్రాలు చూసి బెదరదు. ఈ దిక్కులేని అనాథకు తన ఒడిలో కోరినదే తడవుగా తప్పక స్థానం యిస్తుంది....

సరయూ యిలా ఆలోచిస్తున్నంతలో, కైలాసచంద్రుడు ఒక చేత్తో పదరం గప్పు పావుల మూటపట్టుకుని అక్కడికి వచ్చాడు. అతడు వస్తూనే హరిదయాళ్ కఠోరస్వరంతో అంటున్న మాటలన్నీ విన్నాడు. అతడొకసారి హరిదయాళ్ కేసి చూసి, సరయూ దగ్గిరకుపోయి, "సరయూ! ఎప్పుడొచ్చావమ్మా?" అని పలకరించాడు.

సరయూ లేచి ఆ వృద్ధుడికి నమస్కారం చేసింది. కైలాసు డామెను దీవించి, "రా అమ్మా, వెళదాం. నువ్వు మా యింటికి రాక యిక్కడి కెందుకొచ్చావ్?" అని



సరయూ పక్కనవున్న ట్రంకుపెట్టె చేతిలోకి తీసుకుని, "పదమ్మా, చీకటి పడబో తున్నది," అన్నాడు.

కైలాసుడు ఆ సమయంలో అక్కడికొచ్చింది సరయూను తన ఇంటికి తీసుకు పోవటానికే అన్నట్టు మాట్లాడాడు. సరయూ ఆ మాటలు విని, ఏమీ అర్థంకాక అలాగే నిలబడి పోయింది.

"రామ్మా! నువ్వీ ముసలితాత ఇంటికి రావటానికి వెనకాడు తున్నావా? మనిద్దరం హాయిగా వండుకు తిందాం. జాగుచెయ్యక, పద!" అన్నాడు కైలాసుడు.

"బాబాయ్! నువ్వు చెయ్యబోతున్న దేమిటి? నువ్వీమెను ఇంటికి తీసుకు పోతావా?" అన్నాడు హరిదయాల్ పెద్దగొంతుతో.

"కాదు, గంగలోకి!" అన్నాడు కైలాసుడు తొణకకుండా.

ఈ జవాబుతో హరిదయాల్ మరింతగా రెచ్చిపోతూ, "బాబాయ్, నువ్వు ముందూ వెనకా బాగా ఆలోచించుకుని మరీ తీసుకుపో!" అన్నాడు.

"అమ్మా, యికరా. ఎందుకిక్కడ మాటలు పడటం!" అన్నాడు కైలాసుడు.

అప్పటికి సరయూ కదిలి బయలుదేరింది. కైలాసుడు ట్రంకుపెట్టెతో ఆమె వెనకగా నడవసాగాడు.

"బాబాయ్, అయితే యివ్వాళ్టితో మన భోజన సంబంధాలన్నీ వదులుకున్నట్టేనా?" అన్నాడు హరిదయాల్ వసారాలోంచి.

కైలాసచంద్రుడు ఆగి వెనక్కి తిరిగి, "పిలవా పెట్టకుండా నేనే నాడైనా నీ ఇంటికి భోజనానికి వచ్చానా?" అన్నాడు.

"లేదు.... అయినా ముందుగానే హెచ్చరిస్తున్నాను...."

ఈ మాటతో కైలాసుడి ముఖాన కోపచిహ్నాలు అలముకున్నాయి. అతడు నిండు స్వరంతో, "హరిదయాల్! నేను కాశీ పురోహితుణ్ణేమీ కాదు—ఇక్కడికొచ్చిన యాత్రికుల్ని స్తుతించి దోచుకుని పొట్టపోసుకోవటానికి! నా జీవితంలో యీ నాటి వరకూ నా మనసుకు మంచిదని తోచిన పనిచేశాను, ఇకముందు కూడా చేస్తాను," అన్నాడు.

హరిదయాల్ ఈ జవాబు విని తలవంచుకుని, "బాబాయ్, నీ మేలుకోసమే...." అంటూ నిశ్శబ్దమైనాడు.

"నీ సలహాల నా కవసరం లేదు. ఎవరి సలహాలూ లేకుండానే ఎనభై ఏళ్ళ కాలం గడిపాను. మరి కొద్దికాలం గడవకపోతుందా?" అన్నాడు కైలాసచంద్రుడు.

కైలాసచంద్రుడు, సరయూను తన ఇంటికి తీసుకువచ్చి, "అమ్మా! ఈ ఇంటి భారమంతా ఇక నీమీద పెట్టేశాను. ఇంటి పనీపాటులన్నీ చూసుకుంటూ, యీ ముసలివాణ్ణి కాస్త కనిపెట్టివుండు, చాలు," అన్నాడు.

సరయూ జవాబేమీ చెప్పలేక కన్నీళ్ళు కార్చుతూ చాలాసేపు మౌనంగా కూర్చుండిపోయింది.

## 9

సరయూ ఇల్లు వదలి పోయిన తరవాత చంద్రనాథుడి జీవితం వేగవంతమైన నదిలో తెడ్డులేని పడవలాగా తయారయింది. అతడు ఆ నిర్జన గృహంలో పగలంతా పనేమీ లేకుండా అటూ ఇటూ తిరుగుతుండేవాడు. క్రమేణా ఆ గృహ వాతావరణం నిరాశాచ్ఛాయలతో ఘనీభవించ సాగింది.

ఆ మార్గశిరమాసంలోనే చంద్రనాథుడికి మళ్ళీ వివాహం చేస్తానని కాశీ తన పరిచయస్థు లందరికీ చెప్ప సాగింది. చంద్రనాథుడు మాత్రం ఆమె చెప్పేదానికి ఊఁ కొట్టి

ఊరుకునేవాడు. కాశీ, మణిశంకరుణ్ణి యీ వివాహ విషయమై అడిగి చూసింది. అతడు చంద్రనాథుణ్ణి అడిగి, అతడు సరేనంటే, అప్పుడు ఏర్పాటు చేయవచ్చన్నాడు.

దుర్గాపూజోత్సవాలు ప్రారంభమైనాయి. ఒకనాటి సూర్యోదయం వేళ మణిశంకరుడి దేవిడీలోంచి సన్నాయి, మద్దెళ్ళ మోతలు వినిపించసాగాయి. ఆ ధ్వనులు వింటూనే చంద్రనాథుడు కలత నిద్రనుంచి మేలుకున్నాడు. వింటున్నకొద్దీ ఆ వాయిద్యాలు అతడి హృదయంలో ఆవేదనను రేకెత్తించ సాగినై.

అతడు మంచం దిగి కాలకృత్యాలు తీర్చుకుని, నౌకర్ని పిలిచి, "నా సామానంతా త్వరగా సర్దు, అలహాబాదు వెళ్ళాలి," అని చెప్పాడు.

నౌకరు ద్వారా యీ వార్త విన్న కాశీ, ప్రజకిశోరుడూ పరుగు పరుగున వచ్చి చంద్రనాథుడి ప్రయాణం ఆపాలని చూశారు. అతను వినలేదు. ఆఖరుకు మణిశంకరుడు కూడా వచ్చి, "ఇవాళ షష్ఠిరోజు. ఇల్లు విడిచి ఎక్కడికీ పోకూడదు," అని చెప్పాడు. అయినా చంద్రనాథుడు తన ప్రయాణం మానలేదు.

ఓ గంట తరవాత హరిబాల వచ్చింది. సరయూ ఇల్లు వదిలి పోయిం తరవాత, ఆమె యీ నాటివరకూ చంద్రనాథుడి ఇంటికి రాలేదు. ఆ పిణ్ణి చూస్తూనే, "దారితప్పి వచ్చావా, దీదీ?" అన్నాడు చంద్రనాథుడు.

హరిబాల నౌకరు సర్దుతున్న సామానుకేసి చూసి, "ప్రయాణమా? పడమటి దిక్కుకేసి వెళతావా?" అని అడిగింది.

"అవును, అటే!" అన్నాడు చంద్రనాథ్.

హరిబాల కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "మరింకెక్కడికైనా వెళ్ళదలిచావా?" అని అడిగింది.

హరిబాల ఉద్దేశం గ్రహించిన చంద్రనాథుడు, "లేదు," అన్నాడు.

హరిబాల కొంచెం ఆగి, "—ఆవిడకు ఏమైనా ఏర్పాటు చేశావా, బాబూ?" అని అడిగింది.

చంద్రనాథుడి కళ్ళు అశ్రుపూరితాలయినై. అతను మెల్లిగా, "ఇంకా ఏం ఏర్పాటు చేసేది?" అన్నాడు.

"కాశీలో ఆవిడ ఎక్కడుంటోంది?"

"బహుశా తల్లిదగ్గరే కావచ్చు!" అన్నాడు చంద్రనాథ్.

"డబ్బు మరి కొంచెం ఎక్కువ పంపుతూవుండు, బాబూ! ఇప్పుడామె ఒక్కతేగాని, మరి నాలుగు రోజులుపోతే...."

"మరి నాలుగు రోజులుపోతే...." అన్నాడు చంద్రనాథుడు ఆశ్చర్యపోతూ.




హరిబాల కన్నీళ్ళు తుడుచుకుంటూ, "ఆవిడకు నెలలు వచ్చాయి. భగవంతుడి దయ వల్ల ...." అంటూ ఆగిపోయింది.

చంద్రనాథుడు ఆపాదమస్తకం కంపించిపోయాడు. "ఇవ్వాళ షష్ఠి కదూ........అదే ఆలోచిస్తున్నాను," అన్నాడు తడబడుతూ.

"దుర్గాపూజ అయింతరవాత నీ యిష్టంవచ్చిన చోటుకు వెళుదువుగాని. ఈ నాలుగు రోజులూ ఇక్కడే వుండు బాబూ!" అని చెప్పి హరిబాల వెళ్ళిపోయింది.

దుర్గాపూజలు అయిపోయిం తరవాత ఒకనాడు చంద్రనాథుడు, ముసలి గుమాస్తాను పిలిచి, "....ఆమెను కాశీలో వదిలిరావటానికి వెళ్ళినప్పుడు హరిదయాళ్‌తో ఏమైనా మాట్లాడావా?" అని అడిగాడు.

"ఆ సమయంలో ఇంటిదగ్గర ఎవరూలేరు, బాబూ!" అన్నాడు గుమాస్తా.

"ఎవరూ లేరా? హరిదయాళ్ ఆ ఇల్లువదిలి మరెక్కడైనా వుంటున్నాడేమో!" అన్నాడు చంద్రనాథుడు వ్యాకులపడుతూ.

"ఆ సంగతిమాత్రం తెలుసుకున్నాను. హరిదయాళ్ ఆ ఇంట్లోనే వుంటున్నాడట."

"సరే, ఆమెకు ఇంతవరకూ డబ్బెంత పంపావ్?" అని అడిగాడు చంద్రనాథ్.

"డబ్బేమీ పంపలేదే!" అన్నాడు ముసలి గుమాస్తా తికమకపడుతూ.

"పంపించలేదా? ఎందుకు పంపలేదు?" అని అడిగాడు చంద్రనాథ్ కోపంగా.

గుమస్తా భయపడుతూ, "కాశీ అమ్మగారు నెలకు అయిదు రూపాయలు పంపితే సరి పోతుందన్నారు. అలాగే ఒకటి రెండు నెలలు పంపాను, తర్వాత పంపటం మానేశాను," అన్నాడు.

"అయిదు రూపాయలా? కాశీ సంపాయించి దాచిన ముల్లేమైనా పంపిస్తున్నావా? ఇక నుంచి నెలనెలా అయిదువందలు పంపిస్తూండు," అన్నాడు కసురుతూన్నట్టు చంద్రనాథ్.

"చిత్తం!" అని గుమాస్తా వెళ్ళిపోయాడు.

చాటునుంచి యీ సంభాషణ విన్న కాశీ, గుమాస్తాను పిలిచి, "మా వాడికి కోపం వస్తే మంచీచెడూ తెలియకుండా మాట్లాడేస్తాడు. నిజానికి వాడికి ఒక్కదమ్మిడీ పంపటం కూడా ఇష్టంలేదు. నేను అయిదు రూపాయిలు నెలనెలా పంపమన్నానని వాడికి కోపం. అందుకే వేళాకోళంగా అయిదువందలు పంపమన్నాడు," అన్నది.

గుమస్తాకు, కాశీ చెప్పిందే నిజం అన్న అభిప్రాయం కలిగింది. బుద్ధిపూర్వకంగా ఇంట్లోంచి వెళ్ళగొట్టిన దానికి డబ్బెవరు పంపుతారు? గుమాస్తా ఇలా ఆలోచించి, కాశీతో, "సరే, అమ్మగారూ, పంపనులే," అన్నాడు.

"అసలు పంపకుండా ఊరుకునేవు! నెలకు అయిదు రూపాయిలు మాత్రం పంపు తూండు. మా వా డివ్వకపోతే నేనిస్తాలే," అన్నది కాశీ.

కాశీ పై ఖర్చులకని ప్రతినెలా చంద్రనాథుడి దగ్గర యాభై రూపాయిలు తీసుకుం టుంది. ఆమె చెప్పినదానికి సరే అని గుమాస్తా తలవూపి వెళ్ళిపోయాడు.

రెండు రోజుల తర్వాత చంద్రనాథ్ అలహాబాదు ప్రయాణమై పోయాడు. గుమాస్తా కాశీ చెప్పిన సంగతి అతడికి రాద్దామనుకుని, ఈ స్వల్ప విషయానికి ఉత్తరం ఎందుకులే అని ఊరుకున్నాడు.

*　　　　*　　　　*

రెండు సంవత్సరాలు యిట్టే గడిచిపోయాయి. ఎవరి జీవితాల్లో ఎలాంటి మార్పులు వచ్చినా రాకపోయినా, వృద్ధ కైలాసచంద్రుడి జీవితంలో మాత్రం పెద్ద మార్పు వచ్చింది. కొద్దిరోజుల తేడాలో భార్యా, బిడ్డా మరణించినప్పుడే అతడికి యీ ప్రపంచం నుంచి వెలుగు పోయినట్టయింది. తిరిగి ఇన్నేళ్ళ తర్వాత సరయూ కన్న శిశువును చూడగానే అతడికి ప్రపంచమంతా వెలుగుతో నిండినట్టనిపించింది.

సరయూ మగ శిశువును కన్నప్పుడు అతడు అందరితో, "మా ఇంట విశ్వేశ్వరుడు అవతరించాడు," అని చెప్పాడు.



ఆ పసిగుడ్డు పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, కైలాసచంద్రుడికి అతడిమీద మమకారం మరింతగా పెరగసాగింది. కైలాసుడు పొద్దున్నే లేస్తూ, "విశ్వం!" అనేవాడు.

విశ్వం మంచంమీంచి తల పైకెత్తి, "తాతా!" అని సమాధాన మిచ్చేవాడు.

"పద నాయనా, శంభూమిశ్రాతో ఒక ఆట ఆడివద్దాం," అనేవాడు కైలాసచంద్రుడు. విశ్వం చదరంగపు పావులమూట చేతబట్టుకుని వచ్చి "పద," అంటూ అతడి కాళ్ళను చుట్టివేసేవాడు.

శంభూమిశ్రా ఇంట విశ్వేశ్వరుడికి కూడా ఒక ప్రముఖస్థానం వుంది. అతను తాత ఒళ్ళో కూర్చుని, పావుల సంచీ చేత పట్టుకుని, అవసరం అయితే ఒకటి రెండు ఎత్తులు చెప్పగలుగుతున్నట్టు ధీమాగా ఆటకేసి చూస్తూండేవాడు. కాని, అతడి ధ్యానమంతా ఏనుగుల మీదా, గుర్రాలమీదా కాక, ఆ ఎర్రబంటు పావుమీదే వుండేది. అది తన చేతికి రానంత వరకూ అసంతృప్తిగా దానికేసే చూస్తూండేవాడు. ఆట పూర్తయిన తర్వాత అతడు ఎర్రబంటు పావు చేతపట్టుకుని, తాత చంక నెక్కి ఇంటికి తిరిగివచ్చేవాడు.

ఒకరోజున బోలానాథ్‌గారింటి వద్ద హరికథ చెపుతున్నారు. కైలాసచంద్రుడు ప్రయాణ మవుతూ, "విశ్వం, పద హరికథ వినివద్దాం!" అన్నాడు.

ఇద్దరూ అక్కడికి వెళ్ళేసరికి, హరిదాసు భారతంలోని భరతముని కథ చెబుతు

న్నాడు. ఆ ఋషి లేడిపిల్లను ఎలా రక్షించి తన ఆశ్రమానికి తీసుకువచ్చి సాకిందీ, కరుణ రసం పుట్టిపడేలా వర్ణించాడు.

తరవాత కొన్నాళ్ళకు లేడిపిల్ల పెద్దదయింది. అది పర్ణకుటీరం వదిలి, పుష్పవాటిక ల్లోనూ, ఆ తరవాత చుట్టూవున్న అరణ్యంలోనూ స్వేచ్ఛగా తిరగసాగింది. ఏనాడైనా అది మామూలు వేళకు పర్ణశాలకు తిరిగి రాకపోతే భరతముని వ్యాకులపడుతూ, అరణ్యం లోకి పోయి, ఆ లేడి కోసం గాలిస్తూ, "రా! రా!" అంటూ దుఃఖ స్వరంతో కేకలు పెట్టేవాడు. మరికొంతకాలం గడిచాక ఆ లేడి తనను పెంచిన ముని ప్రేమబంధాన్ని తెంచు కుని అరణ్యంలోకి పోయి మళ్ళీ తిరిగి రాలేదు.

భరతముని దాని కోసం, రా! రా! అని అరుస్తూ చెట్లూ, పుట్టలూ—అన్నీ వెతికాడు. కాని, అది కనిపించలేదు. అతడు దుఃఖిస్తూ ఆశ్రమానికి తిరిగివచ్చి, తిండీ తిప్పలూ, పూజా పునస్కారాలూ మానివేశాడు. కొన్నాళ్ళకు అతణ్ణి మృత్యువు సమీపించింది. ఆ క్షణంలో కూడా అతడు వణుకుతున్న పెదవులతో, "రా, రా, రా" అనసాగాడు........

కైలాసచంద్రుడు, విశ్వాన్ని గట్టిగా కావిలించుకున్నాడు. అతని హృదయం కూడా కంపించిపోతూ, "రా! రా!" అని పిలవసాగింది.

కథ అయిపోయిం తర్వాత కైలాసచంద్రుడు, విశ్వాన్ని ఎత్తుకుని ఇంటికి తీసుకు వచ్చి, సరయూ కిస్తూ, "తీసుకో, అమ్మా! నీసొమ్ము నీ దగ్గిరే వుండటం మంచిది!" అన్నాడు.

సరయూ, ఆ వృద్ధుడి కళ్ళనుంచి అశ్రువులు జారటం చూసి విస్తుపోయింది.

# 10

దాదాపు రెండేళ్ళపాటు చంద్రనాథుడు చాలా ప్రదేశాలూ, తీర్థాలూ తిరిగాడు. ఈ కాలంలో అతడికి ఇంటితో సంబంధమేమీలేదు. డబ్బు అవసరం అయినప్పుడు గుమాస్తాకు రాసి తెప్పించుకుంటూండేవాడు. అప్పుడప్పుడూ మణిశంకరుడూ, వ్రజ కిశోరుడూ అతడికి ఇంటికి తిరిగిరమ్మనీ, మళ్ళీ వివాహం చేసుకుని స్థిరపడమనీ ఉత్తరాలు రాస్తూండేవారు. కాని, చంద్రనాథుడు వాటికి జవాబులు కూడా ఇచ్చేవాడు కాదు.

ఆఖరికి హరిబాల నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఆమె, అతడితో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలనీ, త్వరగా ఇంటికి తిరిగి రమ్మనీ రాసింది. చంద్రనాథ్ ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ రోజునే హరిబాల అతణ్ణి చూడవచ్చింది.

"జరిగిందేదో జరిగిపోయింది. మళ్ళీ వివాహం చేసుకో, చంద్రనాథ్," అని సలహా యిచ్చిందామె.



"ఈమాట చెప్పేందుకా నన్ను యింటికి తిరిగి రమ్మని రాసింది?" అని అడిగాడు చంద్రనాథ్ అసంతృప్తి వుట్టిపడే గొంతుతో.

ఆ సమయానికి మణిశంకరుడు కూడా అక్కడికి వచ్చి, "చంద్రనాథ్! మళ్ళీ

వివాహం చేసుకో. నేను నీకు బాగానచ్చే పిల్ల నొకదాన్ని చూసి వుంచాను," అన్నాడు.

చంద్రనాథుడు చాలాసేపు మౌనంగా వూరుకుని చివరకు, "ఆ సంబంధం ఎక్కడ మాట్లాడారు?" అని అడిగాడు.

"కలకత్తాలో. నువ్వోసారి వెళ్ళి పిల్లను చూసి రావటం బావుంటుంది," అన్నాడు మణిశంకరుడు.

"సరే, వెళతాను," అన్నాడు చంద్రనాథ్ నిస్పృహగా.

మర్నాడు చంద్రనాథ్ ప్రయాణమై, బ్రజకిశోరుణ్ణి వెంటపెట్టుకొని కలకత్తా వెళ్ళాడు. పిల్లను చూడటం అయింతర్వాత, "పిల్ల నిజంగా లక్ష్మిలా వుంది. నీకు నచ్చింది గదా, బాబూ?" అని అడిగాడు బ్రజకిశోరుడు.

చంద్రనాథుడు, "ఉహూఁ!" అంటూ తల అడ్డంగా తిప్పాడు.

తర్వాత అతడు స్టేషనుకుపోయి, అలహాబాదుకు టిక్కెట్టు కొనుక్కున్నాడు. అది చూసిన బ్రజకిశోరుడు, "నువ్వు మళ్ళీ ఎప్పుడు ఇంటికి తిరిగివస్తావు?" అని అడిగాడు.

"బహుశా, యిప్పట్లో రాను. బాబాయికి నా నమస్కారాలు అందచేయండి" అన్నాడు చంద్రనాథ్.

ఇంటికి వచ్చి బ్రజకిశోరుడు, జరిగిందేమిటో చెప్పగానే, మణిశంకరుడు నెత్తీ నోరూ బాదుకుంటూ, "నా వంట్లో కాస్త కులాసా చిక్కగానే వెళ్ళి, సరయూను పిలుచుకు వస్తాను. సంఘానికి దాసోహమని, వ్యర్థంగా నరకబాధలు అనుభవించలేను. సంఘమంటే ఎవరు? మనమే గదా....మనుషులం!" అన్నాడు.

కాళీ యీ మాటలు విని, "ఈ ముసిలాయనకి చావు ముందు మతిచెడింది!" అన్నది భర్తతో ముక్కూ, చేతులూ తిప్పుతూ.

*     *     *

చంద్రనాథుడు అలహాబాదు వెళ్ళేందుకని టిక్కెట్టుకొన్నాడు. కాని, దారిలో మనస్సు మార్చుకుని కాశీలో దిగేశాడు; వెంటవున్న సామానూ అదీ నౌకర్ల చేత సహవారి బంగళాకు పంపి, తాను కాలి నడకన హరిదయాల్ ఇంటికి బయలుదేరాడు. అతడికి నడుస్తూంటే, ఎంతో పరిచితమైన ఆ పరిసరాలు చూసి దుఃఖంపొర్లుకు రాసాగింది.

అతడు పెద్ద బజారువైపునుంచి, హరిదయాల్ ఇంటికి వెళ్ళే మలుపు తిరిగాడు. ఇక ముందుకు అడుగు వెయ్యటం ఎంతో భారమనిపించింది. అలాగే కాళ్ళీడ్చుకుంటూ పోయి హరిదయాల్ యింటిముందు నిలబడ్డాడు. ఇంటి తలుపులు దగ్గిరకు వేసి వున్నాయి.

చంద్రనాథుడికి హరిదయాల్‌ను పిలవటానికి ధైర్యం చాల లేదు. అతడు మరి




కాసేపు మూసివున్న తలుపులవేపే చూస్తూ నిలబడి, చివరకు తడబడే గొంతుతో, "హరి దయాల్ బాబూ!" అని కేకపెట్టాడు.

దాసీ ఒకతె తలుపు తెరిచి, "వారింట్లో లేరు," అని చెప్పింది.

"ఆయన లేడా? సరే, ఒక అమ్మాయీ....పిల్లాడూ....వాళ్ళయినా వున్నారా?" అని అడిగాడు చంద్రనాథ్.

"అలాంటివారు యీ యింట్లో ఎవరూ లేరండీ....నేను సంవత్సరంగా యిక్కడ పని చేస్తున్నాను!" అన్నది దాసీ మనిషి.

చంద్రనాథ్ యిక ఆమెనేమీ ప్రశ్నించకుండా, వసారాలో ఉన్న ఒక కుర్చీ మీద కూర్చుని హరిదయాల్ రాకకోసం ఎదురుచూడసాగాడు. రెండు ఝాములవేళ హరి దయాల్ ఇంటికి వస్తూనే, చంద్రనాథ్‌ను చూసి ఆశ్చర్యపోతూ, "చంద్రనాథబాబా! ఎప్పుడొచ్చారు?" అని అడిగాడు.

"చాలాసేపయింది....వాళ్ళెక్కడుంటున్నారు?" అన్నాడు చంద్రనాథ్.

"వాళ్ళా? ఓహో!........వాళ్ళు కైలాసబాబుగారింటి వద్ద వుంటున్నారు. ఆ ఇల్లు మీకు తెలుసుగదా, గొంది చివర పనసచెట్టున్న ఇల్లు," అన్నాడు హరిదయాల్.

"సరే, మళ్లీ వస్తాను," అంటూ చంద్రనాథ్ లేచి అడుగులో అడుగు వేసుకుంటూ కైలాసచంద్రుడి ఇంటికి వెళ్లాడు. వాకిటి పక్కగా ఒక చక్కని కుర్రాడు నీళ్లున్న పళ్లెంలో తన ముఖం చూసుకుంటూ, ప్రతిబింబాన్ని వెక్కిరిస్తున్నాడు.

చంద్రనాథ్‌లో ఏదో ఆవేశం, వాత్సల్యం ఉప్పొంగింది. బిడ్డను చంకనెత్తుకున్నాడు. ఆ కుర్రాడు నదురూ బెదురూ లేకుండా, "ఎవరూ?" అని అడిగాడు.

చంద్రనాథుడు అతడి బుగ్గల్ని ముద్దుపెట్టుకుంటూ, "నేను....నాన్నని....నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నా పేరు విశ్వం."

చంద్రనాథుడు జేబు గడియారం గొలుసు తీసి కుర్రాడి మెడలో వేశాడు. జేబులోంచి పర్సూ, కలమూ, చాకూ తీసి యిచ్చాడు.

ఇదంతా చూసిన దాసి ఒకతె లోపలి గదిలోకి పరిగెత్తి, సరయూతో, "అమ్మగారూ! ఎవరో ఇంట్లోకి వచ్చి విశ్వాన్ని ఎత్తుకుని షికారు చేస్తున్నారు," అని చెప్పింది.

సరయూ కిటికీలోంచి నడవా కేసి చూసింది. చంద్రనాథుడు! వెంటనే ఆమె గబగబా వచ్చి అతడికి నమస్కరించింది.

"సరయూ!" అన్నాడు చంద్రనాథుడు, ఆపైన మాట్లాడేందుకు అతడి గొంతు పెగలలేదు.

భర్తకు ఒక కుర్చీవేసి అతడు కూర్చోగానే తాను పక్కన నిలబడి, ఇంటి సంగతులు అడిగింది సరయూ. కాశీ దంపతుల యోగక్షేమాలూ, దాసదాసీల సమాచారాలూ అడిగి తెలుసుకొని, "మీరు వివాహం ఎక్కడ చేసుకున్నారు?" అని ప్రశ్నించింది.

"పడమట." అన్నాడు చంద్రనాథ్.

"వధువు ఎలాంటిది? మంచిదేనా?" అని అడిగింది సరయూ.

"నీలాగే వుంటుంది!" అన్నాడు చంద్రనాథ్ నవ్వాపుకుంటూ.

ఈ జవాబుతో సరయూ హృదయం ఏదో ఆవేదనతో నిండిపోయింది. ఆమె తనను తాను సంబాళించుకోవాలని చూసింది కాని, సాధ్యం కాలేదు. చప్పున కిందపడిపోయింది. ముఖం వివర్ణమైంది.

చంద్రనాథుడు భయంతో వణికిపోతూ కుర్చీలోంచి లేచి చప్పున భార్యతలను పైకెత్తి ఒడిలో పెట్టుకుని, "సరయూ! సరయూ!" అంటూ ఏడ్వసాగాడు.

సరయూ కళ్ళు తెరిచి ఓ క్షణంసేపు భర్త ముఖంలోకి చూసింది, తిరిగి కళ్లు మూసుకున్నది. అంతలో దాసీది వచ్చి సరయూ ముఖం మీద నీళ్లు చల్లి, "భయపడకండి, బాబుగారూ! అప్పుడప్పుడూ యిలాగే వచ్చిపోతూంటుంది," అన్నది.

కొంచెం సేపటికి సరయూకు తెలివి వచ్చి, సిగ్గుపడుతూ పైట సర్దుకుని లేచి కూర్చున్నది.



"చివరి క్షణాలనుకున్నాను," అన్నాడు చంద్రనాధుడు కన్నీళ్లు తుడుచుకుంటూ.

'నా తల మీ ఒళ్లో వుంది. ఈ నిర్భాగ్యురాలి నొసట ఆ మాత్రం అదృష్టం రాసి వుంటే, ఇంకా కావలసిందేమిటి?' అని మనసులో అనుకుని, సరయూ, "అప్పుడప్పుడూ యిలాగే వస్తూంటుంది," అన్నది చంద్రనాధుడితో.

"పూర్వం ఇలాంటిది లేదే!" అని ఓ క్షణకాలం ఆగి, జేబులోంచి తుప్పుపట్టిన తాళపు చెవుల గుత్తి తీసి, "ఇదిగో, నాకిచ్చి వచ్చిన తాళపు చెవులు. తిరిగి నీవి నీకే ఇస్తున్నాను," అన్నాడు.

సరయూ తాళపు చెవుల్ని తీసుకుంటూ, "ఆమె కెందు కిచ్చారు కాదు?" అని అడిగింది.

చంద్రనాధుడు భార్యను గట్టిగా కావిలించుకుంటూ, "నాకు ఇద్దరు భార్యలు లేరు, వున్నది ఒక్కతే!" అన్నాడు.

సరయూ కొంచెంసేపు వూరుకుని, "అయితే, మీరు మళ్లీ ఇక్కడి కెప్పుడొస్తారు?" అని అడిగింది.

"నువ్వు ఎప్పుడు రమ్మంటే అప్పుడు," అన్నాడు చంద్రనాధ్.

"నేను తమర్ని ఒక భిక్ష అడగదలిచాను. నా మరణవార్త విన్న తర్వాత ఒక్కసారి వచ్చి బిడ్డను తీసుకువెళ్ళండి," అన్నది సరయూ.

చంద్రనాథుడు ఉద్వేగపడిపోతూ కొడుకును ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు. ఒక నిముషంగడిచీ గడవకముందే బజారునుంచి తిరిగి వచ్చిన కైలాసచంద్రుడు, వాకిట్లో వుండే, "నాయనా, విశ్వం!" అని కేక వేశాడు.

ఆ కేక వింటూనే విశ్వం తండ్రి ఒడిలోంచి దిగి, "తాతా!" అంటూ బయిటికి పరిగెత్తాడు.

కొద్దిసేపటికి కైలాసచంద్రుడు విశ్వాన్ని ఎత్తుకుని లోపలికి వచ్చాడు. విశ్వం, చంద్ర నాథుణ్ణి చూపుతూ, "నాన్న!" అన్నాడు. చంద్రనాథుడు లేచి, కైలాసచంద్రుడికి నమ స్కారం చేశాడు.

కైలాసచంద్రుడు, విశ్వాన్ని ఎత్తుకుని స్థిమితంగా కుర్చీలో కూర్చున్న తరవాత, చంద్రనాథుడు ఆయనతో, "రేపు సరయూను ఇంటికి తీసుకువెళతాను," అన్నాడు.

ఆ మాటలువింటూనే కైలాసుడి హృదయంలో ప్రళయంలేచినట్టయింది. కాని, ఎంతో అస్పష్టంగా, "అంతకన్నా కావలిసిందేమిటి?" అన్న మాటలు అతడి నోటి నుంచి వెలువడినై.

సరయూ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె కైలాసచంద్రుడి ముఖంకేసి ఓసారి చూసి భర్తతో, "ఈ నిర్భాగ్యురాలిని ఇక్కడే వుండనివ్వండి," అన్నది.

చంద్రనాథుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, "నేను నీ భర్తను. ఇష్టం లేక పోయినా, రమ్మన్నప్పుడు నా వెంట రావలసివుంటుంది. పైగా, నేను విశ్వాన్ని విడిచి వుండలేను," అన్నాడు.

సరయూ ఏమీ మాట్లాడలేకపోయింది. ఆమెలో దుఃఖం పొంగులువారుతున్నది. కైలాసచంద్రుడు లేచి, ఏదో పనివున్నట్టు ఆమెను చాటుకు పిలిచి, "ఏడవకమ్మా. ఎప్పు డైనా కాశీకి వస్తే, యీ వృద్ధుణ్ణి ఓసారి చూసిపో," అన్నాడు.

సరయూ దుఃఖం కట్టలు తెంచుకున్నది. ఆమె నిరాశ్రయురాలై కాశీకి వచ్చింది. అతడు ఆశ్రయం ఇచ్చి ఆదరించాడు. "తాతా! నన్నూ, విశ్వాన్నీ విడిచి మీరు వుండ లేరు," అన్నదామె.

"నేను ఇంకా బతికుండేది మాత్రం ఎంతకాలమమ్మా!" అన్నాడు కైలాసచంద్రుడు.

సరయూ కన్నీళ్ళు తుడుచుకుంటూ, "మా హృదయాల్లో దయాదాక్షిణ్యాలకు స్థానం లేదు. కృతఘ్నులం!" అన్నది.

"అలా అనకమ్మా. నీ హృదయం ఎలాంటిదో నాకు తెలియందా?" అన్నాడు కైలాసచంద్రుడు.

*                    *                    *

రాత్రి పదిగంటల సమయం. అంతా రైలుస్టేషన్‌కు ప్రయాణమవుతున్నారు. కైలాస చంద్రుడు నిద్రపోతున్న విశ్వాన్ని లేపి, "నాయనా, విశ్వం! ఎక్కడికి వెళుతున్నావు?" అని అడిగాడు.

"వెళుతున్నాం!" అంటూ విశ్వం ఉత్సాహంగా తన చేతిలోని ఎర్రబంతుపావును చూపించాడు.

"దాన్ని ఎక్కడా పోగొట్టుకోకు, బాబూ!" అన్నాడు కైలాసచంద్రుడు.

అరగంట తర్వాత అందరూ స్టేషను చేరారు. ఓ పావుగంటలో బండి వచ్చింది. చంద్రనాథుడూ, సరయూ పెట్టెలోకి పోయి కూర్చున్నారు. బండి కదలబోయే సమయంలో కైలాసచంద్రుడు, విశ్వాన్ని అతడి తండ్రి చేతి కిచ్చి, "నాయనా, విశ్వం!" అన్నాడు.

"తాతా!" అన్నాడు విశ్వం ఉత్సాహంగా.

"ఆ ఎర్రపావు పారేసుకునేవు, జాగ్రత్త!" అన్నాడు కైలాసుడు.

విశ్వం చేతిలోని పావును కైలాసుడికి చూపుతూ, "ఉహుఁ, పారేసుకోను........ ఎర్రపావు!" అన్నాడు. మరింత ఉత్సాహం కనబరుస్తూ.

కైలాసుడి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. బండి కదిలే సమయంలో, "సరే వుంటానమ్మా!" అన్నాడు సరయూతో. మళ్లీ ఒకసారి "నాయనా విశ్వం!" అని పిలిచాడు. కాని, ఇంజను మోతలో విశ్వానికి ఆ వృద్ధుడి వ్యథతో నిండిన కంఠస్వరం వినిపించలేదు.

స్వగ్రామానికి తిరిగి వచ్చి, పినతండ్రి మణిశంకరుడి అభిప్రాయం తెలుసుకున్న చంద్రనాథుడికి తలమీది నుంచి సగం భారం దిగిపోయినట్టయింది. సరయూకు ప్రాయశ్చిత్తం లాటి మంత్రతంత్రాల తంతుపెట్టి, ఆమెను అవమానించవద్దన్నాడు మణిశంకరుడు. కాని చంద్రనాథుడికి ఇంకా సంశయం తీరక, "కాని....సంఘం మాటేమిటి?"అని అడిగాడు.

మణిశంకరుడు నవ్వి, "సంఘం అంటే ఎవరు? నువ్వూ, నేనూ కూడా అందులో భాగస్వాములమే. సరే, ఇంకో సంగతి; నీకు ఆ రాఘవ్‌దాసు సంగతి గుర్తుందా?" అని అడిగాడు.

"ఆఁ, లోగడ హరిదయాల్ మీకు రాసిన వుత్తరంలో అతణ్ణి గురించి చదివాను," అన్నాడు చంద్రనాథ్.

"మన కుటుంబంలో అపవాదుకు ఏమైనా ఆస్కారం వుంటే, దాన్ని నలుగురిలో



ప్రచారం చేయగలవాడు అతనొక్కడే. కొంతకాలం క్రితం నోట్లు దొంగిలించాడని అతన్ని జైల్లో పెట్టించాను. ఇప్పు డెక్కడున్నాడో తెలియదు," అని మణిశంకరుడు, ఆ దుష్టుణ్ణి జైలు పాలు చేసేందుకు తను పన్నిన పన్నాగం అంతా చెప్పాడు.

ఆ తరవాత ఒక పౌర్ణమినాడు మణిశంకరుడు, ఏదో శుభకార్యం నెపంతో, ఊరందరినీ భోజనాలకు పిలిచాడు. ఒక్కరైనా నోరెత్తలేదు. అందరూ విందుకు వచ్చారు. వాళ్లల్లో చాలామంది, ఎవరో శత్రువులు చంద్రనాధుడి మీద అపవాదు వేశారని గట్టిగా నమ్మారు కూడా.

ఆ రోజున కాళీ మాత్రం వేరుగా వండుకు తిన్నది. "ప్రాణం పోయినా, ధర్మాన్ని మాత్రం వదలను," అన్నది కాళీ అందరితో. కాళీ ఆమె భర్త ప్రజకిశోరుడూ తమ గ్రామం వెళ్ళిపోతా మన్నారు. చంద్రనాధుడు సరే అని, వారికి నెలకు వందరూపాయలు పంపే ఏర్పాటుచేశాడు.

# 11

తల్లి దండ్రులతో కలిసి విశ్వం వెళ్ళిపోయిన రాత్రి కైలాసచంద్రుడికి సరిగా నిద్రపట్ట లేదు. అతడికి మధ్య మధ్య ఎవరో, "తాతా! తాతా!" అని పిలుస్తున్నట్టు తోచింది.

తెల్లవారుతూనే అతడు మంచంమీంచి లేచి అలవాటు ప్రకారం, "విశ్వం!" అని పిలిచాడు. కాని, వెంటనే అతడికి విశ్వం తన ఇంటికి వెళ్లిపోయినట్టు జ్ఞాపకం వచ్చింది.

పది గంటలవేళ చదరంగం పావులు మూటగట్టుకుని కైలాసుడు శంభూమిశ్ర ఇంటికి వెళ్ళి, "విశ్వం వెళ్ళిపోయాడు, మిశ్రా!" అని చెప్పాడు. ఆ వార్త వినగానే, మిశ్రాక్కూడా విచారం కలిగింది. ఇద్దరూ చదరంగం బల్లమీద పావులు పెట్టారు.

"ఎర్రపావు ఏమైంది, బాబాయ్?" అని అడిగాడు మిశ్రా.

కైలాసచంద్రుడు నిట్టూర్చి, "విశ్వం తీసుకుపోయాడు. అదంటే వాడికి ప్రాణసమానం. ఎంత మాయమాటలు చెప్పినా దాన్ని వాడు వదిలిపెట్టలేదు," అన్నాడు.

తరవాత ఆట ప్రారంభమైంది. మధ్యలో కైలాసచంద్రుడు మంత్రిని కదిల్చి "విశ్వం!" అన్నాడు. దానికి మిశ్రా, అతడూ కూడా విరగబడి నవ్వుకున్నారు.

ఆట ముగిసింది. మిశ్రా గెలిచాడు. అతడు పావులు మూటగట్టి కైలాసుడికిస్తూ "రేపు ఆడదాం. ఇవ్వాళ మీ మనసు బాగాలేదు, బాబాయ్!" అన్నాడు.

ఒక మాసం గడిచింది. వరసగా నాలుగు రోజులపాటు చదరంగం ఆడేందుకు రాకపోయేసరికి, శంభూమిశ్రా ఒకనాటి చీకటిపడేవేళ, కైలాసచంద్రుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో ఇంటి తలుపులు వేసి వున్నాయి. మిశ్రా ద్వారం దగ్గరకు పోయి, "బాబాయ్!" అంటూ పిలిచాడు.

దాసీమనిషి తలుపులు తెరిచి, "బాబుగారికి జ్వరం వస్తున్నది," అని చెప్పింది.

మిశ్రా లోపలికిపోయి, కైలాసుడు పడుకున్న మంచపక్కనున్న కుర్చీలోకూర్చుంటూ, "జ్వరం ఎన్ని రోజులుగా వస్తున్నది, బాబాయ్?" అని అడిగాడు.

కైలాసచంద్రుడు నవ్వుతూ, "జ్వరం ఏమిటి? నాకు పిలుపు వచ్చింది. వెళ్ళబోతున్నాను," అన్నాడు.

"అలా అనకండి. వైద్యుణ్ణి పిలిచారా?" అన్నాడు మిశ్రా.

"ఈ ఎనభై ఏళ్ళవాడికి వైద్యుడు చేయగల సహాయం ఏమిటి?" అన్నాడు కైలాసచంద్రుడు.

"ఎనభై ఏళ్ళు ఓ వయసా? పైగా జ్వరానికి మందు తీసుకోటానికి వయసుతో సంబంధమేమిటి?" అన్నాడు మిశ్రా.

కైలాసుడు ఆ మాటలకు సమాధానం ఇవ్వకుండా నవ్వి, "మా విశ్వం ఉత్తరం రాశాడు, చూశావా? లక్ష్మి, లాంతరు కాస్త యిటు తీసుకురా, మిశ్రాకు విశ్వం రాసిన వుత్తరం చూపించాలి," అన్నాడు.

పనిమనిషి లాంతరు దగ్గరకు తేగానే, కైలాసుడు తలగడ కిందినుంచి ఉత్తరం ఒకటి తీసి, దాన్ని మిశ్రాకు చదివి వినిపించాడు. అది బెంగాలీ భాషలో వుంది, హిందూస్థానీ మిశ్రాకు అది కొంత అర్థమైంది, కొంత అర్థం కాలేదు.

ఆ రాత్రే శంభూమిశ్రా వైద్యుణ్ణి పిలుచుకు వచ్చాడు. వైద్యుణ్ణి చూసి కైలాసచంద్రుడు, "మా విశ్వం ఉత్తరం రాశాడు, చదువుతాను వింటారా?" అన్నాడు.

"ఎవరా, విశ్వం?" అన్నాడు వైద్యుడు. అతడు విశ్వాన్ని ఎరగడు. కైలాసుడు లాంతరు తెప్పించి, దాని వెలుతురులో వుత్తరం అంతా చదివాడు. వైద్యుడు వింటున్నాడో, లేదో అన్న ధ్యాసే అతడికి లేదు. వైద్యుడు పరీక్షచేసి మందిచ్చి వెళ్ళిపోయాడు.

రెండు వారాలు గడిచినై. కైలాసుడి జ్వరం మాత్రం తగ్గలేదు. ఆ జ్వరంలోనే పొరుగింటి కుర్రవాణ్ణొకణ్ణి పిలిపించి, విశ్వానికి, "నేను బాగానే వున్నాను, కాని ప్రస్తుతానికి వంట్లో మాత్రం బావుండటం లేదు." అని ఉత్తరం రాయించాడు.

కైలాసచంద్రుడు బతకడని తెలిసిం తర్వాత హరిదయాల్ ఆయన్ని చూడటానికి వచ్చాడు. కొంచెంసేపు ఆ సంగతీ యీ సంగతీ మాట్టాడుకున్న తరవాత కైలాసుడు తలగడ కిందినుంచి ఉత్తరం తీసి, "విశ్వం రాశాడు. చదువు, నాయనా!" అన్నాడు.

ఉత్తరం ఆ సరికి బాగా పాతగిలిపోయింది. ఒకటి రెండుచోట్ల చినుగులు కూడా పట్టింది. హరిదయాల్ దాన్ని చదివి, "ఇది సరయూ దస్తూరీ," అన్నాడు.

"అవును, సరయూ, విశ్వానికి రాసి పెట్టింది. వాడికింకా చదవటం రాయటం రాదు కదా? కాస్త చదవటం ప్రారంభించాడంటే....వాడే స్వయంగా రాస్తూంటాడు," అన్నాడు కైలాసుడు.

హరిదయాల్ మౌనంగా వూరుకున్నాడు.

కైలాసచంద్రుడు ఉత్సాహంగా, "వాడు నన్ను మరిచిపోయాడనుకున్నావా, నాయనా! ఇప్పుడూ....తాతా, తాతా, అని ఏడుస్తూనే వుంటాడు. నాకు బాగా తెలుసు....తెలుసు!" అన్నాడు. అతడి కళ్ళు అశ్రుపూరితాలయినై.

ఇంటి పనిమషి లక్ష్మి, హరిదయాల్‌కు సైగచేసి పక్కకు పిలిచి, "బాబూ, ఇక మీరు వెళ్ళండి. లేకపోతే రాత్రంతా యిలాగే మట్టాడు తూంటాడు," అని చెప్పింది.

ఆ తరవాత మరి నాలుగురోజులు గడిచినై. మందు తీసుకుంటున్నా కైలాసుడికి జ్వరం వస్తూనే వున్నది. శంభూమిశ్రా రాత్రింబగళ్ళు అతడి దగ్గరే వుంటున్నాడు.

మగతనిద్రలో అతడెప్పుడూ, "నాయనా విశ్వం! నా పావు నా కిచ్చెయ్. అది లేకుండా ఆట సాగదు!" అంటూండేవాడు.

ఒకసారి శంభూమిశ్రా, కైలాసుణ్ణి, "ఏమిటి బాబాయ్, ఎప్పుడూ అలా మాట్లాడతావ్?" అని అడిగాడు.

కైలాసుడు, మిశ్రా ముఖంలోకి తీవ్రంగా చూసి, ఆతురతతో దిండుకింద వెదక సాగాడు. ఆ ఉత్తరం దొరకలేదు. అతడు దీనంగా, "నాయనా విశ్వం! నా పావు నా కిచ్చెయ్. పావులేకుండా ఎంతకాలం ఆడేది?" అన్నాడు.

జీవిత చదరంగంలో కైలాసచంద్రుడు పావుపోగొట్టుకున్నాడు. అతడు దానికోసం.... విశ్వాన్ని........విశ్వపతిని అర్థిస్తున్నాడు. శంభూమిశ్రా మంచం పక్కనే కూర్చుని వున్నాడు. లక్ష్మి దీపం తెచ్చి కైలాసుడి ముఖాన్ని పరీక్షగా చూసింది. అతడి కళ్ళు తేలిపోతూ, మూతలుపడుతున్నాయి. అతడు వణుకుతున్న పెదవులతో, "నా పావు నా కివ్వు, విశ్వం! పావులేకుండా మరెంతకాలం ఆడేది, ఆట? తొందరగా తీసుకురా!" అంటున్నాడు.

ఆ మర్నాడు హరిదయాల్, చంద్రనాథుడికి—'....నిన్న రాత్రి కైలాసచంద్రుడు కాలధర్మం చెందాడు....' అని ఉత్తరం రాశాడు.




భలే సలహా ఇచ్చావ్ గురూ!
ఇక్కడ పీఠం వేసిం
తర్వాత మన అదృ
ష్టమే తిరిగిపోయింద
నుకో!!
ఎంప్లాయిమెంట్
ఎక్ఛేంజి –
జ్యోతిష్యం


అసలు మన
రాష్ట్రంలోని
ఎంప్లాయిమెంట్
ఎక్ఛేంజీల
న్నిటి వద్దా
బ్రాంచీలు
తెరుదామను
కొంటున్నా!!


రాస్కెల్! 10 రోజు
ల్లో ఉద్యోగం
దొరుకుతుందని
జ్యోతిష్యం చెప్పి
5 రూపాయలు
కొట్టేశావ్ – 30
రోజులైనా ఇంకా
దొరకలేదు –
పీక నులిమేస్తా!
క్షమించు
గురూ! నేనూ
రెండేళ్ళు
నిరుద్యోగిగా
తిరిగి
చివరకీ
అవతారం
ఎత్తాను!!


మరీ ఇంత నిరాశావాదం
పనికిరాదు – 12 రోజుల్లో
ఉద్యోగం దొరకడం ఖాయం –
దొరక్క పోతే నేనే నిన్ను
అసిస్టెంటుగా ఉంచుకొంటా
సరేనా!



# మంచుతెర

గొర్తిరవి

ఆచారి నడుస్తున్నాడు.

కాదు కాళ్ళీడుస్తున్నాడు.

రేషను షాపు ఇంకా అరమైలు దూర ముంది.

పక్కనుంచి రిక్షా దూసుకపోయింది.

"ఒక్కసారి రిక్షా ఎక్కితే?" పిచ్చిగా నవ్వుకున్నాడు.

"రిక్షా ఎక్కే అర్హత లేదు, తొక్కే యోగ్యత లేదు." జీవితంలో మొదటి సారిగా తనమీద తనకే అసహ్యం వేసింది.

ఇదేవిటి? తను ఇలాగ నడుస్తున్నాడు! అరె నడుం కొంచెం ఒంగిందే. చిన్నపుడు తాతయ్య నడుం ఒంగిపోయి నడుస్తుంటే, చూసి నవ్వేవాడు. ఈనాడు తనకు పట్టుమని ముప్ఫయ్యేళ్ళు లేవు, అపుడే ముసలి రూపు వచ్చేసింది.

ఇంకా నయం, అక్కడక్కడ మంచి వాళ్ళుండబట్టి నడుం ఒంగింది. లేకపోతే ఎప్పుడో విరిగుండేది అనుకున్నాడు.

రేషను షాపు వచ్చేసింది. క్యూలో నుంచున్నాడు. పెళ్ళయిన తరువాత ఒక్క సారేనా భార్యని సినిమాకి తీసికెళ్ళ గలిగేడా? పిల్లలకి మంచి తిండి, బట్ట ఇవ్వగలిగేడా? పోనీ అయిపోయిందేదో అయిపోయింది. భవిష్యత్తులో ఒక్కరోజంటే, ఒక్కరోజు తను వాళ్ళ కోరికలు తీర్చ గలడా? ఆలోచిస్తున్నాడు ఆచారి.

ఇంతలో ఉన్నట్టుండి కేకలు వినిపించాయి. ఆచారి లేచి నుంచున్నాడు. "పోలీసులు" అరిచేరెవరో. దడదడమని దిగేరు. దొరికిన వాడినల్లా చితక్కొట్టేరు. చేతి కందినవాడినల్లా లారీ ఎక్కించేరు.




ఆచారి కంతా అయోమయంగా వుంది. సంగతేవిటని అడిగేడు పక్కవాడిని. "ఏవీ లేదండీ, ఇందాక ఒచ్చినవాళ్ళు బానిసత్వం కావాలి అంటూ అరిచేరు. చూశారుగా? పోలీసులు ఒచ్చేరు" అని చెప్పేడు.

"బానిసత్వం" ఆచారి మొహం ఆనందంతో మెరిసింది.

పుష్కలంగా తిండి బట్టా కళ్ళముందర మెదిలేయి. బానిసత్వం అన్నమాటేగానీ, వాళ్ళ జీవితం ఎంత హాయిగా ఉండేది? ఇలా ప్రతిదానికీ కరువుండేదా?అడుగడుక్కీ లంచాలు ఉండేవా? గూండాలు ఇంత విచ్చలవిడిగా తిరిగేవారా? ఇంత అవినీతి ఉండేదా? గాంధీ అసలు పుట్టకపోతే బాగుండును. చిటికె నిప్పంటించి వెళ్ళేడు మహానుభావుడు. మొదటిసారిగా గాంధీ మీద కోపం వచ్చింది. స్వరాజ్యం రాకపోతే దేశం ఎంత అభివృద్ధి చెందేదో. ఛ! ఛ! గాంధీ మీదా తనకి కోపం, కాదు కాదు, ఈ గాడిదకొడుకులమీద. ఎవరన్నేం లాభం? గాంధీ మళ్ళీ పుడితేనో, అవును మళ్ళీ పుట్టి బానిసత్వం కోసం సత్యాగ్రహం చేస్తే, తను, పెళ్ళాం పిల్లలందరూ తప్పకుండా పాల్గొంటారు.

ఆచారికి వీరావేశం వచ్చేసింది. "బానిసత్వం కావాలి!" అంటూ అరిచేడు. దీని కోసమే కాచుక్కూర్చున్నట్టు పోలీసులు లాక్కెళ్ళి పోయారు.

పాపం, ఆచారి కోరిక ఫలించింది. బానిసత్వం లభించింది.

జైలు కటకటాల్ని చేతుల్తో బాదుతున్నాడు.

"అయ్యో, అయ్యో, ఏమిటండీ అది? ఉన్నదొక్కటే నులకమంచం, లెండింక. రేషను షాపు కెళ్ళాలి" అన్న కేకలతో తెలివొచ్చింది ఆచారికి.



# ఎవరు బాధ్యులు?

ఉన్నవ విజయలక్ష్మి

సాయంకాలం నాలుగు గంటలు దాటింది.

స్నేహితులతో సరదా ఖబుర్లు చెప్తూ హుషారుగా నడుస్తున్నాడు వాసు.

"అరుగో- ఆయన మీ మామయ్య కదూ?" అన్నాడు, ఓ స్నేహితుడు, రోడ్డుకి అటువేపు బస్సుస్టాపులో నిలబడి వున్న వ్యక్తిని చూపిస్తూ.

వాసు అటు తల తిప్పి చూసి, "ఆ.... అవును....ఈ మధ్య వూళ్లో లేడు. తిరిగి వచ్చాడన్నమాట," అన్నాడు.

"వెళ్ళి పలకరిస్తావా? అయితే మేం వెళ్తాం" అని ముందుకు సాగిపోయారు స్నేహితులు.

పరధ్యానంగా ఎటో చూస్తూ నిలబడి వున్న సుబ్బారావుగారు, వాసు పిలుపుతో ఇటు తిరిగి, "నువ్వా" అన్నట్లు కళ్ళతోనే పలకరించారు.

"ఊరికివెళ్లావన్నారు, ఎప్పుడొచ్చావు?" అన్నాడు వాసు.

"ఇవాళ ఉదయమే వచ్చాను మధ్యాహ్నం నాలుగు మెతుకులు నోట్లో వేసుకున్న దగ్గిరనుంచీ ఓ పని మీద

ఇక్కడా, అక్కడా తిరగాల్సి వచ్చింది. ఇవాళ ఎండంతా నా పరమే అయింది. ఇంక ఇంటికి వెళ్ళి పోదామనుకుంటే, ఈ బస్సు అతీగతీ కనిపించటం లేదు." అన్నా రాయన, పై మీది కండువాతో నుదురు అద్దుకుంటూ. ఆయన బాగా అలిసిపోయి నట్లు, మొహం వడిలిపోయి వుంది.

"ఓ బస్సు వస్తేమాత్రం నీ కందులో సీటు దొరుకుతుందా? ఈ వేళప్పుడు ఈ బస్సులు ఎంత రద్దీగా ఉంటాయో మనకి తెలిసిందేగా? అందులోనూ, నీ ముందు వున్న క్యూ చూస్తే ఫర్లాంగు దాకా వున్న ట్లుంది. నాలుగడుగులేగా మా యింటికి రా. కాస్సేపు కూర్చుని, ఎండ మరికాస్త చల్ల బడ్డాక వెళ్ళవుగాని," అన్నాడు వాసు.

"సరే, పద," అన్నారు సుబ్బారావు గారు.

ఇద్దరూ వాసు ఇంటివేపుకి నడక సాగించారు.

"నువ్వు వెళ్ళిన పని ఏమయింది?" అని అడగాలనిపించింది వాసుకి. అంతలోనే మరో వూహ వచ్చింది. "అది సుముఖంగా వుంటే, ఈ పాటికి ఆయనే నవ్వుతూ, సంతోషంగా చెప్పేసేవాడు కదా. ఈయన వాలకం చూస్తుంటే, అదీ సానుకూలం కాలేదేమో ననిపిస్తోంది. ఒకవేళ అదే నిజమయితే, నేను పనిగట్టుకుని అడిగి మరీ ఆయన్ని చిన్నబుచ్చటం ఏం బాగుం టుంది? ఇవాళకాకపోతే రేపయినా ఆయ నంతటాయనే చెప్తారు," అనిపించి, వూరు కున్నాడు.

తన ప్రక్కని మరో మనిషి వున్నాడనే ధ్యాసయినా లేనట్లు, ఏవేవో ఆలోచనలలో మునిగిపోయినట్లు, కొద్దిగా తలవంచుకుని నడక సాగిస్తున్న మామయ్యతో మరేం మాట్లాడాలో కూడా తోచలేదతనికి.

'ఆ సరళకి సంబంధం కుదిరిందాకా మామయ్యకీ దిగులు తీరదు!' అనుకు న్నాడు.

మౌనంగా అలా ఆయన ప్రక్కన నడుస్తూంటే, అయిదు సంవత్సరాల క్రితం తను రావూరు రావడం, మామయ్యను కలుసుకోటం అంతా, గుర్తురాసాగింది....

అయిదేళ్ళక్రితం ఓ రోజు....

"అమ్మా నాకు ఉద్యోగం దొరికింది. ఇదుగో ఇప్పుడే ఆర్డరు వచ్చింది." అంటూ సంతోషంగా, హడవిడిగా వంటగదివేపు నడిచాడు వాసు.

చేస్తూ చేస్తూన్న పనిలోంచి తల ఎత్తి, ఆప్యాయంగా, గర్వంగా కొడుకు వంక చూసుకుంటూ, "పోస్టు వచ్చిందా? నేను చెప్తూనే వున్నాను, నీకా వుద్యోగం తప్ప కుండా దొరుకుతుందీ అని. అయినా, ఏమవు తుందో, ఏమిటో అని, ఇదయిపోతూ, పదిరోజుల నుంచీ ఈ ఉత్తరం కోసం ఒక్కలా ఎదురు చూస్తున్నావు," అంది సావిత్రమ్మగారు.

"బాగుందమ్మా. నాలాంటివాళ్ళు, నా కన్న ఎక్కువ చదువుకున్నవాళ్ళు దేశంలో బోలెడు మంది వున్నారు. కాగితం చేతి లోకి వచ్చిందాకా అనుద్దా తప్పదు మరి.




సరే, నేను వేణుకి కూడ చెప్పేసి వస్తాను," అని ఉత్తరం మడిచి చేతిలో పట్టుకుని వెనక్కి తిరిగాడు.

"కబుర్లు పెట్టుకుని. మధ్యాహ్నం దాకా అక్కడే కూర్చోకుండా త్వరగా రా. నా వంట కూడ అయిపోవచ్చింది."

"ఇప్పుడే వచ్చేస్తాను," అంటూ గదిలోకి వెళ్లి, బట్టలు మార్చుకుని, వీధిలోకి వెళ్ళిపోయాడు వాసు.

వాసు స్నేహితుడు వేణు. అతనికి తెలిసినవాళ్ళ ద్వారా ఓ చిన్న వాటా అద్దెకు ఏర్పాటుచేసుకుని, ఏకంగా తల్లిని కూడా తీసుకుని, హైదరాబాదు ప్రయాణం అయ్యాడు వాసు.

నాలుగైదు రోజులు గడిచిపోయాయి.

ఓ ఉదయం కాఫీ చేస్తున్న సావిత్రమ్మ గారికి హఠాత్తుగా ఓ సంగతి గుర్తు వచ్చింది. "మా సుబ్బరావన్నయ్యా ఈ వూళ్లోనే వున్నాడురా! నా కిన్నాళ్లూ తట్టనే లేదు. చాలా రోజులనుంచి ఇక్కడే ఉన్నాడనీ, ఇక్కడ ఇల్లూ అదీ కట్టుకున్నాడనీ అప్పుడెప్పుడో చెప్పాడు. అతనూ స్కూల్లోనే మేష్టరు. నీ కెప్పుడూ కనిపించలేదూ? నా బాదస్తం కాని, కనిపిస్తే మటుకు నువ్వేం గుర్తుపడతావులే?"

తల్లి ధోరణికి నవ్వొచ్చింది వాసుకి. 'పేటకి నాలుగు స్కూళ్ళు వున్న ఈ పట్నంలో ఆయన పనిచేసేది ఏ స్కూలో ఏమిటో,' అనుకుంటూ, "మేము ఒకరిని ఒకరం గుర్తుపట్టలేమన్నది నిజమే అనుకో. అయినా ఆ పేరు గలవారు మా స్కూల్లో ఎవరూ లేరనుకుంటాను. అయినా కనుక్కుంటాలే. మా స్కూలు కాకపోయినా, చాలా రోజులనుంచి వుంటున్నారు కనుక,

ఎవరికైనా తెలుసుందేమో అడుగుతాను. ఇంటిపేరూ అదీ ఏమిటి?" అన్నాడు.

వివరాలన్నీ చెప్పింది సావిత్రమ్మగారు. ఆ సుబ్బారావుగారు సావిత్రమ్మగారికి పెద్ద నాయనమ్మ మనవడు.

ఆ సాయంకాలం అతను స్కూలు నుంచి తిరిగిరాగానే బోలెడు సంబరపడి పోతూ ఓ వార్త అందించింది సావిత్రమ్మ గారు: "మా అన్నయ్య అడ్రసు సంపాదించాను. ఇవాళ ఓసారి వెళ్ళి వద్దాం."

"అల్లాగా? ఎలా తెలుసుకున్నావు?" అన్నాడు వాసు. తను కోటీచర్నుని అడగటం మరిచిపోయిన సంగతి బయట పెట్టకుండా.

"మన పొరుగున లేరూ జానకమ్మగారు? మధ్యాహ్నం మాటల సందర్భంలో ఆవిడతో చెప్పాను. మా వాళ్ళు ఈ వూళ్ళోనే వున్నారు. కాని ఎడ్రసు తెలియదు, అంటూ అన్నయ్య పేరూ అదీ చెప్తే, ఆవిడకి తెలుసునని చెప్పింది. ఆ పేట పేరూ, అదీ నేను సరిగా జ్ఞాపకం పెట్టుకోలేనేమోనని, ఓ కాగితంమీద రాయించి తెచ్చుకున్నాను" అంది.

"అలాగే వెళ్దాం," అన్నాడు వాసు. గబగబా ఫలహారం కాఫీ అదీ ముగించుకుని, ఇద్దరూ బయలుదేరారు. వాళ్ళింటికి పది బారల దూరంలో వున్న బస్సు స్టాపులో బస్సు ఎక్కి, జానకమ్మగారు చెప్పిన స్టాపులో దిగి, ఆవిడ చెప్పిన గుర్తులనిబట్టి ఆట్టే శ్రమపడకుండానే సుబ్బారావుగారి ఇల్లు కనుక్కున్నారు.

పేపరు చదువుకుంటూ, వీధి వరండా మీదే కుర్చీలో కూర్చుని వున్న సుబ్బారావుగారు గేటు చప్పుడు వినిపించి, పేపర్లోంచి తల పైకెత్తాడు.

"ఎవరూ?" అన్నట్టు ఒక్క క్షణం చూసి, మరుక్షణంలోనే మొహంనిండా సంతోషం, సంభ్రమం నింపుకొంటూ, "నువ్వా!సావిత్రీ! ఈ వూరెప్పుడొచ్చారు? వీడు నీ కొడుకు కదూ? పెద్దవాడయిపోయాడు," అంటూ, ఆదరంగా, హడావిడిగా మాట్లాడేస్తూ, పేపరు కుర్చీలో పడేసి, రెండడుగులు ముందుకు వేసి, మెట్లదాకా వచ్చి మరీ వాళ్ళని ఆహ్వానించి, వెంటపెట్టుకుని ఇంట్లోకి తీసుకు వెళ్ళారు.

లోపలికి నడుస్తూనే సావిత్రమ్మగారు వాసు వుద్యోగం సంగతీ అదీ చెప్పింది.

"ఏమేవ్, ఓసారిలారా. ఎవరొచ్చారో చూడు," అంటూ హాల్లోంచే ఓ గావు కేక పెట్టారు సుబ్బారావుగారు.

"ఏమిటంత ఆర్భాటం చేస్తున్నారు?" అన్నట్లుగా కళ్ళనిండా కుతూహలం నింపుకుని, ఒకరుకాదు, ముగ్గురు వ్యక్తులు వచ్చారు, ఆయన కేకకి సమాధానంగా.

అక్కడక్కడా కొద్దిగా నెరసిన జుట్టు సిగచుట్టుకుని, నుదుట-నయూపైసా అంత కుంకుమబొట్టు పెట్టుకుని, పనిపాటలు చేసుకోటంలో కాస్త నలిగిపోయిన నేత చీర కొంగుకి తడిచెయ్యి తుడుచుకుంటూ, వంటింట్లోంచి వచ్చినావిడ సుబ్బారావుగారి




భార్య సుభద్రమ్మగారు.

టేబిల్ క్లాత్‌కి ఎంబ్రాయిడరీ కుడుతూ, పాడుతూ, తండ్రి కేక విని, ఆ బట్టా, సూదీ, దారం అల్లానే చేత్తో పట్టుకుని, గది లోంచి యివతలకి వచ్చిన పద్దెనిమిదీ, పంతొమ్మిదేళ్ళ అమ్మాయి సుబ్బారావుగారి పెద్ద కూతురు సరళ. పోయిన సంవత్సరం ఎస్. యస్. సీ. పరీక్ష వ్రాసి పాసు కాలేక, మరి చదువుమీద ఆసక్తి కూడా లేక, ప్రస్తుతం వూరికేనే వుంటోంది. గళ్ళ పరికిణీ, వాయిల్ కండువా, లాన్ జాకెట్టు వేసుకుని, సామాన్యమైన అలంకారంతో వున్న ఆ అమ్మాయిని చూస్తూంటేనే ముచ్చటవేసింది సావిత్రమ్మగారికి.

పెరటి వరండాలో కూర్చుని, కనకాంబరం పువ్వులు మాల కట్టుకుంటూ, కట్టుకుంటూ తండ్రి హడావిడికి ఒక్క పరుగున ఇవతలకి వచ్చిన పన్నెండేళ్ళ అమ్మాయి శారద, సుబ్బారావుగారి రెండో కూతురు. ఎదురుగా కొత్త వ్యక్తుల్నీ, తన చేతులలో మూరెడు పూలదండనీ, జారిజారిపోతున్న దారపు విచ్చినీ చూసుకుంటూ, మళ్ళీ తుర్రున లోపలికి పారిపోబోయింది, కాని తండ్రి పిలుపుతో ఆగిపోయింది.

పరిచయాలు అయాయి. ఈ ఇద్దరు అమ్మాయిలూ, ముగ్గురబ్బాయిలూ సుబ్బారావుగారి సంతానం. అబ్బాయిలు అలా బయట తిరగిరావటానికి వెళ్ళారు. వీళ్ళంతా కబుర్లు చెప్పుకుంటూంటే వాళ్ళూ వచ్చారు.

పెద్దవాడు రామచంద్రం సరళకంటే రెండేళ్ళు పెద్ద. బియ్యే చదువుతున్నాడు. తరువాతి ఇద్దరూ సరళకన్న చిన్న. శారదకంటే పెద్ద.

అందరితోటీ సరదాగా కబుర్లు చెపుతూ

ఓ గంటసేపు పైనే కూర్చుని, ఇంటికి తిరిగి వచ్చారు తల్లీ కొడుకూ. సావిత్రమ్మ గారికి చాలా సంతోషంగా, తృప్తిగావుంది. ఎన్నడో, ఆవిడ చిన్నతనంలో వాళ్ళకుటుంబాలు రెండూ ఒకే వూరిలో వుండేవి. అక్క చెల్లెళ్ళ సంతానంలా కాకుండా, ఒకే కుటుంబంగా మెలిగేవారు. ఆ తరవాత పెద్ద వాళ్లు గతించారు. పిల్లలు పెరిగి వుద్యోగ రీత్యా తలోచోటికీ వెళ్ళి పోయారు. రాక పోకలు కాస్త దూరం అయ్యాయి. ఇంక ఆ తరువాత వాళ్ళ సంతానం పెరిగి పెద్ద వారయి, అక్కడా అక్కడా స్థిరపడి పోయాక వుత్తర ప్రత్యుత్తరాలు కూడ లేకుండా పోయాయి. సావిత్రమ్మగారు ఈ సుబ్బారావుగారిని చూసి పదిహేనేళ్ళ పైనే అయింది. బంధువుల యింట్లో పెళ్ళి సందర్భంలో అప్పుడెప్పుడో చూసింది. ఈనాటికి ఇలా అనుకోకుండా, కొడుకు ఉద్యోగ రీత్యా ఒకే వూరిలో వుండటం తటస్థించటం, ఆ అన్నగారి కుటుంబాన్ని చూడగలగటం ఆవిడకి చాలా నిండుగా అనిపించింది.

"అన్నయ్య పెద్ద కూతురు చిలకలా వుంది కదురా?" అంది, రాత్రి వంటకి బియ్యం కడుగుతూ.

"వాళ్ళ పిల్లలందరూ బాగానేవున్నారు," మర్నాటి పాఠానికి ప్రిపేర్ అవటానికి పుస్తకం తెరుస్తున్న వాసు అన్నాడు.

"ఆ మాట నిజమేలే," అంది సావిత్రమ్మగారు.

ఆ తరువాత ఆవిడ తరచూ వాళ్ళింటికి వెళ్ళి వస్తూండేది. వాళ్ళూ అపుడపుడూ వచ్చేవారు.

నాలుగైదు నెలలు గడిచిపోయాయి.

"సరళని చూసుకోటానికి రేపు పెళ్ళివారు వస్తున్నారుట," అంది సావిత్రమ్మ గారు ఓ సాయంకాలం కొడుకుతో.

"అహఁ అల్లాగా? ఏ వూరు? అబ్బాయేం చేస్తున్నాడు?" అన్నాడతను, కుతూహలంగా. అశ్రద్ధ చేత కొంతా, పనిలేక కొంతా, తన స్నేహితులతో కాలక్షేపం అయిపోతూ వుండటంచేత కొంతా అతను మామయ్యగారింటికి వెళ్ళటం తక్కువే. అక్కడి విశేషాలన్నీ తల్లి ద్వారానే తెలుస్తూండేవి.

"అబ్బాయి మెడిసిన్ చదువుతున్నాడుట. తండ్రి జడ్జీగా పని చేస్తున్నాడుట. బాగా ఆస్తి అదీ వుందిటలే."

"అహఁ బాగుంది!" అన్నాడు వాసు సంతోషం వ్యక్తంచేస్తూ. సావిత్రమ్మ ఏమీ అనలేదు. తల కొద్దిగా వంచుకుని, గబగబ బెండకాయలు తరిగి, ఆ ముక్కలు విసురుగా పళ్ళెంలో పడేస్తున్న తీరూ, తనలో తనే మెల్లిగా ఓ నిముషం ఏమేమిటో గొణుక్కుని, తరువాత "ఊ" అంటూ ఒక్కసారి దీర్ఘంగా విసుగ్గా మూలగటం- ఆవిడలో వుత్సాహం అనేది ఏ మాత్రం లేనట్లు స్పష్టం చేస్తున్నాయి.

తల్లి వైఖరికి విస్తుపోతూ, మధ్య మధ్య ఆవిడ మొహం వంకే చూస్తూ,

మెల్లిగా కాఫీ తాగుతూ, అక్కడే ఓ పీట మీద కూర్చున్నాడు వాసు. కొద్ది నిముషాలు గడిచిపోయాయి. ఇంక ఆట్టేసేపు ఆ అసంతృప్తిని, నిరుత్సాహాన్ని తనలో ఇముడ్చుకో లేనట్లు సావిత్రమ్మగారు మెల్లిగా బయటపడిపోయింది: "ఏమిటో, అదీ ఇదీ అంటూ అలా బయటి సంబంధాలు వెతుక్కోకపోతే, కళ్ళ ముందున్న నీ కివ్వరాదదూ?"

తల్లి మాటలు వింటూ ఒక్క క్షణం తెల్లబోయాడు వాసు. ఆ తరువాత ఆ విణ్ణి చూస్తూంటే జాలి కలిగింది.

"ఇలాంటి కోరిక మనస్సులో పెట్టుకునే కాబోలు, ఆ పిల్లమీద ఓ ప్రత్యేకమైన అభిమానం పెంచుకుని తరచు సరళ గుణ గణాలూ, అందచందాలూ నా దగ్గర పొగుడుతూండేది." అనిపించింది.

"బాగుందమ్మా, నువ్వు చెప్పేది! తమ స్థితి ఎలావున్నా పిల్లలు అదృష్టవంతులు కావాలనీ, హోదాగా బ్రతకాలనీ ప్రతి తల్లీ, తండ్రీ కోరుకుంటారు. మనకే ముందని ఇస్తాడు మామయ్య పిల్లని?" అన్నాడు వాసు తేలిగ్గా నవ్వేస్తూ.

వాసు నెలల పిల్లవాడుగా ఉన్నప్పుడు తండ్రి చచ్చిపోయాడు. ఉన్న కొద్దిపాటి ఆస్తి మీద వచ్చే ఆదాయంతో ఓ పూట తినీ, ఓ పూట తినకా కాలం గడుపుతూ, ఆ పసిగుడ్డుమీదే ప్రాణాలన్నీ నిలుపుకుని, వాడిని పెంచుకుంటూ వచ్చింది సావిత్రమ్మ గారు. ఆ పల్లెటూరిలో చదువయిపోయింది. హైస్కూలు చదువుకీ, కాలేజీ చదువుకీ పట్నంలో కాపురం పెట్టారు. పంటమీద వచ్చేది ఏ మూలకీ చాలేదికాదు ఆ రోజుల్లో. అయినా కొడుకుని ప్రయోజకుడ్ని చెయ్యటం ఒక్కటే దృష్టిలో పెట్టుకుని, అవసరం అయినప్పుడు అక్కడా అక్కడా అప్పు చెయ్యటానికి కూడ వెనక్కి తియ్య లేదు ఆవిడ. వాసుకి డిగ్రీ చేతికి వచ్చింది. అటు ఆస్తి అప్పులకి చెల్లు అయిపోయింది. ఇంక పై చదువులకి అవకాశం ఎలాగూ లేదు. పరిస్థితి అంతా అర్థం చేసుకున్న వాసు, మంచి ఉద్యోగం కావాలి, మొదటే పెద్ద జీతం వుండాలి, ముందు ముందు ఎంతో పైకి వెళ్ళగలిగే అవకాశాలు వుండాలి, అంటూ కోరికలు పెంచుకుని కాలయాపన చెయ్యకుండా, వెంటనే దొరికిన మేష్టరు ఉద్యోగంలో చేరిపోయాడు. మేనమామ దృష్టి తనమీద పడకపోవటానికి కారణం అదే అని వాసుకి అర్థం అయింది. అందుకే ఆ మాట అన్నాడు.

కొడుకు మాటలు విని చివ్వున తల ఎత్తి, కాస్త ఆవేశంగా, అనాలోచితంగా అనేసింది! "ఏం? నీకేం తక్కువని? చదువులేదా? ఉద్యోగంలేదా? గుణంలేదా? ఏం లోపమని? ఇంకా, ఇంకా, పెద్ద చదువులూ, పెద్ద ఉద్యోగాలూ కావాలనుకుంటే నిన్నే చదివించవచ్చుగా? పైవాళ్ళకయినా అంతో ఇంతో కట్నం ముట్టజెప్పాలనే అనుకుంటున్నాడుగా?...."

"అమ్మా!" వాసు గొంతు బాధగా,

ద్రేకంగా పలికింది, "నాకు చిల్లిగవ్వ ఆస్తిలేని మాట నిజమే, పై చదువులు చదవాలనే కోరిక వుండికూడా, అవకాశం లేకపోయినమాట నిజమే. కాని, నాకు పిల్ల నిచ్చే మామ దగ్గర కట్నం తీసుకుని ఆ డబ్బుతో చదువుకోవాలని కానీ, లేకపోతే వాళ్ళ యింట్లో వుండి, వాళ్ళు చెప్పించే చదువు చదువుకోవాలనికానీ,నేను ఎప్పుడూ అనుకోలేదు. అసలు ఆ వూహే నాకు కంపరంగా వుంటుంది. నన్ను గురించి నువ్వు ఎప్పుడూ అలా ఆలోచించకు. మరో విషయం కూడా ఇప్పుడే చెప్తున్నాను. నువ్వు, నీ ఆలోచనలూ, అభిప్రాయాలూ చూచాయగానైనా సరే ఎక్కడా అనవద్దు, ఆఖరికి మన ఇరుగూ పొరుగూ వాళ్ళతో నయినా సరే. ఒకవేళ నీ నోటంట ఆ మాటలేమైనా బయటికి వచ్చాయంటే, పది మందిలోనూ నన్ను అవమాన పరచినట్లే!"

అతని ఆవేశం చూస్తూంటే, తను అర్థం లేకుండా, పిచ్చిగా మాట్లాడి, కొడుకు మనసు నొప్పించాను అనే పశ్చాత్తాపం కలగసాగింది సావిత్రమ్మగారిలో. ఆవిడ యేదో అనబోతూంటే మళ్ళీ అతనే అన్నాడు:

"కాలం కలిసివస్తే ప్రయివేటుగానో, లేకపోతే శెలవుపెట్టి కాలేజీలో చేరో, ఇంకా చదువుకోవాలనీ, ఇంకో వుద్యోగం లోకి వెళ్ళాలనీ నాకూ వుంది. అలాంటి అవకాశం ఏదీ రాకపోతే ఈ ఉద్యోగం లోనే వుండిపోతాను. ఇప్పుడయినా, నన్ను నేను తక్కువగా ఎన్నడూ చూసుకోను మనం నచ్చి, నాకు పిల్ల నివ్వటానికి ఇష్ట పడేవాళ్ళు దేశంలో ఇంకా చాలా మంది వుంటారు."

"నాకుమాత్రం తెలియదుటరా? యేదో, అయిన వాళ్ళం, ఇంకా దగ్గర కావాలని ఆశపడ్డాననుకో. కాని, నాకై నేను వెళ్ళి అడుగుతాననీ, పీళ్ళచేతా, వాళ్ళచేతా చెప్పించి అన్నయ్యని ప్రాధేయపడతాననీ ఎప్పుడూ అనుకోకు. నీ కలాంటి భయం



ఏమీ అక్కర్లేదు. నిన్ను చులకన చేసి ఇంక నేను బావుకునే దేముంది?" నన్ను అర్థం చేసుకో అన్నట్లు అనునయంగా కొడుకువంక చూస్తూ అంది. వాసు సిగ్గుపడి పోయాడు. బొత్తిగా ఏమీ తెలియని వాళ్ళకి చెప్పినట్లు తల్లిమీద అలా విరుచుకు పడ్డానేమిటా అనిపించింది. "అదేలే—నువ్వేమయినా తొందరపడతావేమోనని." అంటూ నసిగేశాడు. ఆ తరువాత సంభాషణ అంతగా సాగలేదు. కాస్సేపటి తరువాత వాసు లేచి గదిలోకి వెళ్ళిపోయాడు. సావిత్రమ్మగారు వంట పనిలో జొరబడి పోయింది.

ఓ ఆదివారం మధ్యాహ్నం, తీరికగా బయలుదేరి సుబ్బారావుగారింటికి వెళ్ళారు సావిత్రమ్మగారూ, వాసూ.

ఖబుర్ల ధోరణిలో మధ్యలో అడిగింది సావిత్రమ్మగారు, "సరళని చూసుకోటానికి విజయవాడ నుంచి పెళ్ళివారు వస్తారని చెప్పావు. పదిహేను రోజులు కావస్తోంది కదూ? అవాళ వచ్చారా? సంబంధం కుదిరి నట్లేనా?" ఆవిడ మాటలు వింటూ సుబ్బారావుగారూ, సుభద్రమ్మగారూ, పిల్లలూ అంతా కూడా ముసిముసిగా నవ్వుకుంటూ, మొహాలు చూసుకున్నారు. ఇంక సరళయితే పెద్దగా నవ్వేస్తూ, ఆ నవ్వు తెర మధ్య లోనే ఎలాగో-గొంతు పెగల్చుకుని అంది: "బలే ఫార్సు, అత్తయ్యా! అసలు అవాళ నువ్వూ, బావా కూడ రావలసింది. మిమ్మల్ని రమ్మని చెప్పటం మరిచిపోయానని అమ్మ అనుకుంది. ఇదుగో బావా ఆ పెళ్ళికొడుకు, అదే, ఆ మెడికోవున్నాడే, అచ్చంగా చింపాంజీ అనుకో. ఆ అబ్బాయి తల్లీ, తండ్రీ, అంతా ఓ జూలో వుండవలసిన వాళ్ళలా కనిపించారు నా కళ్ళకి. పెళ్ళి కూతురు తలవంచుకుని సిగ్గుపడుతూ కూర్చోవాలంటారు కాని, నా కయితే విరగ బడి నవ్వాలనిపించింది వాళ్ళని చూస్తే."

"చాల్లే! పిచ్చి వాగుడు!" అని ముద్దుగా కూతుర్ని మందలించి, "కానీ, వదినగారూ! ఆ పెళ్ళివారు మాత్రం ఇంచుమించు అమ్మాయి చెప్పినట్లే వున్నారు. ఏమిటో



వికారం పెట్టి నట్లయి, ఎంత త్వరగా వాళ్ళని ఇంట్లోంచి తరిమేద్దామా అనిపించింది," అంది సుభద్రమ్మగారు.

"ఆ సంబంధం చెప్పిన పెద్దమనిషి కయినా కాస్త బుద్ధి వుండొద్దూ? రత్నం లాంటి పిల్లకి అడవిమేళం లాంటి వాడిని తీసుకొస్తాడా? ఆ తరువాత ఆ మాట కాస్తా అతన్ని అడిగేశాలే....అబ్బెబ్బే, ఏం సంబంధం? ఏం మనుష్యులు?" అంటూ మొహం చిట్లించుకుని, ఆ సంబంధంపట్ల తన అయిష్టతని వ్యక్తం చేసుకున్నాడు సుబ్బారావుగారు.

"బాగానే వుంది!" అంది సావిత్రమ్మగారు, అంతకన్న మరే మనాలో తెలియక.

ఆ తరువాత కాస్సేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడి యింటికి వచ్చేశారు తల్లీ, కొడుకూ.

మరో రెండు మూడు నెలలు గడచిపోయాయి.

సరళకి ఇంకో సంబంధం చూశారు. ఈ పెళ్ళికొడుకు ఇంజనీరు. భిలాయ్‌లో పెద్ద జీతంమీదే వున్నాడు. అతని తండ్రీ, అన్నగారూ కూడా డాక్టర్లే. ఇద్దరూ కలిసి రాజమండ్రిలో పెద్ద నర్సింగ్ హోమ్ నడుపుతున్నారు. లక్షలు ఆర్జిస్తున్నారు.

"అబ్బాయి బంగారపు బొమ్మలా వుంటాడు అంటే నిజమే అనుకున్నాం. తెల్లగానే వున్నాడనుకోండి. ఏమిటో మొహంలో కాస్తయినా కళాకాంతీ లేకుండా, బొత్తిగా పిండి బొమ్మలా వున్నాడు" అంటూ పెదవి విరిచేసింది సుభద్రమ్మగారు, ఆ సంబంధం గురించి చెప్తూ.

ఇంకో నాలుగైదు నెలలు గడిచిపోయాయి. ఈసారి చూసిన పెళ్ళికొడుకు ఫారిన్ రిటర్డ్న — డాక్టరేటూ, పెద్ద వుద్యోగం, కారూ,హోదా అన్నీ వున్నాయి అబ్బాయి చూడముచ్చటగా ఉన్నాడు ఈ సంబంధం అయితే బాగుండునని అందరూ మురిసిపోయారు. అంత చదివిన అతనికి, బొత్తిగా పి. యూ. సీ. ఫేలయిన తనని భార్యగా పరిచయం చెయ్యటం కాస్త చిన్నతనంగా వుంటుందనీ, పెళ్లి అయిపోయాక ఎలాగో ఇంటి దగ్గరే శ్రద్ధగా చదివి మొదట పి.యూ. సీకీ, ఆ తరువాత బియ్యేకీ ప్రైవేటుగా కట్టాలనీ సరళ కలలు కనటం కూడా ప్రారంభించింది.

అయితే అదీ కుదరలేదు.

"ఏ నాలుగు వేలో అయితే ఎలాగో ఇవ్వగలం కానీ, మరీ పదివేలు కట్నం ఎక్కణ్ణించి తేగలం?" అంటూ దిగులు వెళ్ళబోసుకుంది సుభద్రమ్మగారు.

ఆ తరువాత ఇంకా ఏవేవో సంబంధాలు చూశారు. కొంతమంది పెళ్ళి కొడుకులు వీళ్ళకి నచ్చలే, కొంతమందికి వీళ్లు ఇస్తామన్న కట్నం నచ్చలే. ఏదైతేనేం, ఒక్కటీ కుదరలేదు. రోజులు గడిచిపోతున్నాయి.

ఓ రోజు, లీజర్ అవర్‌లో టీచర్స్ రూమ్‌లో కూర్చుని పేపరు తిరగవేస్తు




న్నాడు వాసు. కో టీచరు కామేశ్వరరావు గారు చేతిలో ఉన్న పుస్తకం పక్కకిపెట్టి, "ఏమయ్యా! వాసుదేవరావూ, నీ పెళ్ళి భోజనం మాకు ఇప్పట్లో పెట్టదలుచుకోలేదా? నీలాంటి బ్రహ్మచారులని చూస్తూంటే ఆడపిల్లలు గలవాళ్ళు వూరికే వుండలేరు మరి." అంటూ మొదలుపెట్టి, "మా అమ్మాయి కాదనుకో, మా చెల్లెలి కూతురుంది. నేను వచ్చి, మీ అమ్మగారితో మాట్లాడా లనుకుంటున్నాను. లేకపోతే మీవైపు పెద్ద వాళ్ళెవరైనా వుంటే చెప్పు, వాళ్ళని కలుసుకుంటాను," అని తన మనస్సులో మాట బైటపెట్టాడు. ఆ గదిలో వాళ్ళిద్దరే వున్నారప్పుడు. మొదటి నుంచీ వాసుకి ఆయన అంటే పెద్దవారనే గౌరవం, ఓ విధమైన అభిమానం ఉన్నాయి. ఆయనకి వాసు ఎడల వాత్సల్యం, మంచి అభిప్రాయం వున్నాయి. ఆ చనువు తోటే, ఆయన చెప్తూంటే, చిరునవ్వుతో వింటూ వుండిపోయిన వాసు, చివరికి—

"బంధువులూ, పెద్దలూ చాలామందే ఉన్నారనుకోండి. నా పెళ్ళి విషయంలో మాత్రం నా అభిప్రాయం, మా అమ్మ అభిప్రాయం తప్ప మరొకరి ప్రమేయం వుండదు," అన్నాడు ఎలాంటి అరమరికా లేకుండా.

"మా చెల్లెలూ, పిల్లలూ ఇప్పుడు మా ఇంట్లోనే వున్నారు. వచ్చి వారం రోజులయింది, మరో వారం వుంటారు," అంటూ సంభాషణ సాగించి, అన్ని వివ

రాలూ చెప్పాడు.

ఆ సాయంకాలమే వాసు వెంట వాళ్ళ యింటికి వచ్చి, సావిత్రమ్మగారితో కూడ మాట్లాడి పెళ్ళిచూపులకి రోజు నిర్ణయించుకుని మరీ వెళ్లాడు.

"పిల్ల కుందనపు బొమ్మలా వుంది. ఇదివరకు దాకా సరళే చక్కనిది అనుకునే దాన్ని, కాని ఇప్పుడు రాధకే సరళకన్న పది మార్కులు ఎక్కువ వేస్తాను." అంది సావిత్రమ్మగారు పిల్లని చూసి ఇంటికి వచ్చాక తృప్తిగా నవ్వుతూ.

"మొత్తానికి మేష్టారికి అమ్మని అనిపించుకున్నావు. మార్కులు వెయ్యటం తెలిసిపోయింది," అన్నాడు వాసు నిండుగా నవ్వుతూ.

పెళ్ళి నిశ్చయం అయిపోయింది. తరువాత సుబ్బారావుగారికి కూడ ఆ సంగతి చెప్పి, లాంఛనంగా ఆయన సలహా కూడతీసుకుని, పెళ్ళి పెత్తనం అంతా ఆయన చేతిలోనే పెట్టింది సావిత్రమ్మగారు.

బంధువులంతా వచ్చారు. పెద్ద ఆర్భాటమూ; అట్టహాసమూ లేకపోయినా పెళ్ళి బాగానే జరిగిపోయింది.

కొడుకూ, కోడలూ ఎంతో అన్యోన్యంగా మసలుకొంటూ, సరదాగా హాస్యాలాడుకుంటూ, మధ్య మధ్య చిలిపిగా వాదాలు వేసుకొని తనని మధ్యవర్తిగా తీర్పు చెప్పమని అడుగుతూ, సంతోషంగా రోజులు గడిపేస్తూంటే, ఆ వేడుక చూడటానికి రెండు కళ్ళూ చాలవనిపిస్తుంది సావిత్రమ్మగారికి. అంత ఆనందంలో కాలం గడుస్తున్నటు తెలియకుండానే మూడు సంవత్సరాలు దొర్లిపోయాయి ఆ మధ్య కాలంలో వాసు టీచర్సు ట్రైనింగు కూడ పూర్తి చేశాడు. ఇంక ఇప్పుడు

"ఇప్పుడు రాధ వంట్లో కులాసాగా వుంటోందా?" అని సుబ్బారావుగారు పలకరించటంతో, వాసు ఆలోచనలకి ఒక్కసారి కొద్దిగా అంతరాయం కలిగింది. అంతే కాదు, సరిగ్గా తను ఆలోచిస్తున్న విషయమే ఆయన అడగటంతో ఏదో బిడియం వంటి భావం ఒక్కసారి అతన్ని చుట్టేసినట్లయింది. కాని, అది ఆయన కంటపడకుండా అంతలోనే సర్దేసుకుని, "ఆ, ఆ, ఇప్పుడు బాగానేవుంది" అనేశాడు గబగబా

తమకి పుట్టబోయేవాడిని గురించి రాధతో ముచ్చట్లు చెప్పుకుంటూ గంటలకి గంటలు గడిపేసే వాసు, ఇప్పుడు ఆయనకి సమాధానం చెప్పటానికి మాత్రం అంతకన్న మాటలు దొరకలేదు. ఇల్లు సమీపించటంతో ఆయన మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ గేటు తెరుచుకుని, ఇంట్లోకి వెళ్ళారు.

"రా, అన్నయ్యా, రా. ఊరినుంచి వచ్చేశావన్న మాట. అబ్బాయి దారిలోకలిశాడా ఏమిటి?"అంటూ హడావిడిగా పలకరించేసి, "ఎండలో వచ్చావు. మంచి నీళ్లు తీసుకొస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది సావిత్రమ్మగారు.




వాసు వెంట సుబ్బారావుగారు కూడ పెరట్లోకి వెళ్ళి, మొహం, కాళ్ళు కడుక్కు-వచ్చారు. మొహం తుడుచుకుని, టవల్ వాసుకి అందించి, "ఇవాళే పూరి నుండి వచ్చాను," అన్నారు చెల్లెలి చేతిలో మంచి నీళ్ళ గ్లాసు అందుకుంటూ.

"అహఁ, ఏమిటి పెళ్ళివారి కబుర్లు? సంబంధం నిశ్చయం అయిపోయినట్లేనా?" అంది సావిత్రమ్మగారు కుతూహలంగా.

మంచినీళ్ళ గ్లాసు రెండు గుటకలలో ఖాళీచేసేసి బల్లమీద పెట్టి తాపీగా మొదలు పెట్టారాయన: "కట్నాలు పుచ్చుకోటం అనే ఆచారం వుంది చూశావూ, దీనికి ముగింపు ఎప్పుడో కనిపించటం లేదు. కట్నాలు పుచ్చుకోకూడదూ అంటూ ప్రభుత్వం ఓ బిల్లు ప్రవేశపెట్టిందే కాని, దానివల్ల ప్రయోజనం మాత్రం ఏమీ కనిపించటంలేదు. అదివరకు పబ్లీకుగా పుచ్చుకునేవారు ఇప్పుడు రహస్యంగా తీసుకొంటున్నారు. అదివరకు పుచ్చుకునేదాన్ని వరకట్నం అని స్పష్టంగా అనేవారు. ఇప్పుడు తీసుకునేదానికి లాంఛనాలు, ప్రెజెంట్సు అంటూ మరో పేరు తగిలించారు. అంతే కాని, డబ్బు పుచ్చుకోటం మాత్రం ఒక్కళ్ళూ మానలేదు. ఈ ఆడ పిల్లలు గలవాళ్ళ అగచాట్లు తీరే రోజు ఇప్పటిలో రాదేమో!"

ఆయన ఈ ఉపోద్ఘాత మంతా దేని కోసమో సావిత్రమ్మగారికీ, వాసుకీ అర్థం అయిపోయింది. ఈ బెంగుళూరు వారు కూడ బాగా కట్నం అడిగి వుంటారు. ఈ సంబంధం కూడ పుసిగిపోయిందన్న మాట, అనిపించిదా ఇద్దరికీ.

"ఇప్పటికి అయిదేళ్ళ పైగా సరళకి సంబంధాలు చూస్తున్నాడు. ఇంతవరకూ ఏదీ కలిసిరాలేదు. ఏమిటో మామయ్యని

చూస్తోంటే జాలివేస్తోంది," అనుకున్నాడు వాసు. అయిదేళ్ళ క్రింత మొట్టమొదటి సారి వాళ్ళింటికి వెళ్ళినప్పుడు తమని ఆప్యాయంగా ఆదరంగా పలకరిస్తూ, కుర్చీ లోంచి లేచి ముందుకు వచ్చిన మామయ్యకీ, ఈరోజు ఈ మామయ్యకీ ఎంతో తేడా కనిపిస్తోంది. ఈ అయిదేళ్ళల్లోనే ఎన్నో ఏళ్లు పెరిగిపోయినట్లూ, వృద్ధాప్యం వచ్చి మీద బడిపోనట్లూగా వున్నారాయన. సావిత్రమ్మగారికి కూడ అలాగే అనిపించింది. వాళ్లు ఏమీ అడగకుండానే మళ్ళీ సుబ్బారావుగారే మొదలుపెట్టాడు:

"ఏం చేస్తాం? లోకం అంతా ఓ దారిన పోతూంటే, నేను ఒక్కడినీ మరో దారిన పోతానంటే ఎలా కుదురుతుంది? సరళకి మరో రెండు నెలలలో ఇరవై నాలుగు నిండుతాయి. శారదకి మొన్నే పదిహేడేళ్లునిండాయి. దీనికెలాగో మూడు ముళ్లూ వేయించి, ఇంక దానికి సంబంధాలు చూడటం మొదలుపెట్టాలి. కన్న వాళ్ళకి బాధ్యత తప్పదు కదా? ఇంకవాళ్ళు అడిగిన దానికి ఒప్పుకున్నట్లు ఫ్తుత్తరం వ్రాసేసి, ఓ మంచి రోజు చూసుకుని వెళ్ళి తాంబూలాలు పుచ్చుకుని వచ్చేద్దామా అని ఆలోచిస్తున్నాను."

"ఎంత అడిగారు?" అంది సావిత్రమ్మగారు.

"కట్నం రూపంలో కానీ కూడ అడగ లేదనుకో — కట్నం అక్ఖర్లేదనటంవల్లే నేను ఆశతో అంతదూరం వెళ్ళాను— సరే, వాళ్ళు అడిగిన లాంఛనాలన్నీ జరపాలంటే పదివేలు పైన అవుతుంది. ఆపైన పెళ్ళి కూడా దర్జాగా చెయ్యాలి. వాళ్ళ బంధువులంతా పెద్ద పెద్ద ఉద్యోగస్థులు. చాలా మందే వస్తారు. మర్యాదలకి ఏలోటూ లేకుండా చూసుకోవాలి. సంబంధానికి మాత్రం ఏవంకా లేదు. రాజాలాంటి సంబంధం. అందుకే ఎలాగో తంటాలుపడి కానిచ్చేద్దామనుకుంటున్నాను. తరువాత మా ఇబ్బందులేవో మేం పడతాం!"

వింటున్న సావిత్రమ్మగారూ, వాసూ మొహాలు చూసుకున్నారు. కూతురికి పెద్ద సంబంధం చెయ్యబోతున్నాను అనే సంతోషం ఓ ప్రక్క పొంగుకు వస్తున్నా, ఇంత డబ్బు ఇప్పుడు ఎలాగో సర్దుబాటు చెయ్యాలి, ఈ శుభకార్యం జరిగేసరికి నా నడుం సగం ఒంగిపోతుంది అన్న భావం కూడ మరోప్రక్కనుంచి తెలుస్తూనే వుంది ఆయన మాటల్లో.

"మామయ్యకి ఇప్పుడు పదిహేనువేలు పైనే ఖర్చవుతుంది. ఎక్కడ్నుంచి తెస్తాడు? మామయ్య తండ్రి పోయాక ఆ పొలం కాస్త అమ్మేసి అన్నదమ్ములందరూ తలో ఇంతా తీసుకుంటే వచ్చినదాంతో ఆ చిన్న ఇల్లు కట్టుకుని ఇంకా ఇంతో అంతో మిగిలితే బ్యాంకిలో వేశాడుట. అంతకు మించి, అయిదుగురు పిల్లలూ, తనూ, భార్యా, తిండీ బట్టా, చదువులూ, అన్నీ గడుపుకునేసరికి మామయ్య జీతంలో మిగిల్చిందేమీ వుండదుకదా-రెండు మూడేళ్ళ నుంచీ రామ




చంద్రం నెలకో రెండువందలు సంపాదిస్తున్నాడన్న పేరేగాని, వాడి ఖర్చులు వాడికీ వుంటాయి. ఏ మాత్రమో మిగిల్చినా, అది మాత్రం ఎంత వుంటుంది? రెండోవాడిని ఇంజినీరింగులో చేర్పించాడు. వాడి చదువు పూర్తి కానేలేదు. మూడోవాడు ఇంకా బియ్యేలోనే దండయాత్రలు చేస్తున్నాడు. ఇంక రెండేళ్ళల్లో మామయ్య రిటైర్ అయిపోతే, ఆయన జీతం ఆసరా కూడా వుండదు. ఆ వచ్చే ప్రావిడెంటు ఫండు ఈ సరళ పెళ్ళికి చేసిన అప్పుకి సరిపోతుందో, సరిపోదో? ఇంకా శారద పెళ్ళి ఒకటి వుండనే వుంది," అనుకున్నాడు వాసు, మామయ్య పరిస్థితిని తలుచుకుని జాలిపడుతూ.

అయితే ఆ భావం అతనిలో ఎక్కువ సేపు నిలవలేదు. మరోరకం ఆలోచనలూ వూహలూ అతని మనస్సుని ఆక్రమించేసుకున్నాయి. "ఈ కట్నాలు ఇచ్చుకోలేక ఆడపిల్లల తల్లి దండ్రులు నానా అవస్థలూ పడుతున్నారు-నిజమే-కానీ, దీనికి కారణం ఏమిటి? ఇందులో తప్పంతా మొగపిల్లల తల్లిదండ్రులదే అనటంలో సబబు ఎంతవరకూ వుంది? మనం సమ

స్యని ఒక్క ప్రక్కనుంచే చూసి దానికి పరిష్కారం కూడ ఆ ఒక్క ప్రక్కనుంచే జరగాలి అనుకోవటంలో అర్థం ఏమైనా వుందా? ఎక్కడిదాకానో ఎందుకు, యీ మామయ్య సంగతే తీసుకుంటే, ఇప్పటికి అయిదేళ్ళ నుంచీ సంబంధాలు వెతుకు తున్నారు. ఒక్కటీ నిశ్చయం కాలేదు అంటాడు. మరి, అవి నిశ్చయం కాకపోవ టానికి తను మాత్రం బాధ్యుడు కాదూ? ఎత్తయిన సంబంధాలు తప్ప మామూలువి తను చూడనేలేదు. వాళ్ళు అడిగిన కట్నం ఇవ్వలేను, అని ప్రతిసారీ వెనక తీసేకంటే ఓ సామాన్యమైన సంబంధమే చూసుకుని వుంటే తను ఇవ్వదలుచుకున్న కట్నానికి వాళ్ళూ అంగీకరించేవారు. ఈపాటికి పెళ్ళి అయిపోయేది. తను అప్పుకోసం ఇవాళ ఇలా వూరంతా తిరిగే అవస్థా పట్టేది కాదు. ఆ పని అతను చెయ్యలేదు. సరే పోనీ అని వాళ్ళు ఇస్తామన్న దానికే అంగీకరించి చేసు కుంటాం అన్న వాళ్ళకి వీళ్ళే తొంభై వంకలు పెట్టి వదులుకో లేదా? కాస్త, కను ముక్కు తీరుగా వున్న ఆడపిల్ల తను ఓ రంభనో, ఊర్వశినో అనుకోవటంలో తప్పు ఏమీ లేదు. కాని, తన సౌందర్యం చూసి ఏ అందాల రాజకుమారుడో, లేక పోతే ఇప్పుడు రాజులూ జమీందార్లూ లేరు కనక కొన్ని లక్షల రూపాయలకి వారసు డైన మన్మథుడు వీళ్ళని వరించి,కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకుని తీసుకుని చక్కా పోతాడు అని కలలు కనటం మాత్రం ఆరోగ్యకరం కాదు. ఒకవేళ చిన్నతనం వల్లనో, ప్రపంచానుభవం లేకపోవటం వల్లనో, వాళ్ళు అలాంటి వూహలలో విహా రిస్తూంటే వాళ్ళకి యదార్థం అర్థం అయ్యేలా చెయ్యాల్సిన బాధ్యత పెద్దలమీద వుంది. అలాంటివి లేకపోగా, 'మా అమ్మాయికేం? బంగారపు బొమ్మ, చిలకలా వుంటుంది! ఎవరైనా కళ్ళ కద్దుకుని మరీ చేసుకుం టారు'అని అత్తయ్యా, మామయ్యా ఎన్నో సార్లు నాతోనే అన్నారు. అంత అహం కారంతో వీళ్ళు బాగా డబ్బు, అందం, గుణం అన్నీ వున్న పెళ్ళి కొడుకు కోసం వెతుకుతూంటే, కానీ కట్నం తీసుకోకుండా చేసుకోటానికి అవతలి వారికేం అక్కర పుట్టింది. ఓ లక్షాధికారి తన కూతురికి ఏభై వేలు కట్నం ఇచ్చి, మరోయాభై వేలు ఖర్చుచేసి వైభవంగా పెళ్ళి చేసినా అతనికి చీమ తలకాయంతయినా బాధ అనిపించదు. అలాగే మరో భాగ్యవంతుడు కోడలికి పాతికవేల రూపాయిల నగలు పెట్టి, మరో పాతికవేల రూపాయలు పెళ్ళికి ఖర్చు చేస్తూ తన హోదాకి, దర్జాకి తగినట్లుగా మర్యాదలు జరిపించుకోవాలను కోటంలో మాత్రం తప్పేముంది? ఎటొచ్చీ ఏమీలేని వాళ్ళు వాళ్ళ మధ్య తలదూరిస్తేనే చిక్కు వస్తుంది. వియ్యాని కయినా, కయ్యాని కయినా సమాన వుజ్జీ వుండాలి. పిల్లలు సుఖపడాలనీ, భాగ్యవంతుల ఇళ్ళల్లో

మసలాలనీ ప్రతి తల్లీ తండ్రీ కోరు కుంటారు. అలాగని, శక్తికి మించిన పరుగులు పెట్టి, ఆపైన కాళ్ళు చచ్చుబడిపోయి కూలబడటం ఏమంత వివేకమైన పని? ఇంతెందుకు? ఇల్లు తాకట్టు పెట్టయినా డబ్బు తెచ్చి ఈ సంబంధమే చేస్తానంటున్నాడు కాని, మరో సంబంధం కాస్త క్రింది అంతస్తులోదయినా సరే, చేస్తాను అని, యీనాడైనా మామయ్య అనటంలేదు. ఎవరిదాకానో ఎందుకు? కళ్ళ ఎదురుగా వున్న నేనే ఆనాడు ఇతని దృష్టికి ఆనలేదు. ఇంక ఇది ఇంతే! ఇవాళ పదిపేలు అప్పు చేసి సరళ పెళ్ళి చేస్తాడు. మరో రెండేళ్ళు పోయాక మరో పదిహేనువేలు అప్పు చేసి శారద పెళ్ళి చేస్తాడు.... ఆ అప్పు అంతా తీర్చటం చేతకాకపోతే, చివరికి యిల్లు కూడా అమ్మేస్తాడు........" ఆలోచనలతో వూపిరి సలపక, వుక్కిరి బిక్కిరి అయిపోయినట్లు, ఒక్కసారి గుండెలనిండా గాలి పీల్చుకుని దీర్ఘంగా వూపిరి వదులుతూ, సుబ్బారావుగారి వంక చూశాడు. ఆయన సావిత్రమ్మగారితో ఇంకా ఖర్చులూ, అప్పులూ ఆ ముచ్చట్లే చెప్పుకుపోతున్నాడు.

"ఇదిగో, మామయ్యా, ఇవాళ నువ్వు ఈ పరిస్థితిలో వుండటానికి నువ్వు కూడా బాధ్యుడివే—మొగపెళ్ళి వారిని ఒక్కరినే ఆడిపోసుకోకు," అని చెప్పాలనిపించింది, వాసుకి.

కాని, అంత నిర్మొహమాటంగా మాట్లాడితే మామయ్య నొచ్చుకుంటాడు అని మళ్ళీ అనిపించి, వూరుకున్నాడు.

ఇంతలో రాధ రెండు గ్లాసులతో కాఫీ తీసుకు వచ్చింది.

"ఎవరిదాకానో ఎందుకూ? ఈ రాధకి నేను దొరకలేదూ? వీళ్ళ నాన్నగారు కూడా మామయ్యలాగే గొంతెమ్మ కోరికలు పెట్టుకుని వుంటే ఈ నాటికీ ఇంకా అల్లుళ్ళని వెతకటంలోనే వుండేవారు. నలుగురు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేసేసరికి, వున్న యిల్లూ వాకిలీ హరించుకుపోయేవి," అనుకుంటూ, చిలిపిగా, ఆపేక్షగా రాధ వంక చూసి చిన్నగా నవ్వాడు వాసు.

ఇంతసేపూ సుబ్బారావుగారిమాటలన్నీ, వంటగదిలో కూర్చుని విన్న రాధకి భర్త నవ్వులో భావం అర్థం అయింది. "ఇంకా నయం-మీరు అనదలుచుకున్న మాటలన్నీ మీ మామయ్య గారితో అనివుంటే ఆయన మీ ఆలోచనలని సమర్థించకపోగా మనమేదో వాళ్ళ సరళ అదృష్టాన్ని చూసి అసూయపడుతున్నాం అని అపార్థం చేసుకునే ప్రమాదం కూడా వుంది." అని అర్థం వచ్చేలా ఓసారి భర్త కళ్ళల్లోకి చూసి, ఆప్యాయంగా కాఫీ గ్లాసు అతని చేతికి అందించి లోపలికి వెళ్ళిపోయింది.


జమ్మిచెట్టువద్ద
భూతవైద్యుని
అద్భుత శక్తిపై
మాకు నమ్మకం లేదు


జమ్మిచెట్టువద్ద
భూతవైద్యుని
అద్భుత శక్తి
మాకు నమ్మకం


జమ్మిచెట్టువద్ద
భూతవైద్యుని
అద్భుతశక్తిపై
మాకునమ్మకంలేదు




ప్రకాశాన్ని మూడ్రోజుల నుంచి జ్వరం శనిదేశతలా పట్టి పీడిస్తోంది. అతని కిలాంటి జ్వరాలు రావడం అలవాటులేదు. ఎప్పుడయినా జ్వరం వచ్చినా పట్టించుకో కుండా వూరు మీద తిరిగేవాడు. యీ జ్వరం మామూలుదిగా వున్నట్లు లేదు. అందుచేతనే అతను మంచానికి అంటు కొని వుండాల్సి వస్తోంది.

"అమ్మా!" అని పిలిచాడు ప్రకాశం.

గొయ్యిలోంచి వచ్చిన అరుపులా అతని గొంతులోంచి ఆ మాటలు వచ్చాయి.

అమ్మ సాధారణంగా నవ్వదు. ఆవిడ ముఖంలో ఎప్పుడో తప్ప జీవకళ కన బడదు. వంటింట్లో శబ్దం మాత్రం విన బడుతూ వుంటుంది.

అమ్మ గొంతు అతనికి వినబడలేదు.

మళ్ళీ "అమ్మా!" అని పిల్చాడు.

పూర్తిగా చీకటీ రాలేదు, పూర్తిగా వెలుగూ పోలేదు—ప్రకాశంకి మాత్రం యిల్లు చీకటిగా వున్నట్లు కన్పిస్తోంది. యిల్లంతా చీకటి. లైట్లు వెయ్యరేం? వెయ్యడానికి ఎవరున్నారు? అక్కయ్యా వాళ్ళు ఎవరింటికో వెళ్ళారు. అన్నయ్యా యింకా రాలేదు. నాన్న యింకో గంట వరకు రాడు.

వున్నది నిశ్శబ్దంగానే అయినా ప్రకా శంకి నిశ్శబ్దంలోంచి ఏవో రొదలు విన బడుతున్నాయి. రొదలు కొంచెం కొంచెం

పెద్దవి అవుతున్నాయి. గుండెల మీద ఏదో బరువు పెట్టినట్లుగా వుంది. ఆ బరువు క్షణక్షణానికీ ఎక్కువ అవుతోంది.

"అమ్మా"

ప్రకాశానికి భయంగా వుంది. అతన్ని భయంనుంచి రక్షించడానికి అమ్మ రాలేదు. భయం ఎక్కువ అవుతోంది. గుండెల మీద బరువు ఎక్కువయి పోతోంది. తను ఆ బరువు క్రింద పడి నలిగిపోతు న్నాడు. ఏదో శబ్దం వినబడుతోంది. గుఱ్ఱం డెక్కల చప్పుడు లావుంది. వుహూ—తన గుండెల చప్పుడా?

ప్రకాశం ముఖాన లైటు పడింది.

పాలరంగు కాంతి గదినంతటినీ ఆక్ర మించుకొంది. కాంతిని భరించలేక ప్రకాశం ఒక్క క్షణం కళ్ళు మూసుకొన్నాడు. మళ్ళీ చప్పుడు.

"డామ్ డర్టీ గూస్...."

మళ్ళీ చప్పుడు. ప్రకాశం కళ్ళు తెరి చాడు. శశికళా, రాధారాణీ—యిద్దరూ హైహీల్సు చప్పుడు ఆపేశారు. చెప్పులు తీసేసారు. ప్రకాశం వాళ్ళవంక నీరసంగా చూశాడు.

"ఎలా వుంది?" అంది శశి.

"వాడికేం? బాగానే వుంటుంది. యిరవై నాలుగ్గంటలూ వూరిమీద తిరిగే వాళ్ళకు పడుకోవడమే కష్టం" అంది రాధ.

"తలనొప్పి—" అన్నాడు ప్రకాశం.

"అమ్మను పిలుస్తాను" రాధ లోపలకు వెళ్ళబోయింది.

"అమ్మ వద్దులే...."

"మరి?" శశి అంది.

"తల నొక్క..."

"అందుకే అమ్మను పిలుస్తానంది.... బట్టలు మార్చుకోవాలి" శశి విసురుగా లోపలకు వెళ్ళింది. ఒక్కసారి సిల్కు చీరలు పాలరంగు కాంతిలో ఆఖరుసారిగా మెరిసి మాయమైపోయాయి. ప్రకాశం కళ్ళు మూసుకున్నాడు.

"హూ....తల నొక్కాలా? గుడ్డ కడ్తే స్తాను" రాధ గుడ్డ ఏదో తెచ్చింది.

"వద్దు. అమ్మను పిలువ్...."

"మళ్ళీ అమ్మ....అమ్మ పప్పు రుబ్బు తోంది. ఇప్పుడు అమ్మ తల నొక్క డానికి వస్తే నేను పప్పు రుబ్బాలి-ఎవరు రుబ్బుతారు బాబూ...." తలకి గుడ్డ బిగిస్తూ అంది రాధ.

"ఇవాళ వాళ్ళింట్లో గొప్ప ఫన్‌గా వుందికదూ?" శశి లోపల్నుంచి వచ్చింది.

"ఎక్కడ కెళ్ళారు—" అన్నాడు ప్రకాశం.

"రావుగారింటికి వెళ్ళాం. రావ్‌గారి వైఫ్ బర్త్‌డే—" రాధ నవ్వింది.

"ఒసేయ్—నీకేం చెప్పాను. వచ్చి పప్పు రుబ్బమన్నానా లేదా?" అమ్మ గొంతు వినబడింది. అమ్మ నిలబడలేనట్లు నీర సంగా వుంది. మాసిన చీర తడిసింది.

"అబ్బ! వీడికి తల నొక్కాలిట."

"ఏడవలేక పోయావులే! తలకి గుడ్డ




కట్టి వెళ్ళి రుబ్బు."

"అబ్బ! నాకు ఒళ్ళంతా నొప్పులుగా వున్నాయి. నే రుబ్బలేను తల్లీ."

"కూర్చుని తినగలవూ?"

అమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

"రావ్‌గారి భార్య వుత్త అమాయకు రాలే—కదూ?" అంది శశి.

"వూ. ఆవిడ నెవరూ ఖాతరు చెయ్యరు. అదేం ఖర్మో" అంది రాధ

"అది సరే—రావ్‌గారు ఆవిడని కొడ తర్ట కూడాను...."

"నిజమే. ఆయనకి తాగటం ఓ ఫాషన్ట! ఆ సరదాలో కొంచెం చెయ్యి చేసుకుంటాడు" రాధ నవ్వింది. "ఆవిడ యిరవై నాలుగ్గంటలూ ఏడుపే—ఎలా భరిస్తోందో."

"అదే నాకూ విచారంగా వుంది. అలాంటి వాళ్ళను దేవుడెందుకు పుట్టి స్తాడో!"

"క్రితం జన్మలో మిగిలిపోయింది—ఏంచేస్తాం."

లోపల్నుంచి అమ్మ గొంతు విన బడింది.

"ఒసేయ్ రాధా, ఓసారిలా తగలడవే."

"అబ్బబ్బ ఒకటే హెల్—" రాధ విసుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"ఒక్క రవ్వ కూర చూసి చావ కూడదూ? ఎంత సేపూ ఆ కబుర్లు కాక పోతే."

"శశికి చెప్పకూడ దేమిటీ?"

"ఆ మహా తల్లికి చదువుతోనే తెల్ల వారి పోతుందిగా! దిక్కుమాలిన చదువులు వంట చెయ్యడానికి కూడా పనికిరావు."

"అమ్మా" శశి అరిచింది. "అంత

దిక్కుమాలిన చదువులైతే చదివించడం మానీ లేకపోయారూ? మళ్ళీ అనవస రంగా మాటలు కూడా దేనికి?"

"అనవసరంగా నేనే మాటలు అనేస్తు న్నాను. మీరంతా పడలేక చస్తున్నారు-"

"అను మరి లేకపోతే ఏమిటి?"

ప్రకాశంకి తల భారం ఎక్కువవు తోంది. రోజూ యిదే గొడవ. ఛీఛీ. తలపోటు—

"అక్కా...."

"మళ్ళీ ఏం వచ్చింది"—రాధ.

"తల నొక్కవే—"

"అవతల తిన్న తిట్లు విన్పించలేదే మిటి? దాన్ని నొక్కమను." విసురుగా వెళ్ళి పోయింది.

"నే చదువుకోవాలి" శశి పుస్తకాలు తెరిచింది.

'వెధవ బియ్యేలు తగలెడుతున్నారులే-' అన్పించింది ప్రకాశానికి. కళ్ళు మూసుకు పడుకున్నాడు. అప్పటి దాకా నిశ్శబ్దంగా వున్న గోడగడియారం అర్ధగంట కొట్టింది.

"డామ్—సెవెన్ థర్టీ—అయింది," అంది శశి గొణుక్కుంటున్నట్లు.

"అదిగో వచ్చేశాడు," అంది గుమ్మం వంక చూస్తూ. సైకిలు లోపలకు తెస్తు న్నాడు శాస్త్రి.

"తెచ్చావా?" అంది శశి.

"వూ. లేకపోతే చంపుకు తింటు న్నావుగా-" శాస్త్రి కొనుక్కొచ్చిన టూకాలు తీసి యిచ్చాడు.

"వెరీగుడ్. విమెన్స్ కాలేజీ న్యూ ఫాషన్స్‌లో మనం జాయినవుతున్నా మన్న మాట!"

"క్రొత్త ఫాషనా తల్లీ—ప్రజల్ని చంపుకు తినడానికి?" శాస్త్రి ఎప్పుడూ నవ్వుతుంటాడు. అలానే కనబడుతాడు అందరికీ.

"నువ్వు మహా చూసి మూర్ఛపోతు న్నట్లు మాట్లాడుతావు."

"వీడి కెలా వుంది? ద్రాక్షపళ్ళు తేవడం మర్చిపోయాను," ప్రకాశం వంక చూస్తూ. ప్రకాశం అటువేపు ముఖం పెట్టి పడుకొని వున్నాడు.

"వూ. వీడికూడా జ్వరం—" తమ్ముడి పరిస్థితికి నిట్టూర్చాడు.

"జ్వరాలు మానవులకు రాక—" అనబోయింది శశి.

"రాధ ఏదీ—"

"ఆవిడ యివాళ వంటిల్లు పావనం చేస్తోంది."

"రాధా—" శాస్త్రి పిల్చాడు.

రాధ వచ్చింది.

"ఓహూ, యివాళ వంటిల్లు పావనం అయిపోతోందిట!"

"అమ్మకి చెయ్యి వీలులేదుట."

"కూర మాడిపోతోంది—ఒసే-రాధా, ఎక్కడే—"

"అమ్మా—" శాస్త్రి పిల్చాడు.

"ఏమిట్రా-ఒసెయ్ నువ్విక్కడ కబు ర్లాడుతూ కూర్చో. అవతల కూర మాడి

చచ్చింది."

"ఏమిటమ్మా ఆ మాటలు? కొంచెం సౌమ్యంగా మాట్లాడకూడదూ?"

"కూర్చుని కబుర్లు చెప్పండి—సౌమ్యంగా మాట్లాడుతారు."

"వెధవ కొంప! ఎప్పుడూ తిట్లే—"

అమ్మ ఒణికి పోతోంది—

"అవున్రా—యిరవై నాలుగ్గంటలూ కాళ్ళూ చేతులూ తన్నుకొని చచ్చి చెడి యిల్లు గడుపుకొస్తుంటే వెధవ కొంపే అవుతుంది."

"ఆ వెధవ గొడవే వద్దనేది. ప్రపంచంలో నువొక్కత్తివే వంటచేస్తున్నట్లు! ఎప్పుడూ ఏదో ఒక హైరాన—"

"అవును, అన్నింటికి నేనే." అమ్మ కళ్ళు తుడుచుకొంటోంది.

ప్రకాశంకి బాధనిపించింది. అన్నయ్య ప్రతీదానికీ ఏదో ఒకటి అంటూనే వుంటాడు. కాసేపటి కతనికి ఏ గొడవా వినబడలేదు. గడియారం ఎనిమిది గంటలు కొట్టడం అతనికి వినబడింది.

"వెధవ కొంప ఎనిమిదవుతోంది. అవతల సినిమాకి వస్తానని చెప్పి వచ్చాను. యివతల తిండి తయారయి చావలేదు. నాకు అట్టూ వద్దూ, గాడిద గుడ్డూ వద్దు గాని, అన్నం పెట్టెయ్."

"అయినా యిది అన్నంగా వుందా? వెధవది, ముద్దయి చచ్చింది. యీ కూర మాడి చచ్చింది—ఒక్కదానికి లేదుకదా యింట్లో—"

ఎనిమిదిన్నర అవుతూ శాస్త్రి ధుమ ధుమ లాడుతూ యింట్లోంచి వెళ్ళిపోయాడు. శాస్త్రి అలా వెళ్తూనే సుబ్బరామయ్యగారిలా యింట్లోకి వచ్చారు. కొడుకును చూస్తూ—

"ఒరేయ్-ప్రకాశం," అన్నాడాయన.

"ఊఁ"

"ఆస్పత్రికి వెళ్ళావూ?"

"లేదు, నాన్నా—"

"ఏం?"

"అమ్మ తీసుకెళ్ళలేదింకా. తీసుకెళ్తుందేమో అడుగు."

"ఒసే—"

అమ్మ వచ్చింది.

"వీణ్ణింకా ఆస్పత్రికి తీసుకెళ్ళలేదూ?"

"ఎక్కడ యీ యింట్లో గొడవల్తో తెమిలి చావడంలేదు. ఇప్పటికి తెమిలింది."

"గొప్ప పనయింది. ఆ డాక్టరుండడు కాసేపటికి. మనిషన్న తర్వాత యింత జ్ఞానం వుండి చావాలి."

"యిదిగో మీ కొడుకు యిప్పటిదాకా నానా అరుపులూ అరిచి వెళ్ళాడు. మీ పుత్రికా రత్నాలకు కూర చూడడానికి చదువులు అడ్డం వస్తాయి."

"ఏడిశావులే-చెప్పే విధానం తెల్సి చస్తేకదా? అయినా కన్నావు అలాంటి మొహాల్ని, యింకా సిగ్గులేక ఎందుకేడుపు—"

"యిప్పుడు హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళనా?"

"యింకేం తీసుకు వెళ్తావు? తొమ్మిద వస్తోంది టైం. నాకు అన్నం పెట్టెయ్." వంటింట్లో మళ్ళీ చప్పుడు.

"అయినా ఒకర్నని ఏం లాభం? నా ఖర్మ—కూర మాడి చచ్చింది. అన్నం ముద్ద. కొంపకాదిది. శ్మశానం." కంచం చప్పుడు.

ప్రకాశంకి తలపోటు ఎక్కువ అవుతోంది. యింకా యింట్లో ఏమేం చప్పుళ్లూ గొణుక్కోవడాలూ వినాలో అతనికి తెలియ రావడం లేదు. కాసేపటికి యింట్లో కరెంటు పోయింది.

*　　*　　*

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

ప్రకాశంకి దాహంగా వుంది. నిద్ర ఒక్కరవ తేలింది. యింట్లో చీకటి. లైట్లు రాలేదు.

ప్రకాశం అటుప్రక్కకి తిరిగి చూశాడు. గదంతా ఖాళీ—అమ్మ మాత్రం నేలమీద చాపపర్చుకొని పడుకొని వుంది. శశీ, రాధా వాళ్ళంతా యింకో గదిలో మంచాల మీద పడుకొంటారు. లాంతరు చీకటిని పారద్రోల లేకపోయినా గుడ్డి వెల్తుర్ని మాత్రం యిస్తోంది. ప్రకాశంకి చిన్నగా మూల్గు వినబడుతోంది.

"అమ్మా—"

అమ్మ ఉలిక్కిపడింది. లేచింది.

"మంచినీళ్ళమ్మా—"అమ్మ కంట్లో నీళ్ళు ప్రకాశంకి లాంతరు వెలుగులో కూడా కనబడ్డాయి.

అమ్మ నీళ్ళు తెచ్చింది.

"అన్నయ్యింకా రాలేదామ్మా?"

"లేదురా...."

అమ్మ గొంతు తడిగావుంది.

అమ్మను చూస్తుంటే ప్రకాశానికి ఏడుపు వస్తోంది. అమ్మ. అవును, అమ్మే. యీ ప్రపంచంలో ఎవరికీ పనికిరాని వస్తువు! అమ్మ. అమ్మ చెప్పిన పని అక్కయ్యలు చెయ్యరు. వాళ్ళకి రావ్‌గారి భార్య మీద ఎంతయినా సానుభూతి వుంటుందిగాని అమ్మ గుర్తు రాదు.

అన్నయ్య సినిమాల్లాంటి చిన్నవాటికి హైరాన పడతాడుగాని యింత యింటిని నెట్టుకు రావడానికి అమ్మకి హైరాన వుండ కూడదు.

"ఇప్పటిదాకా తల నొక్కుతూనే వున్నాను. మూల్గుతున్నావు."

అక్కయ్యనీ, అన్నయ్యనీ కన్నందుకు అమ్మ మాత్రం సిగ్గుపడాలి. నాన్నకి వాటాలేదు. మరి తను? తను మాత్రం అమ్మ గురించి ఎప్పుడు ఆలోచించాడు? యివాళ జ్వరం వచ్చి....

"అమ్మా నాకు ఏడుపు వస్తోందే—"

"కళ్ళు మూసుకొని పడుకో - నిద్ర వస్తుంది" అమ్మ తల నొక్కుతూ అంది.

ప్రకాశంకి ఏడ్పువస్తోంది.

———



# పల్లెటి మనిషి

సుచరిత



"ఇవాళ నా బర్త్‌డే!" అంది పార్వతి.

"ఓహో! ఇవాళే కళ్ళు తెరిచిన పాపాయి వన్న మాట," పరిహాసంగా అన్నాడు గిరీశం ఆఫీసుకు వెళ్ళడానికి తయారవుతూ.

అతను బూట్లు వేసు కుంటూంటే, "సాయంకాలం త్వరగారండి. వస్తారు గదూ" అనీ—

అతను సైకిల్ తీస్తుంటే, "వస్తూ మల్లెపూలు తెండి," అనీ.

అతను గుమ్మంలోకి పోగానే, "మల్లెపూలు మర్చిపోకండి," అనీ గట్టిగా చెప్పి లోపలికి వచ్చి తలుపులు వేసుకుంది పార్వతి.

వంటిల్లు గందరగోళంగా, ఎంగిలి కంచాలతో, గరిటలతో, గిన్నెలతో, పార్లమెంటులా వుంది.

"మనిషియిల్లు కదిలేదాకా ఒకటే హడావుడి!" అని విసుక్కుని నడుం బిగించింది పార్వతి.

మధ్యాహ్నం మూడు గంటలవరకూ కాలుకాలిన పిల్లిలా తిరిగింది పార్వతి, గది లోంచి, గదిలోకి.

గిరీశం వచ్చేది యింకో రెండు

గంటలకు.

కాఫీ కాచి ఫ్లాస్కులో పోసింది. ఉప్మా చేద్దామనుకుని, మళ్ళీ అతను వచ్చేసరికి చల్లారిపోతుందని ఆపేసింది.

ఆ రోజు పార్వతికి కలల్లో తేలిపోతున్నట్టుగా వుంది. ప్రతి వస్తువూ యెంతో కొత్తగా, యింకా అందంతో కన్పిస్తున్నాయి.

కిటికీలోంచి తొంగిచూస్తున్న పక్కింటి వాళ్ళ జాజితీగ ఆకులు ఎండకి మెరుస్తూ, నీలాకాశం ఆకులు లేకుండా విరగపూసిన మల్లెపందిరిలా, కొబ్బరిచెట్ల ఆకుల గలగలలలో కొత్త పాటలు—ఇవన్నీ తన పుట్టిన రోజుగనక యిలాగ వున్నాయా? లేక తన కళ్ళకు ఇలా కన్పిస్తున్నాయా? నవ్వుకుంది పార్వతి.

ఎంతోమందిలాగే, పార్వతికి పుట్టిన రోజు చాలా....చాలాప్రీతి పాత్రమయింది. సంవత్సరానికి ఒక్కసారి వచ్చే రోజు! ఆ రోజు తాలూకు ఛాయలు మిగతా సంవత్సరం అంతా గుర్తు పెట్టుకోవాల్సినరోజు! పెళ్ళయ్యాక తన స్వంత యింట్లో వచ్చిన మొదటి పుట్టిన రోజు!

పార్వతి లేచి అద్దం ముందు కూర్చుని జుట్టు విప్పుకుంది.

తలంటి పోసుకోవటాన కాబోలు, జుట్టుమరీ వత్తుగా, యింకా తళతళ నొక్కులతో వీపంతా ఆక్రమించుకుంది.

"ఇవాళ రెండు జడలు వేసుకోవాలి." అనుకుంటూ జుట్టు రెండు భాగాలుగా చేసి, ఒక చేత్తో పట్టుకుని, అపురూపంగా చిక్కు తియ్యటం ప్రారంభించింది.

జుట్టు రెండు జడలుగా అల్లుకుంది, వొదులుగా.

రేపు తెల్లారేసరికి జుట్టంతా వ్యాపిస్తుంది మల్లెల పరిమళం. రెండు జడలకీ కలిపి పెట్టుకుంటే బాగుంటుందా, లేక ఒక జడలోనే బాగుంటుందా, అని కాసేపు ఆలోచించి, ఎటూ తోచక, చివరకి, "తర్వాత చూద్దాంలే," అని వూరుకుంది.

పార్వతికి మల్లెపూలంటే ప్రాణం. శలవులకు ఇంటికి వెళ్తే, తండ్రి ప్రతి రోజూ పట్నం నుంచి అయినా పువ్వులు తెప్పించేవాడు.

పార్వతి ఒక్కోరోజు తమ యింట్లో పూసే చామంతులు కరణం గారింట్లో ఇచ్చి వారింటి నుంచి మల్లెలు తెచ్చుకునేది.

వేసంకాలం వచ్చిందంటే మల్లెలు, మల్లెలు! ఎక్కడ చూసినా అవే! మల్లెల పరిమళం ఎంత మధురంగా వుంటుంది!

పెళ్ళయ్యాక పార్వతి వుత్సాహం సగం చచ్చిపోయింది. పువ్వుల కోసం తపించిపోయేది, అయినా.

ఓసారి గిరీశం "ఏమిటా తలనిండా పూలు అమ్మవారిలాగా!" అని విసుక్కున్నాడు.

పార్వతికి అంతవరకు మల్లెపూలు యిష్టపడని మనుషులు వుంటారని తెలీదు. గిరీశం వంక ఆశ్చర్యంగా చూసింది.

అప్పుడేకాదు పువ్వులు పెట్టుకున్నప్పు




డల్లా గిరీశం అలాగే మాటలు విసిరేవాడు.

రానురానూ పార్వతి మనసే మారిందో లేక గిరీశం మాటలకు విరక్తే పుట్టిందో గాని, పూలంటే మోజుపోయింది. ఇదిగో, మళ్ళీ యీ రోజు!

పార్వతి కేశాలంకరణా, ముఖాలంకరణా పూర్తి చేసి, పెట్టె తెరిచింది.

ఓ అరగంట ఏ చీరా నచ్చక చివరికి తనకి ఇష్టమూ, గిరీశానికి అయిష్టమూ అయిన ఎర్రని అంచుతో ఎర్రచుక్కలున్న తెల్లచీర కట్టుకుంది. ఎర్ర జరీ జాకెట్ వేసుకుంది. రెండు చేతులకీ బంగారు గాజుల మధ్య ఎర్రని గాజులు వేసుకుంది.

కాలేజ్ స్టూడెంట్స్ మాసిపోయిన అలంకరణలతో ఇంటిదారి పట్టేవేళ, జంటలు చిరునవ్వులు మార్చుకుంటూ షైర్లకు వెళ్ళేవేళ, ఆకాశం పడమటన నవవధువులా సిగ్గులు చిమ్మే వేళ....

పారిజాతంలాగా తయారయి పార్వతి భర్త కోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చుంది. చీకట్లు ముసరబోతూంటే, గిరీశం యీసురోమంటూ కొంప చేరాడు. పార్వతి కళ్ళు ఆతృతగా గిరీశం చేతుల్నీ, జేబుల్నీ తడిమాయి.

"ఏమిటి కథ? అప్పుడే ముస్తాబు అయ్యావు ఈ రోజు?" గిరీశం సైకిల్ స్టాండు వేస్తూ.

పార్వతి మనస్సు చివుక్కుమంది.

తన పుట్టిన రోజన్న సంగతే గుర్తులేని వ్యక్తికి ఇంకా తను చెప్పిన పువ్వుల

సంగతేం గుర్తు వుంటుంది! అతనికితను తనగురించిన సంగతులూ అంత ప్రాధాన్యం లేనివన్నమాట!

పార్వతి మనసు విప్పి మాట్లాడలేక పోయింది తర్వాత.

స్నానం చివర తువ్వాలు అందిస్తున్నప్పుడూ, టిఫిన్ ప్లేట్ ఇస్తున్నప్పుడూ, ఇద్దరూకల్సి అన్నాలకు కూర్చున్నప్పుడూ గిరీశం చేయబోయిన సరసాలు పార్వతి పెదవుల మీదికి నవ్వు తెప్పించలేక పోయాయి.

యాంత్రికంగా పనులు ముగించుకుని వచ్చేసరికి గిరీశం ఆదమర్చి నిద్రపోతున్నాడు.

పార్వతికి గిరీశం మీద, పెళ్ళయ్యాక మొదటిసారిగా, అంతులేని ఏవగింపు కలిగింది. ఛీ, ఏం మనిషి! భార్య కోరక, కోరక ఓ కోరిక కోరితే, అది తీర్చాలన్న ఆసక్తే అతనికి లేదు. పూలు తేకపోయినా, అందుకు కారణం అయినా చెప్పితే అది వేరే సంగతి!

పార్వతికి ఎన్నడూ ఎరగనంత అసంతృప్తితో మనసంతా వికలం అయిపోయింది.

పుట్టిన రోజూ........పార్టీ....స్నేహితులూ....

అనుకున్నవేవీ జరగలేదు. పుట్టినరోజు అన్న ప్రత్యేకతా, జ్ఞాపకం పెట్టుకోదగ్గ సంఘటనా, ఒక్కటీ జరగలేదు. ఈ రోజూ....రోజూ లాగే అతి మామూలుగా గడిచిపోయింది

పార్వతి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

అద్దంలో రెండుజడలు రెండుపాముల్లా కనిపించాయి. చిరాగ్గా రెండూ కలిపి ముడి వేసేసింది.

కుర్చీ కిటికీ దగ్గరగా లాక్కుని కూర్చుంది.

పక్కవాళ్ళ జాజితీగ సువాసనలు వెదజల్లుతోంది.

పార్వతి భర్తతో ఎన్నోసార్లు ఓ 'నైట్‌క్వీన్' మొక్క పెంచుదామని చెప్పి ముచ్చట పడింది.

కానీ అతను తేలిగ్గా, "ఛ, ఎందుకు? పాములు ఒక్కటే తక్కువ అయ్యాయా ఇప్పుడు? పైగా మనం ఇక్కడ శాశ్వతంగా వుండేవాళ్ళం కాదుగా!" అని కొట్టి పారేశాడు.

పార్వతి పేలవంగా నవ్వుకుంది. పువ్వుల పరిమళానికి ఎంతో క్రూరజంతువులు సయితం వస్తాయిగానీ, మనుషుల్లోనే కొన్ని రకాల వాళ్ళు ఏవగించుకుంటారు, ఎంత చిత్రం!

ఈ విషయంలోనే కాదు, ఇలాంటివే ఇంకెన్నో అన్నీ ఒక్కసారిగా తేల్చుకోవాలన్న తపన పట్టుకుంది పార్వతికి ఈనాడు.

పార్వతికి సంగీతం అంటే ప్రాణం.

ఎప్పుడయినా కచ్చేరీలు జరుగుతున్నాయని తెలిస్తే, వెళ్ళాలని ఎంతో పులాటపడుతుంది.

కానీ గిరీశం సంగీతం విషయంలో




ఔరంగజేబు దగ్గరి చుట్టం. 'న్న ....నన్నా' అంటూ తలలూపుకుంటూ వాళ్ళు వేసే సంగతులు చూస్తే అతనికి వొళ్ళు కంపరం ఎత్తుతుంది. శాసనాలు చెయ్యటం అతని చేతిలో వుంటేనా.... సంగీత విద్వాంసుల్ని సమాధి చెయ్యమనే వాడు ఖచ్చితంగా.

పార్వతి వంటింట్లో పని చేసుకుంటూ, రేడియో పెట్టుకుని బిస్మిల్లా షహనాయ్ వింటూంటే అతను చటుక్కున బేండు మార్చేసి, ఏ సిలోనో పెట్టే స్తాడు. పార్వతి ప్రాణం కొట్టుకు పోతుంది అలాంటప్పుడు. గిరీశం కలాంటివి ఇష్టం లేవు సరిగదా, ఇంకోళ్ళు ఇష్టపడ్డా భరించ లేడు.

భార్య తనకు అనుగుణంగా మారాలను కునేటప్పుడు, తను మాత్రం చిన్న విష యాల్లోగూడా భార్యతో సహకరించకూడదు! ఏం న్యాయం? సంసారం స్వర్గతుల్యం కావాలంటే అది కేవలం స్త్రీమీదే ఆధారపడి లేదు. పురుషుడు కూడా అందుకు చేయూత నీయాలి.

వీధిలో ఘూర్కా తలుపుమీద 'టక్-టక్' మని చప్పుడు చేస్తున్నాడు. కుక్క అరిచి పూరుకుంది.

"నే వెళ్తున్నా, తలుపేసుకో." నైట్

డ్యూటీల కెళ్ళే ఎదురింటి వుద్యోగి అంటు న్నాడు.

పార్వతి మనసు ఆవేశంతో బుసలు కొడుతోంది.

గిరీశానికి, యింటిలోకి సరకులు తేవా లంటే విసుగు. డబ్బు ఖర్చవుతుందని కాదు, వెళ్ళి తేవటం బద్ధకం.

కొత్తల్లో తననే వెళ్ళి తెచ్చుకోమనే వాడు.

ఆ విషయంలో మాత్రం తను ససేమిరా వొప్పుకోలేదు. వీధిలో కెళ్లాలంటే సిగ్గూ, అలవాటులేని భయం!

గిరీశం కోపంగా విసుక్కునేవాడు. "మహాఘోషా స్త్రీ బయల్దేరింది! ఇదేం మీ పల్లెటూరుకాదు అంతా మొహాలు వేల్లాడేసుకుని నిన్నే దేబిరించడానికి!సరుకులు తెచ్చుకుంటే ఏమిటి నామోషీ?"

"నాకు అలవాటులేదు, బాబు!" అనేది తను.

"అలవాటా, వంకాయా?ఇదే ఫారిన్‌లో అయితేనా...."

"పోనీలెండి. అందుకే నేను భారత దేశంలో పుట్టాను, గాబోలు." తను అంతటితో ఆపేసేది ఆ సంభాషణ.

భార్యా, భర్తా అన్నాక ఒకళ్ళకు అనుగుణంగా ఒకళ్ళు అభిప్రాయాలూ, అలవాట్లూ మార్చుకుని, సహృదయంతో రెండోవాళ్ళ అభిరుచుల్ని గౌరవిస్తే, అది బానిసత్వమా?

మనకు నచ్చనివి యీ ప్రపంచంలో ఇంకెవరికీ నచ్చవనుకోవటం ఎంత సంకుచితం! ఎంత నిరంకుశం!

పెళ్ళి అనేది స్త్రీ వ్యక్తిత్వాన్ని పోగొట్టేదీ, ఆడదాని జీవితం అరిటాకు మీది ముల్లు సామెతగా మార్చేదీ అయితే, యీ వివాహాలూ, ఈ తంతూ అంతా ఎందుకు?

అప్పటికీ, పార్వతి ఎన్నో విషయాల్లో రాజీపడుతుంది. కాని మనసు వుందే, అది కోతి! ఎంత సమాధాన పరిచినా ఎదురు తిరుగుతూ వుంటుంది ఒక్కోసారి.

పెళ్ళయిన కొత్తల్లో శ్రావణ మాసం నోములు పుట్టింటి దగ్గర అక్కయ్యల్తో పాటు నోచుకోవాలని ఎంతో వుబలాట పడింది పార్వతి.

తండ్రి పంపించమని రాస్తే గిరీశం చిరాగ్గా, 'నోములూ, వ్రతాలూ—యివన్నీ అర్థంలేని మాటలు! మొగాడి దుంప తెంచడానికి చేసే పనులు,' అంటూ పార్వతి యిష్టాన్ని తీసిపారేశాడు.

సహించి వూరుకుంది పార్వతి, మనసుని అణగదొక్కి. పెళ్ళయిన కొత్త! అతని దగ్గర అంతగా చనువులేదు, అప్పుడు. అయినా, చీటికీ మాటికీ పోట్లాటలంటే పార్వతికి అసహ్యం. నోములు నోచుకోవాలనీ,పుట్టిళ్ళ దగ్గర సరదాగా గడపాలనీ ఏ స్త్రీకి వుండదు?

"పడుకో. నిద్రరావటంలా?" వెనగ్గా గిరీశం నిద్రగొంతు మత్తుగా విన్పించింది పార్వతికి.

వెనక్కి తిరిగి చూసింది.

గిరీశం బద్ధకంగా మంచం మీద అటు దొర్లాడు.

పార్వతి తల తిప్పుకుంది విసురుగా.

వెన్నెల పొడ గదిలో వాలుగా పడింది.

ఆకాశంలో నక్షత్రాలు చేపపిల్లల్లా మిణుకు మిణుకు మంటున్నాయి. వెన్నెల రోజులు కావటం వల్లనేమో, ఎక్కడో దూరాన ఓ కాకి తెల్లవారిందని భ్రమపడి అరుస్తోంది.

గిరీశం గురక విన్పించింది వెనక నుంచి.

గుండెలో ఏదో మంట! ఆవేదన!

ప్రతి విషయంలోనూ తనే సర్దుకు పోవాలి, ఆడదిగా పుట్టిందిగాబట్టి. పెళ్ళ య్యాక తను ఎన్ని విషయాల్లో తనకెంతో అయిష్టమయినవీ, అసహ్యమయినవీ అల వాటు చేసుకోలేదూ!

అన్నం తినేటప్పుడు చేతులూ, వేళ్ళూ నాకే వాళ్ళని చూస్తే తనకి పరమ రోత. కానీ క్రమంగా అలవాటు కాలేదూ? తనేనా డయినా, "ఎందుకలా నాకుతారు?" అందా? —అంటే వూరుకుంటాడా?

తనకు తీపిఇష్టం. ఇక్కడికొచ్చాక చచ్చి నట్టు అతనికోసం కారాలు అలవాటు చేసు కుంది. కాని అది అతను గ్రహించడు. ఇద్దరు విభిన్న మనస్తత్వాలు కలిగిన వ్యక్తుల సంసారాలు అన్నీ నరకాల్లాగే తయారవుతున్నాయా?

లేక అసంతృప్తి అంతా తనలోనే వుందా?

నిట్టూర్చింది పార్వతి.

ఇంకా ఏం సర్దుకు పోవాలి! ఎంతని సర్దుకుపోవాలి? తననో జడపదార్థంగా కాకుండా, తనలో యింత అశాంతినీ, ఆలోచనల్నీ పెట్టిన ఆ దేవుడిదే యీ తప్పంతా!

తను ఎంతమాత్రమూ సహించలేని, తలుచుకుంటేనే అసహ్యం పుట్టించే విష యాల్లో యింకోటి, గిరీశం కన్పించిన, మార్కెట్లోకి వచ్చిన ప్రతి సెక్స్ పుస్త కమూ ఎంతో ఆసక్తిగా, యిష్టంగా తెచ్చు కుని చదవటం!

తను ఎన్నోసార్లు చెప్పింది, చదివితే చదివారుగానీ యింటికి మాత్రం తీసుకు రావద్దని.

ఓసారి చుట్టం చూపుగా అక్కయ్య వచ్చింది.

అక్కయ్య కొడుకు బాబిగాడో పిడుగు. ఇల్లంతా చుట్టబెట్టేశాడు. గిరీశం పరుపు కింద వున్న ఓ పుస్తకం తెచ్చి యిద్దరూ మాటాడుకుంటూంటే మధ్యలో పడేశాడు.

తన ప్రాణం సిగ్గుతో చచ్చిపోయింది. అక్కయ్య వెళ్ళేవరకూ కళ్ళెత్తి సూటిగా చూస్తూ మాట్లాడలేక పోయింది.

తను రామాయణ భారతాలు చదువు తుందని అతనికి హేళన. వెక్కిరింత!

అందులో అంత హాస్యం చెయ్యవల్సిం దేమిటో తనకి అర్థంకాదు.

చదువుకున్న వాళ్ళూ, పట్నవాసులూ పురాణ గ్రంథాలు చదవకూడదని రూలే మయినా వుందా?

రాముడు-దేవుడు; కృష్ణుడు- అవతార పురుషుడు అనే అభిప్రాయంతో కాక పోయినా, అంతటి మహాగ్రంథాలు ఆ నాటి దేశ కాలపరిస్థితులు తెల్సుకోడాని కయినా, సాహిత్యం కోసమయినా చదవచ్చే!

క్షణికమయిన వేడి తప్ప, అటువంటి చచ్చు పుస్తకాలు చదువుతుంటే కలిగే ఆనందం ఏమిటో తన కర్థంకాదు.

స్త్రీని కేవలం ఓ విలాస వస్తువుగా, పీచుమిఠాయి లాగా అనిపింప చేసే ఆ బొమ్మలూ-ఆ రాతలూ....ఛీ....ఛీ........ చూస్తేనే కడుపునిండిపోతుంది చాలు.

అతని అభిరుచులు వేరయితే అవు తాయి. అందులో వింత ఏమీలేదు. ఏ ఇద్దరి అభిప్రాయాలూ కలవాలని ఏమీలేదు. కాని బాధఏమిటంటే అతను, తన సిద్ధాంతాలనీ, అలవాట్లనీ యితర్ల మీద రుద్దుతాడు. అతనికి ఇష్టం అయినవి అందరికీ ఇష్టమూ, అతనికి నచ్చనివి ఎవ్వరికీ నచ్చకూడదనీ అంటాడు. తన వ్యక్తిత్వాన్నే కొలత బద్దగా తీసు కుంటాడు.

బాలసరస్వతి పాటలూ, బిస్మిల్లాఖాన్ షహనాయ్ తనకు యిష్టం,కాదనేఅధికారం ఎవరికుంది, ఎంత మొగుడయితే మాత్రం?

తెల్ల చీరలు తను కట్టుకుంటుంది,అంత మాత్రంచేత భోగం దయిపోయి నట్టేనా?

ఆనందం వస్తే తను కూనిరాగాలు తీసుకుంటుంది. లల్లాయి పదాలు పాడుకో డానికి అంతా సుప్రయాలూ, లతామంగే ష్కర్లూ కానక్కర్లేదుగా?

సుబ్బలక్ష్మి సంగీతం నచ్చకపోతే వినటం మానెయ్యాలి. అంతేగానీ అందులో మాధుర్యమే లేదంటే ఎట్లా?

పార్వతి మనసు అంతా జుగుప్సలాంటి భావం చుట్టేసింది. తన కెంతో అవమానం జరిగినట్టూ, తన జీవితమంతా వ్యర్థమయి పోయినట్టూ!

తను ఎదిర్చి పోట్లాడలేదూ? పోట్లాడ గలదు.

కానీ అందువల్ల ఒరిగేదేమిటి? ఛీ ఛీ- ఛీఛీ అనుకుంటూ వీధిన పడితే సున్నిత మయిన అనుబంధాలు తెగటం తప్ప!

అధికారాలూ - ఆధిపత్యాలూ మొగాడికి కొత్తేంకావు!

అణిగి వుండటాలూ-కూపస్థమండూకం లాంటి మన స్తత్వమూ ఆడదానికేం కొత్త కాదు!

తనకు మిగిలేది యీ సంఘర్షణే.

రేపట్నుంచీ అంతా మళ్ళీ మామూలే!

"నేనో జడపదార్థాన్ని అయితే....!" పార్వతి ఆలోచనల్తో అలిసి, అలాగే కిటికీ గూట్లో తలవాల్చి...బరువుగాకళ్ళు వాల్చి... నిద్రపోయింది.




ఆఫీసు పని మీద కలకత్తాకి వెళ్ళినపుడల్లా అలీపూర్‌కి వెళ్ళి, సుందరం, లలితలని చూసి రావడం నాకు అలవాటు. నాకు లలితని చిన్నప్పటినుంచీ తెలుసు. లలిత చాలా అందమైనదని చెప్పడానికి లేదు. కానీ, ఆకర్షణ ఉంది. మా తాతగారింటి ప్రక్కనే ఉండేవాళ్లు లలితావాళ్లూ. సెలవులకి వెళ్ళినపుడల్లా చూసేవాడిని. చిన్నతనంలో పొట్టిగా పరికిణీ వేసుకునేది. మరీ సన్నం కాదు. మరీ లావూ కాదు. కళ్ళల్లో మాత్రం ఒక మెరుపు, బారెడు జడ. జడ గంటలు పెట్టుకుని జడ వేసుకునేది. తాతగారింటికి వచ్చి మావయ్యతో బాటే తిరిగేది. అత్త ఎప్పుడూ లలితని వేళాకోళం చేసేది; “ఏవేఁ లలితా! మాకు నీ పప్పన్నం ఎప్పుడు పెట్టిస్తావు?” అని. లలిత ఏం మాట్లాడేది కాదు. కానీ ఆ కళ్ళలో మాత్రం, “ఎప్పుడో నిజంగా పెళ్లికి పిల్చి, ఇదుగో నీకు పప్పన్నం అంటాలే,” అన్న భావం తళుక్కుమనేది.

నేను బియెస్సీ పరీక్షలు వ్రాసి, వేసంగి సెలవులకి వెళ్ళినపుడు లలిత స్కూలు ఫైనలు పరీక్ష యిచ్చింది. చిన్నప్పటిలాగే ఉండింది. మరీ ఒళ్లూగాక, మరీసన్నం గాక సమానంగా వుంది. నడుము బాగా చిన్నది. చీర చక్కగా కట్టుకుంటే ఇంకా

అందంగా కన్పడేది. చిన్నప్పటిలాగే, అప్పుడూ తాతగారింటికి వచ్చేసి రోజంతా గడిపేది. అప్పటిలాగే మాట్లాడకుండా కూర్చునేది. అప్పుడే మా అత్తకి వేలు విడిచిన పినతల్లి కూతురూ, ఆవిడ కొడుకు సుందరం ఆ వూరుకి వచ్చారు. వాడు మంచి అందగాడు. మంచి ఎత్తరి. ప్యాంటు వేసుకుని, షర్టు లోపలకి టక్ చేసుకుంటే మరీ అందంగా కన్పడేవాడు.

సుందరం కలకత్తాలో చదువుకునే వాడు. వాళ్ళనాన్న అక్కడ ఒక కంపెనీలో డైరెక్టరుగా ఉండేవారు. వాళ్ళూ మాలాంటి మధ్య తరగతి కుటుంబీకులే గానీ, అతను పనిచేస్తున్న కంపెనీలో దొర గారికి అతనంటే విపరీతమైన అభిమానం కొద్దీ, ఇంగ్లండు కెళ్ళిపోతూ, అతని పేర నున్న షేర్లన్నీ ఇతని కిచ్చేసి వెళ్లిపో యారు. దాంతో అదృష్టదేవత వీళ్ళని వరించింది.

సుందరం నేనూ కలిసి లలితతో పేకాట వేసేవారం. సుందరం ఎప్పుడూ పరధ్యా నంగా ఉంటూ, ఆటలో ఓడేవాడు. లలిత నిదానంగా శ్రద్ధగా ఆడి, ఎప్పుడూ గెలిచేది.

సుందరం తల్లికి లలితని చూడగానే నచ్చింది. సుందరం తండ్రికి టెలిగ్రాము ఇప్పించి, రప్పించింది. లలితని తన కోడలు చేసుకోవా లనుకుంటున్నానంది. నేను సుందరాన్ని కదిపాను. సుందరం, లలితంటే ఇష్టమేగాని, తానా పెళ్ళిచేసుకో నన్నాడు. నాన్నమ్మకి ఒంట్లో బాగా లేదని టెలిగ్రాము రావడంతో నే వెళ్ళిపోయాను. నాన్నమ్మ పోవడంతో ఇంటి నిండా చుట్టాలు అదీనూ. మావయ్య పదోరోజుకి వచ్చి వెళ్లిపోయాడు.

ఒక నెలరోజులు అయ్యాక ఇంట్లో సందడి తగ్గింది. ఒక రోజు నాన్నగదిలోకి వెళ్ళాను. బల్లమీది ఉత్తరాలలో పెళ్లి శుభలేఖ చూసి, తీసి చదివాను. సుందరం లలితలకి పెళ్లి. అమ్మే చెప్పింది. సుందరం మరెవ్వరినో చేసుకోవాలనుకున్నాడుట, కానీ తల్లిదండ్రులు ఆ పెళ్లికి అభ్యంతరం చెప్పినందు వలన, వారిని ఎదురించడ మెందుకు అని, తల్లిదండ్రులు చెప్పినట్లే లలితని చేసుకోవడానికి ఒప్పుకున్నాడుట. సుందరం అసలు బంగారు పిచ్చుక. తల్లి దండ్రుల నెదురించి కష్టమైన బ్రతుకుని ఏరుకోక, తన బంగారు పంజరమే తనకి మంచిదనుకున్నాడులా వుంది. నేను ఎమ్మెస్సీ చదువుతుంటే, లలితా సుందరం అమెరికాకి వెళ్ళారని తెలిసింది.

నా డాక్టరేటు అయ్యాక, నేను ఒక ప్రైవేటు కంపెనీలో చేరాను. ఆఫీసు పని మీదే కలకత్తాకి వెళ్ళాను. ఆ రోజు ఫిర్పోస్‌లో పార్టీ. నేను వెళ్లాక అక్కడున్న అందరినీ పరిచయం చేశారు కలకత్తా బ్రాంచి మేనేజరు. అక్కడున్న వారిలో సుందరం కూడా ఒకడు. దగ్గరసా వచ్చి, "ఇంటికి రావాలి" అని చెప్పి బలవంతం చేశాడు. ఆ తర్వాత మళ్లీ వ్యాపార విష యాలలో మునిగిపోయాం. ఆరోజు పార్టీ





– ఆయన ఇన్విజిలేటరు–
పరీక్షా హాలుకు
వెడుతున్నట్టున్నారు !!

అయేసరికి గంట పన్నెండయింది. ఇంక అప్పుడు వెళ్లితే బాగుండదని, ఎడ్రసు మాత్రం తీసుకుని హోటలుకి వెళ్లి పోయాను.

మర్నాడు ఆదివారం. సాయంత్రం నిద్రలేచాక స్నానం చేశాను. మనవాళ్లింటికే గదా అని, సూటు వేసుకోకుండా, గ్రే ఫులెన్‌పాంటూ, తెల్లషర్టూ వేసుకుని, పైన ఎఱ్ఱస్వెట్టరు వేసుకున్నాను. హోటలు బయట వుండే టాక్సీ ఎక్కి, "ఆలీపూర్ చలో" అన్నాను. ఆలీపూర్‌లో వాళ్ల యిల్లు కనుక్కోవడానికి అట్టే శ్రమపడ లేదు. వెళ్ళి బజ్జర్ నొక్కాను. డ్రాయింగురూము తలుపులు తెరిచినది లలిత. ఒక్క క్షణం ఆగి, లలితని పైనించి క్రిందకి చూసి, లోపలికి వెళ్ళాను. లోపల వేరే ఎవరో యిద్దరు అతిథులున్నారు. సుందరం లేచి వచ్చి నన్ను అతిథులకి పరిచయం చేశాడు.

లలితని చూసిన నాకు ఆశ్చర్యంవేసింది. పదేళ్ల క్రితం ఎలాగుందో అలాగే ఉంది. రాగాపోగా వేషంలోనే మార్పు. జడ గంటలూ, పొడుగు జడగాక, అంత జుట్టునీ పెద్ద ముడి చుట్టుకుంది. వెంకటగిరి జరీ చీర ఎఱ్ఱటి ఎరుపుది, దానికి ఎఱ్ఱటి జాకెట్టు, చేతులకి ఎఱ్ఱ రాళ్ళ గాజులు, చెవులకి ఎఱ్ఱటి దుద్దులు, మెడలో కెంపుల అడ్డిగ—చూడ

గానే ఆంధ్రవనిత అనిచెపుతూనే వున్నాయి. వచ్చిన వాళ్ళిద్దరినీ అడుగుతోంది, ఏమైనా త్రాగడానికి కావాలా అని. సుందరం కొంచెం విస్కీ పట్టుకురమ్మన్నాడు. నాకేసి లలిత చూసింది, త్రాగే అలవాటుందా అన్నట్లు. నేను, "మా వూళ్లో అయితే ప్రభుత్వం నిషేధించింది గానీ, ఇలాంటి వూరులో అభ్యంతరంలేదు," అన్నాను.

అందరికీ తెచ్చి యిచ్చింది. తను మాత్రం నిమ్మపండు రసం తెచ్చుకుని, నా దగ్గరగా వున్న సోఫాలో కూర్చుంది. ఊరు కబుర్లు అవీ అయ్యాక, పిల్లలెంత మంది అని అడిగాను. ఒక్కడే నంది. తొమ్మిదేళ్ళట, శాంతినికేతన్‌లో చదువుతున్నాడంది. వచ్చిన వాళ్లిద్దరూ వెళ్ళిపోయాక, మేం ముగ్గురం కబుర్లు చెప్పుకున్నాం. భోజనానికి ఉండిపోయాను. గోంగూర పచ్చడి, కంది పొడుంతో మన భోజనం చేసి, హోటలు కెళ్ళి పోయాను.

లలితలో ఎంత కార్య శూరత్వం వుందన్నది నాకు బాగా అర్థం అయింది. ఎవరినో చేసుకుంటానన్న సుందరంని ఇప్పుడు లలితే లోకం అనేట్లు చేసుకుంది. ఆ సన్నటి నడుము అలాగే ఉంది. తొమ్మిదేళ్ళ కొడుకున్నట్లు లలితని చూస్తే, అన్పించదు. ఆ నాజూకు, ఇంగ్లీషులో మాట్లాడ్డం, వచ్చిన వాళ్ళని ఆదరించడం అవీ చూస్తే, ఎక్కడో కోనసీమలో పల్లెటూరి పిల్ల అని ఎవరూ అనుకోరు.

ఆ తర్వాత ఎప్పుడు కలకత్తాకి వెళ్ళినా లలితా సుందరం వాళ్ళింటికి వెళ్ళడం అలవాటయిపోయింది. వాళ్ళబ్బాయి రమేష్‌నీ చూశాను. బాగా చదువుతున్నాడు. రమేష్ పుట్టినరోజు పార్టీనాడు వాడికి పన్నెండేళ్ళు వచ్చాయి అని తెలిసి, వాడికి నేను కలం బహుమతిగా యిచ్చాను.

ఆ తర్వాత మా కంపెనీలో చాలా మార్పులు వచ్చాయి. ఉత్తరాదికి ప్రత్యేకంగా ఒక మనిషిని వేశారు. దాంతో నాకు మళ్ళీ కలకత్తాకి వెళ్ళటం పడ లేదు. ఉత్తరాలు వ్రాసి క్షేమ సమాచారాలు కనుక్కునే అలవాటు నాకు బొత్తిగాలేదు.

మా కంపెనీలో షేర్లు అమెరికన్లకీ ఉన్నాయి. ఆ అమెరికన్ డైరక్టరు ఒకాయన మనదేశంకి వచ్చారు. మద్రాసు చుట్టు ప్రక్కల ఊర్లన్నీ త్రిప్పాను. బెంగుళూరుకి వెళ్ళి వచ్చాం. పరిచయం పెరగటంతో, అతను కలకత్తాకి వెళ్లి, అక్కడ నుంచి జపాను కెళ్ళాలనుకుని కలకత్తాకి నన్నే తీసుకెళ్ళమనడంతో పదేళ్ళ తర్వాత మళ్ళీ కలకత్తాకి బయల్దేరాను. కారవిల్‌లో డండంలో దిగి, అమెరికన్ డైరక్టరుతో బాటే స్పెన్సస్‌లో దిగాను. ఆ రోజు ప్రొద్దున్న కలకత్తా బ్రాంచిలో పని చూసి, మధ్యాహ్నం దాక్షిణేశ్వర్, బేలూరు చూసి వచ్చాం. సాయంత్రం విక్టోరియా మెమోరియల్, న్యూమార్కెట్టు, బిర్లా ప్లానటోరియం చూసి, మైదాన్‌లో కాస్తసేపుండి, హోటలుకి వచ్చాం. రాత్రి పదిగంట లయింది. ఇద్దరం స్నానం ముగించుకుని,




బట్టలు మార్చుకున్నాం. అయిన ఆలస్యం అయిందని, ఇద్దరం రూములో భోజనం చేయకుండా ఫ్లోర్ షో జరిగే డైనింగు హాలులోకి వెళ్ళాం. ఆయనికి సాధారణంగా చాలా పెందరాడే తినడం అలవాటు కానీ మర్నాడు జపాను వెళ్ళదల్చుకున్నందు వలన, నాతోబాటు తిరిగి చూడగల్గినవన్నీ చూసెయ్యాలన్న తాపత్రయం కొద్దీ, భోజనం మర్చిపోయారు. నాకు కడుపులో బాగా ఖాళీగా ఉన్నందువలన హెవీగా తిన దల్చాను. ఆయన మాత్రం ఆలస్యంగా భోజనం చెయ్యడం మంచిదిగాదని వెజి టెబుల్ సెలాడ్‌కీ, పుడ్డింగ్‌కీ మాత్రం ఆర్డ రిచ్చారు. కాబరే అయి, దీపాలు వెలగ గానే, నాల్గు మూలలా పరికించి చూశాను. నా వెనుక బల్ల దగ్గర లలితా, సుందరం కన్పడ్డారు.

భోజనం అయ్యాక మా డైరక్టరు పైకి వెళ్ళగానే, నేను లలితా వాళ్ళ టేబిలు దగ్గర కెళ్ళి పలకరించాను. లలిత నవ్వింది. ఆ నవ్వులో ఏదో వెలితి-రూపులో ఏ మార్పూ లేదు. జుట్టు నెరవను కూడా లేదు. ముగ్గురం అక్కడనుంచి బయటకి వచ్చాం. పుచ్చపూవులా వెన్నెల. సుందరంకి కాస్త ఒళ్లు వచ్చింది. కాస్త ఎక్కువగా త్రాగా డులా వుంది. మత్తుగా వెళ్లి కార్లో కూర్చు న్నాడు. లలిత నన్ను చూసి, "రేపు మా యింట్లో చిన్న పార్టీ ఉంది. తప్పకుండా రావాలి" అంది. ఆ మర్నాటి మధ్యాహ్నంతో నా ఆఫీసు పని అయిపోతుంది. సరే నన్నాను.

మా డైరెక్టరుని జపాను వెళ్లే విమానం ఎక్కించాను. సాయంత్రం లలితా వాళ్ళ ఫ్లాట్‌కి వెళ్ళాను. లలిత నవ్వుతూ నన్ను

పలకరించి, లోపలికి తీసి కెళ్ళింది. బాగా అలంకరించుకుంది. నేరేడు పండు రంగు చీర నిమ్మపండు రంగు బార్డరున్న కంచి పట్టుచీర, నిమ్మపండు రంగు పొట్టి చేతుల జాకెట్టు, మెడలో నల్లపూసలు మంగళ సూత్రం మాత్రం వేసుకుంది. చెవులకి రవ్వల దుద్దులు.చేతులకి బంగారం గాజులు. ముడిమీద సన్నజాజులు. లలిత వెనకాలే సుందరం వచ్చాడు. సుందరంకి కాస్త బట్టతల, ఒళ్ళు వచ్చింది. అయినా ఆ హాండ్సమ్ సుందరంగానే వున్నాడు. ముగ్గురం సోఫాలో కూర్చుని ఉండంగా, లోపల్నుంచి రమేశు వచ్చాడు.కోనసీమలో సుందరాన్ని నేను చూసినపుడెలా ఉన్నాడో, అచ్చు అలాగే ఉన్నాడు.

"మావయ్యా నమష్కారం" అన్నాడు బెంగాలీలా స ని ష లా ఉచ్చరిస్తూను.

"అచ్చం మీ నాన్నే!" అన్నాను.

నా ప్రక్కనున్న లలిత అస్పష్టంగా, "రూపులో మాత్రమే గాదులా వుంది," అనుకుంది. సుందరం, నేనూ విన్నాం. సుందరం దోషిలా తలొంచుకున్నాడు.

లలితే మాటలు ప్రారంభించింది.

"రమేశు వాళ్ళ స్నేహితురాల్ని భోజ నానికి పిలవాలన్నాడు. ఆ పిల్లతో బాటు నిన్నూ, మాధురినీ రమ్మన్నాం" అంది.

"మాధురీ ఎవరూ?" అన్నాను.

"పూర్వం ఒకప్పుడు సినిమాల్లో ఎక్స్ ట్రాగా వేషాలు వేసేది," అంది లలిత.

సుందరం ఇబ్బందిగా కదిలాడు.

"మర్చిపోయావులా వుంది. ఈయన పెళ్ళి చేసుకుంటానని ఒంటి కాలి జపం చేసేదే, ఆ బ్యూటీ క్వీన్," అంది.

నా కాశ్చర్యం వేసింది, లలితలాంటి స్త్రీ ఇలా మాట్లాడుతోందంటేను. ఎదిగిన కొడుకు ఎదురుగా, తన భర్త ఎప్పుడో పెళ్ళాడ్దామనుకున్న మనిషి గురించి మాట్లాడుతోంది.

సుందరం నాకేసి చూసి, "లలిత కింకా జెలసీపోయినట్లు లేదు," అని రమేశుకి వినపడకుండా అంటూంటే విని లలిత నవ్వింది. ఆ నవ్వులో జెలసీ లేదు. గర్వం మాత్రమే ఉంది.

బజ్జర్ చప్పుడు విని లలిత వెళ్ళి ఆ మనిషిని తీసుకొచ్చింది. బాగా స్థూలకాయు రాలు. సుందరం కూర్చున్న దివాన్ మీదే చోటు చూపింది లలిత. ఆ వచ్చినావిడనే వింతగా చూస్తున్న నన్ను చూసి, "ఈవిడే మాధురీదేవి," అంటూ, బెంగాలీలో నన్ను ఆవిడకి పరిచయం చేసింది. కొడుకు రమేశుని చూపింది.

పౌడరు బాగా వేసుకుని, ముఖం మీద ముడతల్ని దాచుకోవాలన్న తాపత్రయంలో ఎక్కువగా మేకప్ చేసుకుంది. నెరిసిన వెంట్రుకల్ని డాచుకోవడానికి జుత్తుకి రంగు వేసుకున్నా, అడుగునించి పాపిట దగ్గర రాగిరంగులోనూ వెంట్రుకలు కన్పడు తూనే వున్నాయి. బాగా ఒళ్ళు రావడంతో ముఖంలో కన్ను ముక్కు అవీ వేరే వేరే కన్పడ్డంలేదు. పెదిమిలకి బాగా ఎట్టటి

రంగు లిప్‌స్టిక్ వేసుకుంది. ఒకసారి చూస్తే ఇంకోసారి చూడ బుద్ధి వెయ్యదు. ఆ ప్రక్కనే లలిత ముఖానికి ఒక్క పిసరు మేకప్పు లేకుండా ఇంకా నాజూకుగా ఇంకా అందంగా మెరసిపోతూంది. నాలాగే రమేషూ, సుందరం కూడా ఇద్దర్నీ మార్చి మార్చి చూడ్డం గమనించాను.

ఇంకొంచెంసేపులోను రమేషు స్నేహితురాలు మాలతి వచ్చింది. మరీ తెల్లటి తెలుపుగాదు. నలుపూగాదు. సరిక్రొత్త ఫేషన్లో ముడి వేసుకుంది. లేత గులాబీ రంగు పెదిమలకి రంగు, లేత గులాబీ షిఫాన్ చీర. అదే రంగు స్లీవ్‌లెస్ చోళీ వేసుకుంది. లోపలికి వెళ్తూంటే, వీపు కన్పడింది. వీపు మీద జాకెట్టు ఉందా లేదా అన్నట్లుంది. అంత లో బాక్. ప్రస్తుతం మాడల్‌లాగా వున్నా, ఒక పిల్లని కనే సరికి ఒక రబ్బరోలు పొత్రంలా అయిపోతుందని చూసేవారికి అన్పిస్తోంది. సభ్యత కూడా తెల్సినట్లు లేదు. పార్టీ జరుగుతున్నంతసేపు ఆమె చూపు మాధురీ త్రాగుతున్న జిన్ మీదే వుండింది. లలిత మెల్లగా ఆ పిల్ల వివరాలు కనుక్కుని కబుర్లు చెపుతోంది. ఒక్క పాట పాడమంది. ఆ పిల్ల రాదంది. రమేషు మాత్రం ఆ పిల్లనీ, మాధురినీ, తల్లినీ, తండ్రినీ మార్చి మార్చి పెద్ద పెద్ద కళ్ళతో చూస్తూన్నాడు. ఆ కళ్ళలో ఏదో తొట్రుపాటు కన్పడింది.

పార్టీ అయ్యేసరికి మాధురికి ఒంటిమీద స్పృహే లేదు. ఆడాళ్ళిద్దర్నీ డ్రాప్ చేయమంటానని లలిత డ్రైవరుని కేకేసి వాళ్ళిద్దర్నీ పంపించింది. లలిత ఇంకా బయటే వుంది.

లలిత ఈ మాధురని ఎందుకు పిల్చింది, అని నాకు అర్థంగాలేదు. నేను ఆలోచిస్తూంటే, సుందరం నాతో అన్నాడ "నేను లలితని చేసుకోవడం నా అదృష్టం! ఈ మాధురికి ఆనాటినుంచీ చెడ్డ అలవాట్లున్నాయి. అంతా నా అదృష్టం," అంటూంటే రమేషు విన్నాడు. వింటూ నిట్టూర్చాడు మెల్లగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

లలితతో చెప్పి నేనూ బయల్దేరాను.

మర్నాడు హౌరాలో మద్రాసుకి వెళ్ళే ట్రైనులో ఫస్టుక్లాసులో ఎక్కాను. ఆ కంపార్టుమెంటులోనే రమేషూ ఎక్కాడు స్టేషనుకి వచ్చిన లలితా, సుందరంలతో మాట్లాడుతూ కూర్చున్నాను. రమేషు ఇంటర్వ్యూకి అని వాల్తేరుకి వెళ్తున్నాడు.

లలిత కళ్ళలో మొన్న కనపడ్డ వెలితి లేదు. ఆ నవ్వులో గర్వం తృప్తి రెండూ వున్నాయి. సుందరం కూడా ఏదో ఆపద గట్టెక్కిన వాడిలా వున్నాడు. రమేషుకి టాటా చెప్పి, లలిత కేసి చూస్తున్న సుందరం కళ్ళల్లో గర్వం, ఆరాధనా రెండు కన్పించాయి.

ట్రైను బాగా వేగం అందుకున్నాక రమేషుని చూసాను. ఆ పిల్లాడికి నాతో ఏదో చెప్పాలని ఆత్రంగా ఉందని గ్రహించి, మెల్లగా అడిగాను. "నిన్న మీయింటికి వచ్చి నమ్మాయి శాంతినికే

పన్‌లో చదువుకుంటా?" అని, "ఉహూఁ, ఆ అమ్మాయి నాలుగో క్లాసుకంటె చదువుకోలేదు. ఆ అమ్మాని చూడగానే మొదట్లో, నే పెళ్ళి చేసుకుందా మనుకున్నాను. అమ్మతో చెప్పాను. అమ్మ ఏమీ అనలేదు. ఆ పిల్ల వివరాలడిగింది. చదువుకుందా అని అడిగింది. చదువుకోలేదన్నాను. పోనీ లలితకళలలో ఏదైనా ప్రవేశం ఉందా అని అడిగింది. అవీ తెల్సినట్లు లేదు అన్నాను. ఎవరింటి పిల్ల అని అడిగింది. చూడగానే ఏదో ఆకర్షణకల్గి ఆ పిల్లని పెళ్ళిచేసుకోమని అడుగుదాం అనుకున్నాను. అది సుందర అమ్మతో చెప్పి మరీ అడుగుదాం అని ఉద్దేశం. మాలతి ప్రస్తుతం మోడలుగా పనిచేస్తోంది. ఒక్కడే అన్న. బట్టల షాపులో గుమాస్తా.

"నాన్న మాత్రం అన్నారు. 'రేపు నువ్వు పెద్ద ఆఫీసరువి అవుతావు. ఈ పిల్లకి చదువూ, సంస్కారం లేదంటావు. డబ్బూ లేదంటావుకదా. అందం మాత్రం వుంది. అందం శాశ్వతం గాదురా.' అన్నారు.

"అమ్మ ఆ పిల్లని యింటికి తీసుకు రమ్మంది. నిన్నరాత్రి చూశారుగదా! ఆ మాధురీదేవిని చూసాక, నాన్న చెప్పిన మాటలు విన్నాక, నే చెయ్యబోయే పని సరైనది కాదేమోనని తోచింది. మాలతి మొదట బక్కగా వుండేది. అప్పుడే ఒళ్లు వచ్చింది. నన్నాకర్షించినది ఆ బాహ్య సౌందర్యమేను. అదిపోతే ఆ ఆకర్షణ నిలుస్తుందా? ఆ పిల్లకి పాశ్చాత్య నాగరికత అంటే మోజెక్కువ. మా అమ్మలాంటి స్త్రీ ఉండే యింటికి అలాంటి అమ్మాయిని తీసుకు రాకూడదని నిశ్చయించుకున్నాను,' అన్నాడు.

నా కప్పు డర్థమయింది, లలిత మాధురి నెందుకు పిల్చిందో, సుందరం మాధురిని చేసుకోవాలనుకున్న సంగతి రమేశు వింటూండగా ఎందుకు చెప్పిందో. లలితకి, రమేశు ఆ ఫ్యాషన్ మోడల్ని చేసుకోవడం ఇష్టంలేదు. అందరు తల్లుల్లా మొండిపట్టు పట్టి, ఏడ్చి మొత్తుకోక, దాన్ని కార్యరూపంలో చేసి చూపింది. సుందరం, బాహ్యసౌందర్యాని కోసరం పెళ్ళి చేసుకుందా మనుకున్న మాధురి, లలిత అదృష్టవశాత్తు స్థూలంగా అయి వికారంగా తయారయింది. మంచితనం పేరుతో మాధురిని పిల్చి, కొడుక్కి తనివ్వాలనుకున్న అడ్వయిస్‌ని నోరు విప్పకుండానే చెప్పింది. లలితని అభినందించుకుంటూ నిద్రలోకి జారిపోయాను.

ఇంటి కొచ్చాక కొన్నాళ్ళకి నా శ్రీమతి లలిత పంపిన శుభలేఖ యిచ్చింది. రమేశుకి పెళ్ళి, నా శ్రీమతి చెప్పింది. ఆ పిల్ల బాపు బొమ్మలాగా రివటలా వుంటుందిట. వీణా, చిత్రలేఖనం వచ్చునను. ఆ పిల్లదీ, మా ఆవిడదీ ఒకే ఊరు. డబ్బు ఆట్టే లేదుగానీ, సంసార పక్షమైన పిల్ల అంది. లలిత తనకి తగ్గ కోడల్నే తెచ్చుకుంటోందన్న మాట అనుకున్నాను.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

**వేం** బండి దగ్గరకి నడుస్తుండగా వీరాయి అన్నాడు.

"సత్తెమ్మ కూకుంది దొరా. బందరు నుంచి కూతురని తీసుకొస్తోంది."

అప్పటికే చెట్ల నీడల్లోంచి చంకన మూటతో నడినెత్తి మీదకి కొప్పుతో-ఒక మానవాకారం నడిచి మా ముందుకు వస్తోంది.

"ఏం సత్తెమ్మా. లక్ష్మిని అప్పుడే స్పిటల్ నుంచి తీసుకు వచ్చేస్తున్నావా? బాగా కోలుకుందా?" పలకరింపుగా అడిగాడు కృష్ణ.

"ఏం సెయ్యను దొరా. ఇంటికాడ పిల్లలు ఒక్కళ్లయిపోయినారు. అక్కడేమో అది వక్కత్తి వుండలేనని ఏడుస్తోంది. డాక్టరుబాబుని అడిగితే పల్లేదు తీసుకుపో అని మందులు రాసిచ్చారు."

"ఏది? లక్ష్మి ఎక్కడ?" కృష్ణ వెనక్కి తిరిగి నీడలుగావున్నవైపు చూసాడు.

"అదుగో అక్కడుంది."

"తీసుకురా. పొద్దుపోయేవరకూ యీ చలిలో కూర్చోపెట్టావా? ఆగు. వుండు బండీ అక్కడికే వస్తుంది. వీరాయి! లక్ష్మిని ఎక్కించుకురా." అన్నాడు.

బండికి కట్టిన ఎడ్లు అతన్ని వాసన చూస్తున్నట్లుగా మోరలు ముందుకు చాచినాయి.

కృష్ణ అరచేత్తో వాటి వీపుమీద పరిచి నిమిరాడు.

నాకెందుకో అతనలా నిమరటంచూస్తే

దగ్గరకు వచ్చిన చిన్న పిల్లలని పలకరించి వెన్ను తడిమినట్టుగా అనిపించింది.

"ఎందుకులే దొరా. మళ్ళీ బండి తిప్పాలి. యిక్కడికి తీసుకువస్తాను." అంటూ వెళ్ళింది సత్తెమ్మ.

చెట్లనీడల్లోంచి సత్తెమ్మ భుజంమీద తల ఆనించి, అతినీరసంగా, వాడిన పువ్వులా వేళ్ళాడిపోతూ, అడుగుతీసి అడుగు వేయలేనంత నీరసంగానున్న ఒకమ్మాయి మెల్లగా మా ముందుకు వచ్చింది.

వీరాయి బండికి కట్టిన ఎడ్లు విప్పి కాడి ఎత్తాడు.

బండీ చివరిభాగం కిందకువాలి, ముందు భాగం పైకి లేచింది.

సత్తెమ్మ జాగ్రత్తగా కూతురిని బండి లోకి ఎక్కించింది.

"ఏమైంది ఆ అమ్మాయికి?" అన్నాను మెల్లగా.

"పిల్ల పుట్టిపోయింది. కాన్పు చాలా కష్టమైంది. ఆపరేషన్ చేసి బిడ్డని తీసారు." అన్నాడు కృష్ణ తగ్గుస్వరంలో.

నేను విచిత్రంగా ఆ అమ్మాయివైపు చూసాను.

పట్టుమని 18 సం॥ కూడా వున్నట్టు లేవు.

అప్పుడే పెళ్ళి అవటం, పిల్లపుట్టటం. పోవటం అన్నీనా!

నా ఒళ్ళు జలదరించింది.

ఒక్కక్షణం ఈ ఆరుబయలు, యీ వెన్నెల, మధురస్వప్నంలా మత్తుగావున్న యీ వాతావరణం ఒక్కసారి తెగి కింద పడి, స్త్రీ జీవితం అంటే ఏమిటో భయం కరమైన యదార్థం లక్ష్మి రూపంలో కళ్ళెదుట కన్పించినట్టయింది. నేనుకూడా బండీ ఎక్కాను.

వాళ్ళిద్దరూ మాకు యిబ్బంది కలిగిస్తున్నందుకు సిగ్గుపడుతున్నట్టుగా, మొహమాటంగా బండీ మొదట్లో అటువైపు తిరిగి కూర్చున్నారు.

నేను బండీ చివర కూర్చున్నాను.

యింకా చాలా ఖాళీస్థలం వుంది. అయినా కృష్ణ మాతో ఎక్కలేదు. బండీతోపాటు పక్కగా నడవసాగాడు.

ఆ విధంగా సత్తెమ్మ రాకతో కృష్ణకి నేను చెప్పాలనుకున్న విషయం అవకాశం కుదరక ఆగిపోయింది.

నేను వూహించిన దానికంటే బండీ ప్రయాణం త్వరగా అయిపోయింది. వూరి పొలిమేరలు వచ్చేసినాయి.

సత్తెమ్మ, కూతురు వూరి మొదట్లోవున్న గుడిసెల దగ్గర దిగిపోయారు.

"దండాలు దొరా. దండాలు దొర సాని." సత్తెమ్మ ఎంతో వినయంగా మరీమరీ చెప్పింది. కృష్ణ బండీ ఎక్కి నా అభిముఖంగా కూర్చున్నాడు.

వెన్నెల అప్పటికి బాగా వచ్చింది.

నా కెదురుగా కూర్చున్న అతని ముఖం మీద వెన్నెల బాగా పడుతోంది.

అతనెందుకో సీరియస్‌గా, మౌనంగా




అయిపోయాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాను.

"ఏంలేదు."

"నీకోవిషయం చెబుదామనుకున్నాను."

"చెప్పు. ఏమిటది?"

ఏమాత్రం వుత్సాహంలేకుండా అతి మామూలుగా అడిగిన అతని ధోరణికి నాకు కించిత్తు కోపం వచ్చింది.

"యిప్పుడు కాదు."

అతను ఆత్రంగా ఏమిటో అని చెబితే గాని వీల్లేదని పట్టుపట్టలేదు. అతను అడక్కపోయినా చెప్పేయాలనే మూడ్ నాలోనూపోయింది.

ఇంటిముందుకు వచ్చి బండీ ఆగింది.

బండీ ఆగిన శబ్దం ఎవ్వరూ విన్నట్టు లేదు. ఎవ్వరూ బైటకి రాలేదు.

కృష్ణ ముందు దిగి నాకు చెయి అందిచ్చి దింపాడు.

నా కంటే ముందు లోపలకు వెళ్లాడు.

నేను బండీలో నుంచి తీసి క్రిందపడేసిన చెప్పులు వేసుకుని లోపలకి అడుగు పెడుతుండగా రాజు పరుగెత్తుకుంటూ వచ్చింది.

"వదినా!"

దాని చూపులో మంత్రమో, ఆ వదినా అన్న పిలుపులో మహత్యమోగానీ నేను అప్రయత్నంగా చేతులు జాచాను.

మరుక్షణంలో యిద్దరం ఒకరిని ఒకరు గట్టిగా హత్తుకుపోయాం.

"నువ్వు-నువ్వు-రావనే అనుకుంటు న్నాం." దాని కళ్ళలో నీళ్ళు నిలవటం గమనించాను నేను.

"రావని ఎలా అనుకున్నావు? పెళ్ళిగ్రాం కూడా యిస్తే?" కోపంగా అన్నాను.

"అదిచూసి మధ్యాహ్నం అంతా ఎదురు చూసాం. సాయంత్రంకూడా అయి పోయింది. ఒక్కదానివీ వస్తున్నావు కాబట్టి వస్తే యింతపొద్దు పోయేవరకూ వుండవనుకున్నాం. మాకేం తెలుసు? ఈ దొరగారు నీకోసం బెజవాడ వేంచేశారని"

రాజు అన్నగారివైపు సగం నిష్ఠూరంగా, సగం ఆనందంగా చూసింది.

ఇంతలో అత్తయ్యా, ఆవిడ వెనక యింకో అయిదారుగురు ఆడవాళ్లు వచ్చి నిలబడ్డారక్కడ.

అత్తయ్య కృష్ణని చూడగానే, అంది.

"ఏరా? నువ్వు బెజవాడ వెళ్ళావా? మాటమాత్రం చెప్పకపోతివి. రేపు పెళ్ళి కూతుర్ని చెయ్యాలయ్యో. ఎందుకు రాలేదా అని ఖంగారు పడ్తున్నాం."

"నేను అనుకోలేదమ్మా మొదట." కృష్ణ మెడమీద గోక్కుంటూ, సణిగినట్టుగా అని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రాజు అక్కడున్న ఆడవాళ్ళందరిని 'మా పిన్ని, మా అత్తయ్య, మా పెద్దమ్మ' అని ఏవేవో వరసలు చెబుతూ అందరినీ పరిచయం చేసింది.

"కాళ్ళు కడుక్కోని ముందు." యింతలో వెనకనుంచి వినిపించింది.

నేను తిరిగి చూసాను.

దాదాపు మా వయసేవున్న అమ్మాయి చెంబుతో నీళ్ళుతెచ్చి అక్కడ పెట్టింది. నేను ఆ అమ్మాయిని చూడగానే రాజు వైపు ప్రశ్నార్థకంగా చూసాను.

"మా వదిన సుందరి. వదినా! మా మీనా."

రాజు పరిచయానికి నేను ఫక్కుమని నవ్వాను.

"కాళ్లు కడుక్కోండి. మంచినీళ్ళు కావాలా?" ఆ అమ్మాయి ఎంతో మర్యాదగా అడిగింది నన్ను. అవసరంలేదన్నట్టు తలూపాను.

నేను సుందరిని పరీక్షగా చూసాను.

చూడగానే ఏ లోపాలూ కన్పించటం లేదు.

కనుముక్కు తీరు బాగానేవుంది. కాక పోతే ఒకటే లోపం.

మనిషిని చూడగానే బాగా పొట్టి అనే అభిప్రాయం కలుగుతుంది.

తెల్లటి తెలుపు. బొద్దుగా ఆరోగ్యంగా వుంది.

మొఖాన పెట్టుకున్న పెద్ద కుంకుమ బొట్టు వయసుకి మించిన గాంభీర్యం తెచ్చి పెట్టుకున్నట్టుగావుంది.

రాజు నేను చెయి చెయి పట్టుకుని లోపలకు వచ్చాం.

ఇల్లంతా ఏమిటో చాలా మారిపోయి నట్టుగా వుంది.

ఇంటిముందు ఆవరణ అంతా పందిరి










వేసివుంది.

క్రిందంతా కొత్తవి తాటాకుచాపలు పరిచివున్నాయి.

ఓమూల వరసగా దాదాపు ఒక యిరవై మంది పిల్లలు పడుకుని నిద్రపోతున్నారు.

పెట్రొమాక్స్ లైట్లు ఆ చివర ఒకటి, యీ చివర ఒకటి పెట్టివుంది.

హాల్లో కూడా అంతే.

హాల్లో అంత క్రితంవున్న టమాటా మొక్కలూ అవీ తీసేసారు.

శుభ్రంచేసి, పదునుచేసి నీళ్ళు చల్లి నట్టుగా వుంది.

దొడ్డివైపు ప్రహారీగోడ లేదు.

ఆ గోడకి బదులు తాటాకుల దడి కట్టారు.

దొడ్డి కుడివైపు గాడిపొయ్యి మండుతోంది.

దానిదగ్గర ఒక బ్రాహ్మణుడు వంట ప్రయత్నంలో వున్నాడు.

వారికివతలగా, పెరటి గుమ్మాని కెదురుగా పడుక్కుర్చీ వేసుకుని పండు వృద్ధులావున్న ఒక ముసలాయన పడుకుని వున్నాడు. రాజు ఆయన్ని మా చిన్న తాతయ్య అంటూ పరిచయం చేసింది.

కృష్ణ ఆయన పక్కన స్టూలు వేసుకుని కూర్చుని ఏవో చెపుతున్నాడు. ఇల్లంతా ఏదో సువాసన! పచ్చి తాటాకులు, యింటికి వేసిన రంగులు, పెళ్ళి కోసం తెచ్చిపెట్టిన సామాను, కొత్త తాటాకు చాపలు, గాడిపొయ్యిమీద సల సల మరుగుతూ, తిరగ మోతతో ఘుమ ఘుమ లాడ్తున్న చారు, యీ సువాసనలన్నీ మిళితమైపోయి యిదేదో పెళ్ళి సువాసన సుమా అనిపించేట్టుగా వుంది.

"స్నానం చేస్తావా?" అని అడిగింది రాజు.

"ఊహు. చెయ్యను."

ఇంతలో రాజుని ఎవరో పిల్చారు.

"యిప్పుడే, ఒక్క నిముషంలో వస్తాను." నాచెయ్యి వదిలి రాజు లోపలకు పరుగెత్తింది.

నేను అక్కడున్న అరుగుమీద కూర్చున్నాను.

ఎవరెవరో బంధువులు చాలామంది వచ్చారు.

వీళ్ళంతా కృష్ణ తండ్రివైపు బలగం అని తెలుస్తూనేవుంది.

పెళ్ళి ఎల్లుండి తెల్లవారుఝామున అయితే, యింతముందే వీళ్ళంతా రావటం ఎందుకో అనిపించింది. యింతమందికి యిన్ని పూటలు ఎంత ఖర్చు! అని కూడా అనిపించింది.

కొద్ది సేపయిం తర్వాత కృష్ణ పెళ్ళి పెట్టెతెరిచి తెచ్చిన బట్టలవీ అందరికీ చూపించాడు.

రాజుకి చీరెలు చాలా నచ్చాయి.

"నాదేంలేదు. అంతా మీ వదినగారి సెలక్షనే!" అన్నాడు.

నేను చురుగ్గా అతని వైపు చూసాను. అతని కళ్ళు స్నేహపూర్వకంగా నవ్వాయి.

అందరూ ఏవి, ఏవి అంటూ ఒకరి చేతుల్లోనుంచి మరొకరు తీసుకునిచూసారు.

రంగులు, నాణ్యం అందరికీ నచ్చినాయి. బాగున్నాయి అని మెచ్చుకున్నారు.

"సుందరీ! ఇవిగో! రా. చీరెలు చూసి వెళ్ళు." అత్తయ్య ప్రత్యేకంగా పిలిచింది.

"వస్తున్నా." అందే గానీ వెంటనే రాలేదు.

నేను వచ్చినప్పటి నుంచి చూస్తూనే వున్నాను.

ఆ అమ్మాయి వీళ్ళందరితో పాటు కూర్చోలేదు.

కాబోయే పెళ్ళికూతురి ననే అనవసరమైన సిగ్గులు ఒలకబోయడంగాని, అతి నమ్రత చూపించటంగానీ చేయటంలేదు.

ఆపనో, యీపనో చక్కబెడుతూనే వుంది. వంట బ్రాహ్మణుడికి ఏది కావాలన్నా తనే అందిస్తోంది. మధ్య మధ్యలో 'అత్తయ్యగారూ'అంటూ పిలిచి తెలియనివి అడుగుతోంది.

ఆ అమ్మాయిలో చొరవ, ఆ పనిచేసే తీరుచూస్తే సుందరి యీ యింటికి కాబోయే కోడలని అనుకోరు. పెళ్ళయి ఎన్నో రోజులయి, బాధ్యతల్ని నెత్తిమీద వేసుకున్న మనిషి అనుకుంటారు.

కూర్చున్న వాళ్ళలో ఒకళ్ళిద్దరు ఆడవాళ్ళు పనిచేస్తూ అటూ యిటూ తిరుగుతున్న సుందరిని చూస్తూ, "పిల్ల బాగా పనిమంతురాలుగా వుంది. కమలమ్మ అదృష్టవంతురాలు" అనటం వినిపించింది నాకు.

సుందరి నేను వూహించినంత అనాకారిగా కాకుండా, మా అందరిలాగానే వుండటం నా కేమిటో నిరుత్సాహంగా




నిరాశగా అనిపించింది.

ఇక్కడికి వచ్చేవరకూ అంత రావాలని వుబలాటపడిన నాకు యిప్పుడు అనుకున్నంత హుషారుగా ఏమీ అనిపించటం లేదు. దానికి కారణం బహుశా యింటి నిండా బిలబిల లాడుతూ వున్న యీ అపరిచిత జనం అనుకుంటాను. లేక-లేక కృష్ణని మొదట అక్కడే స్టేషన్‌లోనే చూసెయ్యటమో మరి. ఏమో! నా కేది అయింది స్పష్టంగా తెలియలేదు.

రాజు నేను కూర్చుని వుండగా సుందరి వచ్చి "భోజనాలు వడ్డిస్తున్నారండి" అంది.

లేచి వెళ్ళాం.

ఆడా మగా కలిసి అంతా ఒక యిరవై మంది దాకా వున్నారు.

పరాయివాళ్ళు ఎవరూ లేకపోవటంతో అందరికీ ఒకే వరస బారుగా యిస్తళ్ళు వేసి వడ్డించారు.

"మీరు కూర్చోండి తాతయ్యా! మొదట" అన్నాడు కృష్ణ.

"ఎవరైతె ఏముందిరా? నువ్వు యీ యింటికి పెద్ద. నువ్వు కూర్చో" అంటూ ఆయన కృష్ణ రెక్కపట్టి కూర్చోపెట్టాడు.

కృష్ణ కుడివైపు అంతా మగవాళ్ళ వరస.

ఎడంచేతి వైపు అంతా ఆడవాళ్ళవరస వచ్చేట్లు కూర్చున్నారు.

మేం వెళ్ళేసరికి నేను, రాజు తప్ప అందరూ కూర్చున్నారు.

కృష్ణ ఎడంచేతి వైపు నాకు, రాజుకి

అన్నట్టు రెండు యి స్తళ్ళు మిగిలినాయి.

"రాజేశ్వరీ! నువ్వు అటువైపు మీ అన్నయ్య పక్కన కూర్చో."

మేం అటువైపు వెళ్తుండగా నేతిగిన్నె పట్టుకుని నిలబడిన సుందరి రాజుని హెచ్చరించింది.

నాకు ఒళ్ళు మండింది. నేను ఎక్కడ అతని పక్కన కూర్చుంటానో అని కాబోలు ఆ హెచ్చరిక!

రాజు ముందు నడుస్తున్న నేను కృష్ణ పక్కనే వున్న మొదటి విస్తరి దగ్గర కూర్చున్నాను!

రాజు నా ప్రక్కన కూర్చుంది.

వడ్డన ప్రారంభమైంది.

"నువ్వుకూడా కూర్చోమ్మా సుందరీ! మేం వున్నాంగా. వడ్డిస్తాంలే." అంది అత్తయ్య.

"తర్వాత తింటా లెండి." ఎంతో అణకువగా చెప్పిన ఆకంఠస్వరంలో దృఢ నిశ్చయం నేను గమనించాను.

భోజనాలు చేస్తుండగా- కృష్ణకి వడ్డించ టానికి వచ్చిన ప్రతి వంటకాన్ని తనకి వద్దని చెయి అడ్డుపెట్టి పక్కనున్న నాకు వెయ్యమని చెప్పేవాడు.

నేను వద్దు వద్దు అంటూ చేతులు అడ్డు పెట్టేదాన్ని.

వచ్చినవాళ్ళు మానేసి వెళ్ళబోయేవారు.

"అరే చెబుతుంటే నీక్కాదూ?" కృష్ణ కాస్త గట్టిగా అనేవాడు.

వాళ్ళు నేను వద్దు మొర్రో అంటున్నా వినకుండా వడ్డించి వెళ్ళేవాళ్ళు.

ఒకసారి యిలాగే అన్నం ఎక్కువగా పెట్టేసి వెళ్ళిపోయాడు వంట బ్రాహ్మణుడు. నేను కృష్ణ వైపు తిరిగి కోపంగా చూస్తు అన్నాను.

"ఏం? నీ పొలంలో బియ్యం ఎక్కువగా పండుతున్నాయా ఏమిటి?"

"బియ్యం పండవు. వడ్లు పండుతాయి. నీ దయవల్ల అవి బాగానే పండు తున్నాయి." కృష్ణ కళ్ళలో కొంటితనం మెరుస్తుండగా చిరునవ్వుతో సమాధానం యిచ్చాడు.

ఆ నవ్వు, ఆ కళ్ళలో కొంటెదనం వెనక దాగివున్న ఆత్మీయత ఈ రెండు అతను నాకు చాలా దగ్గర వాడు సుమా అనిపించే తీయటి వూహ నా మనసులో సుడి తిరిగేలా చేసింది.

భోజనం మధ్యలో కృష్ణ మంచినీళ్ళు తాగుతుండగా, నేను గాభరా నటిస్తూ, 'అయ్యొయ్యొ! అది నా గ్లాసు! అవి నా మంచినీళ్ళు! ఎంగిలి నీళ్ళు నువ్వు తాగే స్తున్నావు." అన్నాను బిగ్గరగా.

అందరూ ఒక్క నిముషం భోజనాలు చేయటం మానేసి నా వైపు చూసారు.

కృష్ణ నా అరుపులకి హడిలిపోయినట్లు తాగుతున్న నీళ్ళు ఆపేసి గ్లాసు వైపు చూసాడు.

అన్ని గ్లాసులూ ఒకే రకంగా వున్నాయి.

తేడా ఎలా చెప్పటం?



# నాణ్యతగల వస్త్రాలు?

## హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్‌లు . పాప్లిన్‌లు . గాబర్డీన్‌లు మొదలైనవి






మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై

Bensons 1335 A/1 TEL

టివో వాళ్ళు వాళ్ళ కుటుంబ విషయాలు చెప్పుకుంటున్నారు.

వీరాయి మధ్యలో ఒకసారి వచ్చి పెట్రొమాక్సు లైట్లకి పంపుకొట్టి వెళ్లాడు.

రాజు నన్ను సారథిని గురించిన కబుర్లు ఏమైనా చెప్పమని ప్రాణాలు తోడింది.

నేను నోటికి వచ్చినట్టు వున్నవీ, లేనివీ అన్నీ చెప్పసాగాను.

అది వళ్ళంతా చెవులు చేసుకుని విన్నంత శ్రద్ధగా వినసాగింది.

"ఇక పడుకోండర్రా మళ్ళీ ప్రొద్దుటే లేవాలి." తాతగారు కబుర్లాడుతున్న ఆడ వాళ్ళని హెచ్చరించారు.

"టైమెంతయిందో" అంది రాజు.

"12-30 కావస్తోంది" అన్నాను చేతి నున్న వాచీ చూసుకుంటూ.

రాజు కళ్ళు మూసుకుంది.

కొద్దిసేపటిలోనే దానికి నిద్ర పట్టేసింది.

నా చేయి పట్టుకుని, నిశ్చింతగా, నిర్మలంగా నిద్రపోతున్న రాజువైపు చూశాను. నిష్కల్మషంగా వున్న ఆ ముఖం తదేకంగా చూసినకొద్దీ రాజు ఇంతకంటె మంచి జీవితానికి అర్హురాలని మరీమరీ అనిపించ సాగింది.

చిత్రం ఏమిటంటే దాని ముఖంలో ఎలాటి అసంతృప్తీలేదు.

లభించిన దానితో సంతోషపడటం, అందనివాటిని గురించి మథనపడక పోవటం వీళ్ళ ప్రతి ఆలోచనలో స్పష్టంగా కన్పిస్తోంది.

నేను కూడా కళ్ళు మూసుకుని నిద్ర కోసం ప్రయత్నించ సాగాను.

ఎంతసేపు గడచినా మత్తుగా అని పిస్తుందే తప్ప నిద్ర రావడం లేదు.

అమ్మ గుర్తువచ్చింది. సారథి గుర్తుకు వచ్చాడు. నేను మెడ్రాసు వెళుతానన్నప్పుడు అతని మాటలు గుర్తుకు వచ్చినాయి. అష్టరాల్! సారథి నేను అనుకున్నంత మూర్ఖుడు కాదేమో!

ఇక్కడ ఇంతమంది బంధువులున్నారు.

వీళ్ళతోపాటు అమ్మా, నాన్నా కూడా వున్నట్టయితే ఎంత బాగుండేది. ఎంత సంతృప్తిగా వుండేవి అనిపించ సాగింది.

అమ్మ అభిప్రాయాలు ఏర్పరచు కోవటంలో మహా గట్టిమనిషి.

ఆవిడ ఒక నిర్ణయానికి వస్తే ఇక బ్రహ్మ కూడా దాన్ని సడలించలేడు.

నాన్నగారిలాటి మెత్తటి స్వభావం గల వ్యక్తి భర్తగా దొరకటం నిజంగా అమ్మ అదృష్టమే:

ఆలోచనల జాలులోపడి సతమతమవుతూ కొట్టుకుపోతున్న నాకు ఇంతలో 'రాజేశ్వరీ' అన్న సుందరి కంఠం వినిపించింది.

ఆ పిలవటంలో కూడా కావాలని తెచ్చి పెట్టుకున్న హుందాతనం!

లేని ఆధిక్యతని తెచ్చిపెట్టుకునే గడుసు తనం!

సుందరి పిలుపు వినగానే నేను కళ్ళు తెరవబోయి కూడా ఆగిపోయాను.

"రాజేశ్వరీ! నిన్నే? నిద్రపోయావా?" పక్కవాళ్ళకి ఎక్కడ నిద్రాభంగం అవు




తుందోననే జాగ్రత్త ఆ కంఠంలో ప్రతి ధ్వనిస్తోంది.

"మీ అన్నయ్యకి దిండు కావాలి." ఇవ్వ మన్నట్టుగా చెబుతోంది.

నిద్రపోతున్న రాజు మాట్లాడలేదు.

మేలుకుని వుండి కూడా నేను పలక లేదు.

సుందరి క్షణం సేపు అలాగే నిలబడింది.

మేం నిద్రపోతున్నాం అనుకుని వెళ్ళి పోతుందేమో అనుకున్నాను.

వంగి మెల్లగా నా తల ఎత్తి దిండు తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయి ధైర్యానికి విస్తు పోయాను!

కాబోయే భర్తకి ఇబ్బంది కలుగుతుం దేమోననే ఆ చొరవకి మెచ్చుకోకుండా ఉండలేక పోయాను కూడా.

ఫర్వాలేదు! సుందరి వేయి కళ్ళతో కృష్ణని గుప్తధనంలా కాపాడుకోగలదు. అతనికి ఏ లోటూ రానివ్వదు అనిపించింది.

చాలా సేపయిం తర్వాత—

ఇల్లంతా నిశ్శబ్దం అయిపోయింది.

అందరూ పడుకున్నట్టున్నారు.

అత్తయ్యా, ఇంకో ఆవిడ మాత్రం చాలా తగ్గు స్వరాల్లో రేపు రాజుని పెళ్ళి కూతురిని చేసేటప్పుడు ఎవరెవరిని భోజ నానికి పిలవాలో, ఎవరెవరిని వదిలేయ వచ్చునో ఆలోచించుకుంటున్నారు.

"పడుకున్నారా వీళ్ళంతా?" అప్పుడే అక్కడికి వచ్చిన కృష్ణ స్వరం విని

పించింది.

"ఆ!" అంది అత్తయ్య సమాధానంగా.

కొంతసేపటికి అత్తయ్యా వాళ్ళ కంఠ స్వరాలు కూడా వినిపించటం మానేసినాయి. అందరూ నిద్రపోయినట్టున్నారు.

ఎంత ప్రయత్నించినా నిద్రపట్టని నేను కళ్లు తెరిచి చూశాను.

దూరంగా కృష్ణ పెట్రొమాక్స్ లైటు దగ్గర క్రింద కూర్చుని కాగితంమీద ఏదో వ్రాస్తున్నాడు. మధ్య మధ్యలో ఎడం చేతిలోవున్న కాగితాలవైపు చూస్తున్నాడు. అవన్నీ ఆ రోజు కొన్న సామాన్ల ఖరీదు అనుకుంటాను.

చెంపకి చేయి ఆనించుకుని వత్తిగిలి పడుకునివున్న నేను కొద్దిసేపు తదేకంగా అతనివైపే చూస్తూ పడుకున్నాను.

అతను కూర్చోవటంలో, నిలబడ టంలో, నడవటంలో ఒకవిధమైన హుందా తనం వుంది. ఇంతక్రితం భోజనాల దగ్గిర అతనితో సరదాగా గడిపిన సమయం గుర్తుకు వచ్చింది. అతనికంటే పెద్దవాళ్ళ పట్ల ఎంత వినయవిధేయతలో, మళ్ళీ చిన్నవాళ్ళపట్ల అంత వాత్సల్యం, అభి మానం చూపిస్తాడు. ఈ రోజు అను కోకుండా అతనితో కలిసి బెజవాడలో గడ పక పోయినట్టయితే, అతనిలో దాగివున్న మరో వ్యక్తిని గురించి నాకు ఎప్పటికీ తెలిసి వుండేదికాదేమో! థాంక్ గాడ్! టెలిగ్రాం ఇచ్చినందుకు నాన్నగార్కి మన స్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి.

వ్రాయటంలో మునిగిపోయివున్న అత నికి నేను మేలుకుని వున్నట్టుగాని, అతని వైపు పరీక్షగా చూస్తున్నట్టుగానీ తెలియదు.

నా వునికిని అతనికి తెలియపరచాలని పించింది.

కొద్ది సేపయిం తర్వాత 'అబ్బా!' అంటూ లేచి కూర్చున్నాను.

అతను వులిక్కిపడ్డట్టుగా ఇటువైపు తిరిగాడు.

"ఏమిటి?" అన్నాడు ఆదుర్దాగా.

"మెడ నొప్పి పుట్టింది." అన్నాను మెడ మీద చేయివేసి తల అటూ ఇటూ తిప్పుతూ.

"ఎందుకని?"

"దిండులేదు. తలక్రింద ఎత్తులేకపోతే నాకు నిద్ర రాదు."

కృష్ణ వ్రాస్తున్న కాగితాలు పక్కన పెట్టి లేచి లోపలకు వెళ్లాడు.

నేను పడుకున్న వాళ్ళందరినీ కలియ చూసాను.

నాకు కొద్ది దూరంలో అత్తయ్యకి ఎడమవైపుగా ఆ చివర సుందరి పడుకుని వుంది. అక్కడ ఆ అమ్మాయి కన్పించక పోయినట్టయితే ఆ పట్టున కృష్ణని దొడ్లోకి లాక్కెళ్ళి పొలం సంగతి చెప్పేసి వుండేదాన్ని. ప్చ్! ఇప్పుడు లాభంలేదు. బాగుండదు అనిపించి వెనక్కి వాలి పడు కున్నాను.

కొద్దిసేపటికి కృష్ణ తిరిగి వచ్చాడు. అతని చేతిలో దిండు వుంది.

రెండూ నెలట్నుంచి అప్పు వాపస్ అడుగుతే ఇస్తాలేవ్- పైనించి జీతం జీవితం అనుభవం అంటూ డైలాగ్లు చెప్తవ్? ఇది తెల్గూ సిన్మా అనుకున్నవ్? తే-పైసల్తే!




"ఇదిగో!" అన్నాడు అందిస్తూ.

"ఫర్వాలేదులే. వద్దు. ఇంకెవరికైనా కావాలేమో" అన్నాను మొహమాట పడుతున్నట్టుగా.

"ఎవరికీ అవసరం లేదు. తీసుకో."

నేను చేయి జాచబోయి ఆగిపోయాను.

తల క్రింద పెట్టమన్నట్టు తలెత్తాను.

కృష్ణ దిండు నా తలక్రింద పెట్టాడు.

వెళ్ళబోతూ ఆగి, "ఏం? నిద్ర రావడం లేదా?" అన్నాడు.

"ఉహు."

"ఎందుకని?"

"బెజవాడ దుర్గగుడి, కృష్ణా బ్యారేజ్ గుర్తుకు వస్తున్నాయి."గోముగా చూశాను.

కృష్ణ కళ్ళల్లో కాంతి లాంటిది తళుక్కుమంది.

క్షణంసేపు నా వైపు రెప్పవాల్చకుండా చూశాడు.

నా ముఖంలో అతనికి ఏం కన్పించిందో ఏమో, చేయి జాచి నా బుగ్గమీద చురుక్కుమనేలా చిటిక వేశాడు.

"కళ్ళు మూసుకో. నిద్ర అదే వస్తుంది. నేను మంత్రం వేస్తాను." అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

అతను మళ్లీ వ్రాసుకోటానికి అక్కడ కూర్చోలేదు.

కాగితాలు తీసుకుని పెరట్లోకి వెళ్ళిపోయాడు.

నేను పక్కకు వత్తిగిలి పడుకున్నాను.

దూరంగా సుందరి దగ్గటం వినిపించింది. తను మేలుకునే వున్నానని సూచన కాబోలు!

# నిమిషాలలో మాయమయిన జలుబు!



# అమృతాంజనం

## ప్రభావం వల్లనే!

జలుబులు, తలనొప్పి, బెణుకులు, కండరాలనొప్పి— వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం అరా చేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.




అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.

నొప్పులను, జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్:
మదరాసు - బొంబాయి - కలకత్తా - న్యూ ఢిల్లీ - హైదరాబాదు - బెంగళూరు.

AM-5340

నా కెందుకో చాలా సంతృప్తిగా అని పించింది.

కృష్ణ చిటికె వేసినచోట బుగ్గమీద తడుముకున్నాను.

అతను మంత్రం పెట్టాడో లేదో తెలియదుగానీ, ఈ సారి నేను అట్టే ప్రయత్నించకుండానే మెల్లమెల్లగా కళ్ళమీదకి నిద్ర ముంచుకు వచ్చేసింది.

*　　　*

తెలతెలవారుతుండగా ఇంకా నాలుగైదు బళ్ళనిండా మళ్ళీ చుట్టాలు దిగారు. కిలకిలలాడుతూ వాళ్ళు వచ్చిన సందడికి మేలుకుని లేచి కూర్చున్నాను. నా పక్కన పడుకున్న వాళ్ళెవరూ లేరు. అందరూ అప్పటికే లేచినట్టున్నారు. రాజు కూడా లేదు.

"ఏమ్మా పిన్నీ?"

"ఏం వదినా?"

"అత్తయ్యా బాగున్నావా?" అన్న పలకరింపులు.

"ఏమే కమలం. చూశావా అందరం ఒకేసారి దిగాం" అని ఎవరో అంటుంటే.

"ఏమి టత్తయ్యా? మీరు కూడా యిప్పుడా రావటం పెళ్లివారిలాగా. నాలుగు రోజులు ముందే రమ్మనమని కబురు చేస్తే కూడా" అన్న అత్తయ్య నిష్ఠూర వాక్యాలు కలగాపులగంగా వినిపించినాయి.

వచ్చిన వాళ్ళలో పిల్లల జనాభా కూడా చాలా వుంది.

కొంతమంది కేర్, కేర్ మంటూ ఏడుపులు, రాగాలు మొదలైనాయి.

అబ్బబ్బ! మరీ యింత జనమా! అనిపించింది.

కృష్ణకి పెళ్ళికి అయ్యే ఖర్చుకంటే, ఈ చుట్టాలకయ్యేదే డబుల్ అయేట్టుంది. ఛ! ఛ! ఏమిటో అనుకున్నాను. కృష్ణకు పొదుపు అనేది కాస్త కూడా తెలిసినట్టులేదు.

లేచి దొడ్లోకి వచ్చాను.

రాజు ఎక్కడుందో కన్పించలేదు.

నేను తీర్థంలో తప్పిపోయిన చిన్నపిల్లలా ఓ పక్కగా నిలబడ్డాను.

సుందరి దగ్గరకి వచ్చి "ముఖం కడుక్కోండి" అంది ఎంతో మర్యాదగా.

టూత్ పేస్ట్ తెచ్చుకుని పళ్ళు తోముకుంటుంటే నీళ్ళు తెచ్చి అందించింది.

నన్ను మర్యాదచేసే భారం ప్రత్యేకంగా తను తీసుకుంటున్నట్టుగా, ముఖం కడుక్కున్న వెంటనే కాఫీ తెచ్చి యిచ్చింది.

కాఫీ గ్లాసు అందిస్తూ, "రాత్రి బాగా నిద్ర పట్టిందా?" అంది.

"ఆ!" అన్నాను.

ఆ అడగటంలో ఆ అమ్మాయి ఉద్దేశ్యమేమిటో నా కర్థంగాలేదు.

గాడిపొయ్యి రాత్రి చల్లార్చారో లేదో అన్నట్టు యిప్పుడు మళ్ళీ భగభగలాడుతూ మండుతోంది. స్నానాలు చేసేవాళ్లు చేస్తున్నారు. కాఫీలు తాగేవాళ్లు తాగుతున్నారు. ఒకచోట ఆడవాళ్ళంతా గుంపుగా కూర్చుని జడలేసుకుంటున్నారు.

తాతగారు స్నానంచేసి వీభూది రేఖలు

ధరించి వచ్చి పడక్కుర్చీలో కూర్చున్నారు.

అత్తయ్య ఆయనకి కాఫీ తీసుకెళ్ళి యిచ్చింది.

"కమలం! సరిగ్గా 9 గంటల పదిహేను అయిదు నిముషాలకల్లా పెళ్లికూతురిని చేయాలి" అంటూ హెచ్చరించారు.

"అలాగే" అంది అత్తయ్య.

ఈ జనంలో కృష్ణ జాడ నా కెక్కడా కన్పించలేదు.

సుందరిని రాజు, మధు, మిగతా పిల్ల లంతా చీటికి మాటికి "వదినా! వదినా" అని పిలుస్తూ అది కావాలి, ఇది కావాలి అని అడుగుతుంటే నాకెలాగో అనిపించసా గింది. మొదట ఒకటి రెండుసార్లు వదినా అన్న పిలుపు వినగానే నేను పలికాను. సుందరి కూడా పలికింది.

రాజు నవ్వింది. బాగుంది. ఇబ్బందేనే అంది తల గోక్కుంటూ.

ఆ తర్వాత వదినా అన్న పిలుపుకి నేను పలకడం మానేశాను.

నాకు సుందరిలా చేతినిండా పనీ లేదు.

రాజునిలా పలకరించేవాళ్ళూ లేరు.

నా కెలాగో వుంది. అలా ఓ మూలగా నిలబడటం చాలా యిబ్బందిగా అనిపిం చింది. అత్తయ్య దగ్గరకి వెళ్లి, "నా క్కూడా ఏదయినా పని చెప్పత్తయ్యా, చేస్తాను." అన్నాను.

"నువ్వా? నువ్వేం చెయ్యాలే అమ్మా! నువ్వు వచ్చావు, అంతే చాలు నాకు."

అత్తయ్య చెయ్యి పట్టి దగ్గరకు లాక్కుంటూ అంది.

ఆవిడ ఎంత అల్ప సంతోషి అనిపిం చింది!

నేను యీ ఇంటికి అతిధినే తప్ప, బాధ్యతగల, దగ్గర బంధువుని కాదని కూడా తెలిసింది.

స్నానం చేయటానికి బట్టలు తీసుకుని బాత్‌రూమ్ వైపు వెళ్తున్న నాకు ఆడవాళ్లు కూర్చున్న చోటునుంచి మాటలు వినిపిం చాయి.

"ఈ అమ్మాయి కమలం అన్న కూతు రుట కదూ?" ఎవరో అడిగారు.

"అవును."

"ఏం? రాకపోకలు మళ్ళీ మొదలైనా యేమిటి? ఆ ఇంటి మీద కాకి యీ ఇంటి మీద వాలదుటగా?"

"ఏమో మన కెందుకు లెద్దూ గొడవ? ఆవిడ కోడలు అక్కడుంది, వింటుం దేమో" మందలింపుగా వినిపించింది.

నా మనసు చివుక్కుమంది.

వాళ్ళన్నది నిజమే! ఇన్ని రోజులూ మా రెండు కుటుంబాల మధ్యా ఎలాటి సంబంధ బాంధవ్యాలు లేవన్న సంగతి అందరికి తెలిసిందే.

ఇప్పుడు నేను రావటం వాళ్ళందరికీ విచిత్రంగానే వుంది.

రాజుని పెళ్లికూతురుని చేసేపని నేనే స్వీకరించాను.

నేను వచ్చేటప్పుడు నాన్నగారు నాకు పట్టుచీర, జాకెట్ గుడ్డ ఇచ్చి రాజుని పెళ్లి




కూతుర్ని చేసి ఆ చీర కట్టించమని చెప్పారు.

మొట్టమొదట పెళ్ళికూతురిని చేయాల్సింది పిల్ల మేనమామలట!

అది మన ఆచారం అని చెప్పారు.

అత్తయ్యకి నేనీ విషయం గుర్తు చేశాను.

ఆవిడ చప్పున తల వూపింది. ఆవిడ కళ్ళలో నీళ్ళు తొణికిసలాడటం నా దృష్టికి అందకపోలేదు.

రాజు తలంటి పోసుకున్న తర్వాత దాన్ని కూర్చోపెట్టి జుట్టు చిక్కు తీసి చక్కగా జడ అల్లాను. నుదుట కల్యాణ తిలకం అందంగా దిద్దాను. జడ నిండా పువ్వులు పెట్టాను. కాళ్ళకి పసుపు పూసి పారాణి పెట్టాను.

బుగ్గన చుక్క పెట్టడానికి కాటుక కన్పించలేదు.

"ఆ సామాన్ల కొట్లో వుంటుంది" అంది రాజు.

నేను కాటుక కోసం గదిలోకి వెళ్ళాను.

గదినిండా కాలుపెట్టే సందు లేకుండా పెళ్ళికి తెచ్చిన సామాను వుంది.

గదిలో బియ్యపు బస్తా మీద కూర్చొని మోకాలి మీద పుస్తకం పెట్టుకుని దానిలో ఏదో చకచకా నోట్ చేసుకుంటున్న కృష్ణ. లోపలకు వచ్చిన నన్ను చూడనే లేదు.

"నమస్కారం కృష్ణారావుగారూ!" అన్నాను.

అతను తలెత్తి చూసి పలకరింపుగా నవ్వాడు.

"ఏం కావాలి?"

"మీరే కావాలి."

నన్ను చూడగానె అతని కళ్ళలోకి ఏంతయిన కాంతి ఛెంగున ఎగిరి వస్తుంది.

ఇది నేను చాలాసార్లు గమనించాను. బహుశా ఈ విషయం అతనికి కూడా తెలియదేమో!

అతను తల వంచుకుని మళ్ళీ వ్రాసుకో సాగాడు.

నేను కాటుకబరిణ కోసం వెతికాను. అది రాజు చెప్పిన చోట వుంది.

అది తీసుకుని వెళ్ళబోతున్న నేను ఆగి వెనక్కి తిరిగి అతని పక్కగా వచ్చాను.

"ఏమిటి వ్రాస్తున్నారు అంత సీరి యస్‌గా? జమాఖర్చులా?" అన్నాను.

"ఉహూ. ఇంకా తీసుకురావాల్సినవి. ఎన్ని తెచ్చినా ఇంకా తీసుకు రావాల్సినవి మిగిలిపోతూ అమ్మకు గుర్తుకు వస్తూనే ఉంటాయి. లిస్ట్ వ్రాసుకుంటున్నాను." అన్నాడు అతని కంఠంలో విసుగు ధ్వనిం చింది.

"రాత్రి వ్రాసిన వేమిటి? జమా ఖర్చులా?"

"జమ ఎక్కడ? ఒట్టి ఖర్చే." తల ఎత్తకుండా చకచకా వ్రాస్తూనే అన్నాడు.

"ఇలా వ్రాసినందువల్ల ఏమిటి ప్రయో జనం?"

"దేనికి ఎంతయిందో తెలుస్తుంది. నేను డబ్బు ఇవ్వవలసిన వాళ్ళ విషయంలో ఎప్పుడూ పొరపాటురాదు."

ఎంత ఖచ్చితమైన మనిషి అనిపిం చింది.

నా కెందుకో చూడగా, చూడగా అమ్మకీ ఇతనికి స్వభావంలో చాలా పోలికలు వున్నట్టు కనిపించసాగినాయి.

పక్కనుంచి తిరుగా వున్న అతని చెంపని చూడగానే నా మనసులో కొంటె వూహ ఒకటి మెరపులా తళుక్కుమంది.

చేతిలో వున్న బరిణ మూత తెరిచి చూపుడు వేలుతో కాటుక తీసుకుని బరిణ మూసేసాను. రెండు చేతులూ వెనక్కి పెట్టుకుని, ఇంకో అడుగు దగ్గరగావేసి, అతని భుజంమీద నుంచి తొంగి చూస్తూ, "ఏది? మీ చేతివ్రాత నా కెప్పుడూ చూప లేదు. అరె! అంతా ఇంగ్లీషులో వ్రాస్తు న్నారా? ఎంత పొందికగా వున్నాయి మీ అక్షరాలు!" అన్నాను.

అంటూనే చటుక్కున చెయి జాచి అతని బుగ్గమీద కాటుక చుక్కలా పెట్టే సాను.

"ఏయ్? ఏమిటిది?" కృష్ణ చటుక్కున నా చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"పెళ్ళికొడుకు అలంకరణ! ఈ చేత్తో పన్లో పని నిన్ను కూడా పెళ్ళికొడుకుని చేసేస్తాను. నీ పెళ్ళికి నే నెలాగూ వుండ నుగా?"

అతను తలెత్తి నా వైపు చూశాడు.

ఒక్క క్షణం అతని కళ్ళలో కన్పిం చిన భావంబట్టి, నా చేతిమీద అతని చేయి బిగించిన తీరునిబట్టి బలంగా నన్ను ముందుకు లాక్కుంటాడనే అనుకున్నాను. కానీ అలాంటిదేం జరగలేదు.







నా చేయి వదిలేశాడు.

బుగ్గను వున్న కాటుక చేత్తో చెరుపుకో బోయాడు.

మాపుడు వేలు చూపించి బెదిరిస్తూ అన్నాను.

"జాగ్రత్త! నీ ఇష్టం. శుభమా అని చుక్కపెడితే చెరిపేస్తున్నావు. అది అపశకునం. నీ పెళ్ళి ఆగిపోతుంది. సుందరి నీకు దక్కదు. నీ పాలం కాస్తా గోవిందా!"

నా చివరిమాట వినగానే అతని కళ్ళలో సున్నితమైన చోట దెబ్బతిన్నప్పటి బాధ గోచరమైంది.

క్షణంసేపు ఆగాడు.

ఆ వెంటనే నా పయిటకొంగు చేత్తో పట్టి లాగి, దానితో బుగ్గమీద గట్టిగా తుడి చేసుకుంటూ, " నీ చీరతో తుడిస్తే అప శకునం కాదు." అన్నాడు.

"బొట్టు పోలేదు. చెరిగి ఇంకా పొడుగ్గా అయింది" అన్నాను గర్వంగా.

కృష్ణ ఇంకోసారి ఇంకా గట్టిగా తుడుచు కున్నాడు.

"అయ్యొయ్యో! నా చీర! నా తెల్లటి పట్టుచీర!" విలవిల లాడిపోతూ అన్నాను.

"ఫర్వాలేదులే. ఇంతకంటే మంచిది ఇంకోటి కొనిస్తాలే." కృష్ణ నా చీరకొంగు పట్టి ఇంకొంచం దగ్గిరకి లాక్కున్నాడు.

నా చెంపల్లోకి వెచ్చటి రక్తం ఒక్క సారి పొంగులా వచ్చింది.

అతను చీరకంటే, చీర నెపంతో నన్ను

దగ్గరకు లాక్కుంటున్నట్టుగాఅనిపించింది.

"అరె! వదులు. వదలమంటుంటే" అతని చేతిలోంచి చీర లాక్కుంటూ అన్నాను.

సరిగ్గా సుందరి అదేసమయంలో లోప లకు వచ్చింది.

నేను ఇంకా నవ్వుతూనే వున్నాను.

కృష్ణ చప్పున చీర చెంగు వదిలేశాడు.

బలంగా అంతవరకూ లాగిపట్టుకున్న అతను ఒక్కసారి వదిలేయటంతో తూలి వెనక్కు పడబోయిన నేను ఎలాగో నిగ్ర హించుకుని సరిగ్గా నిలబడ్డాను.

కృష్ణ వ్రాస్తున్న పుస్తకం మూసేసి కాగితం జేబులోకి తోసేసుకుని లేచి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. అతని ముఖం ఎర్రబడటం నేను గమనించక పోలేదు.

"జీడిపప్పు వుండాలి ఇక్కడ."సుందరి జీడిపప్పు కోసం వచ్చినట్టు అక్కడున్న పొట్లాల్లో వెతక సాగింది.

నేను నవ్వు దాచుకుని, గంటు పెట్టు కున్న ముఖంతో, "చూడమ్మాయి! నీ కా బోయే భర్తగారి మోటు సరసం! నా చీరంతా కాటుక పూశాడు." అంటూ చీరకొంగు చూపించాను.

"బాగుంది. మీరు ఆయన బుగ్గకి కాటుక పెడితే, ఆయన ఈ చీరకి దాన్ని పులిమారు. సరిపోయింది. మగవాళ్ళు మరి వూరుకుం టారా?" అంది.

సుందరి తెచ్చి పెట్టుకున్న నవ్వుతో యీ మాటలు అంటున్నా, ముఖం యీర్ష్యతో కుచించుకుపోవటం నాకు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

నా కర్థమైంది! సుందరిలాటి స్త్రీలు పరాయి వాళ్ళ నీడలు కూడా తమ భర్తల మీద పడనివ్వరు. వేయి కళ్ళతో నాది అనే దాన్ని జాగ్రత్తగా కాపాడుకోవటం వుగ్గు పాలతో అభ్యసించిన వ్యక్తి సుందరి అని పించింది. నేను కాటుక తీసుకుని ఇవతలికి వచ్చేశాను.

సరిగ్గా తాతగారు చెప్పిన ముహూర్తానికి రాజుని పెళ్ళికూతురిని చేశాం. సన్నాయి వాయించేవాళ్లు వచ్చారు. ఆ వాయిద్యం వినిపిస్తుండగా తాతగారి భార్య, ఇంకో ఇద్దరు రాజుకి హారతి ఇచ్చారు. అది చూస్తుంటే నాకెలాగో అనిపించింది. ఎన్ని కోర్కెలతో, కొత్త వూహాలతో,అందమైన కలలతో వైవాహిక జీవితంలోకి అడుగు పెడుతుంది ప్రతి ఆడపిల్ల! ఒక్కక్షణం రాజేశ్వరి స్థానంలో నన్ను నేను వూహించు కున్నాను. తర్వాత——

అత్తయ్య ఆదేశం మీద నేను మణిని, కామేశ్వరిని తోడు తీసుకుని, వూళ్లోకి వెళ్ళి "మా రాజుకి సాయంత్రం గాజులు తొడి గిస్తాం. పేరంటం. మీరందరూ రండి"అని పేరు పేరు వరసనా బొట్టు పెట్టి పేరంటం పిలిచి వచ్చాను.

కర్ణంగారి భార్య నన్ను చూసి సంతో షించింది.

మంగమ్మ "మీ అమ్మా, నాన్నా వస్తా

నచే అమ్మాయి" అంటూ ఆరాలు తీసింది. అందరూ తలో విధమైన ప్రశ్నలూ అడిగారు. తోచిన జవాబులు చెప్పి వచ్చాను.

ఇంట్లో కాలు పెడుతుండగా గుమ్మంలో ఎదురయాడు కృష్ణ.

అతని వెంట ఇంకో ఇద్దరు అబ్బాయిలున్నారు. వాళ్ళంతా ఎక్కడికో వెడుతున్నట్టున్నారు. నన్ను చూడగానే ఆగి అతను, "మీనా! నాతో వస్తావా? నీ కోటి చూపిస్తాను" అన్నాడు.

"ఆ! ఎక్కడికి?" అన్నాను వెంటనే ఒప్పేసుకుంటూ కుతూహలంగా.

"ఇక్కడ నాకు తెలిసిన వాళ్ళది పెళ్లి అయింది. పెళ్లి కూతురిని పెళ్ళికొడుకుని చూద్దువుగాని" అన్నాడు.

"ఉండు, అత్తయ్యకి చెప్పి వస్తాను."

నేను లోపలకి పరుగెత్తి అత్తయ్య చేతిలో కుంకుమ భరిణ పెట్టి కృష్ణతో వెళ్తున్నానని చెప్పి బైటకి వచ్చేశాను.

అత్తయ్య నా వెంటే బైటకి వచ్చింది. అత్తయ్య వెనకే సుందరి కూడా వుంది.

"ఇప్పుడు వెళితే ఎప్పుడు రావటం? పొద్దెక్కింది. భోజనాల వేళ మించి పోతుంటా" అంది అత్తయ్య.

"పర్వాలేదమ్మా. ఇప్పుడే వస్తాను. నేను వెళ్ళకపోతే గోపాలం వూరుకోడు." అన్నాడు కృష్ణ.

దోవలో "గోపాలం ఎవరు?" అని అడిగాను.

"నా పక్క పొలం చేస్తాడు. పక్కా రైతుబిడ్డ." రైతుబిడ్డ అన్న పదాన్ని గర్వంగా వత్తి పలుకుతూ అన్నాడు.

వూరికి కుడివైపున వుంది ఇల్లు.

మేం వెళ్ళేసరికి పెళ్ళి అయిపోయింది.

పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కూర్చుని వున్నారు. వాళ్ల ఎదురుగా జనం దడి గట్టినట్టు గుంపుగా నిలబడ్డారు. వాళ్ళు దేన్నో శ్రద్ధగా, ఆనందంగా, తన్మయత్వంతో చూస్తున్నారు. మమ్మల్ని చూడగానే తొలిగి దారి యిచ్చారు.

అక్కడున్న అందరి తన్మయత్వానికి కారణం నాకు తెలిసింది.

ఆరుగురు వయసులో వున్న కుర్రాళ్లు డప్పులు చేత్తో పట్టుకుని, లయ, తాళం తప్పకుండా అడుగులు వేస్తూ మోగిస్తున్నారు.

ఈ డప్పు[illegible]వాయిద్యం నాకు తెలుసు! ఒకసారి అమ్మ క్లబ్ యానివర్సరీకి ప్రత్యేకంగా రాను, పోనూ ఖర్చులు యిచ్చి వాళ్ళని పిలిపించింది. ప్రోగ్రాం అంతటిలోకీ యీ డప్పుల వాయిద్యం అద్భుతంగా వుందని పత్రికల వాళ్లతోసహా అందరూ అమ్మని యెంతగానో పొగిడారు.

(సశేషం)

Published by D.H. Rao, at No.1 Arcot Road, Madras-26.
Printed by him at Kranti Press,
12, Francis Joseph Street, Madras-1
Controlling Editor : Sri "CHAKRAPANI"



# ఫొటోగ్రఫీలో వినోదం కోసం ఆగ్ఫా క్లిక్ III

అభ్యాసానికి, అనుదిన వినియోగానికి అత్యుత్తమం

- ఉపయోగించుటకు తేలిక. ఎడ్జస్ట్‌మెంట్లు అవసరం లేదు.
- ప్రతి 120 రోలుతో, 12 పెద్ద సైజు (6 x 6 సెమీ) చిత్రాలు తీయవచ్చు.
- ఎవర్-రెడీ కేస్, పోర్ట్రెయిట్ లెన్సు, మరియు ఫ్లాష్ గన్ అదనపు వెలకు లభిస్తాయి.

ఇంకా ఎక్కువ ఉజ్వలమైన చిత్రాలు కావాలంటే, ప్రత్యేక యాక్రోమాట్ ఎఫ్. 8.8 లెన్సు అమర్చియున్న ఆగ్ఫా క్లిక్ IV చూడండి. మసక వెలుతురులో కూడా. దీనితో మెరిసిపోయే చిత్రాలు తీయవచ్చు. వెల 62.50 (పన్నులు అదనం)

చక్కని మిసమిసలు గొలిపే ప్రింట్లు, ఎన్లార్జిమెంట్లు కావాలంటే, ఆగ్ఫా పేపరే వాడండి.

ఆథరైజ్డ్ ఆగ్ఫా డీలర్లు అందరివద్ద లభిస్తాయి.

ఆగ్ఫా గెవార్ట్ సహకారంతో తయారు చేయువారు:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి., బరోడా



రు. 46.50 (పన్నులు అదనం)




సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి . క్రొత్త ఢిల్లీ . కలకత్తా . మద్రాసు






® ఫొటోగ్రాఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు, ఆగ్ఫా-గెవార్ట్ అంట్‌వెర్ప్-లివర్కుసెన్ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్

**ఆగ్ఫా క్లిక్—భారతదేశంలో విస్తార ప్రచారంగల కెమేరా**

CMAG-139-203 Tel

YUVA August '70 One Rupee Regd. No. M 8647